శ్రీరస్తు

# చిత్రభారతము

చరిగొండ ధర్మన్నప్రణీతము.




చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.


 [Price Rs. 1-8-0.

# ఆంధ్ర గ్రంథములు.

---

## పద్యకావ్యములు.

| ప్రతి 1-కి | | రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | [illegible] |
| అధ్యాత్మరామాయణము | ... | 1 | 0 |
| *అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 1 | 4 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 10 |
| * అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతోనున్నది | ... | 5 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| * కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 8 |
| * కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | ... | 0 | 12 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 10 |
| గరుడోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము | ... | 0 | 8 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |

శ్రీ ర స్తు.

# చిత్రభారతము

చరికొండ ధర్మన్న ప్రణీతము



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ

ప్ర క టి త ము.

1934

# పీ ఠి క.

తొలుదొలుత నీచిత్రభారతమును మ. రా. రా. శ్రీ రావుబహాదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమ చింతామణి మాసపత్త్రికయందుఁ బ్రకటించి 1898 సం.న బుస్తకరూపముగాఁ బ్రచురించియుండిరి. అప్పుడు వారీగ్రంథమున కీక్రిందివిధమునఁ బీఠిక వ్రాసియుండిరి:—

"ఈచిత్రభారతము మిక్కిలి యపురూపమయిన గ్రంథము. ఇది యిప్పుడు దొరకుటయే యరుదుగ నున్నది. బ్రహ్మశ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమశబ్దరత్నాకరనిఘంటువులో దీనిని నామమాత్రావశిష్టములైన గ్రంథములలో నొకదానినిగాఁ జేర్చియున్నారు. పోలవరపు జమీందారుగారగు బ్రహ్మశ్రీ శ్రీరావు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణరావుగారి సాహాయ్యమువలనఁ గొంతకాలముక్రిందట నాకీగ్రంథముయొక్క ప్రతియొకటి లభించెను. అదియును శుద్ధమయినది కాదు. అక్కడక్కడఁ గొన్నిచోట్ల పద్యపాదములు సహితము విడువఁబడియుండినవి. అయినను నాకుఁ బ్రత్యంతరము దొరకనిపోవుటచేతను, ఇంకను నుపేక్షచేసినచో నిలుచియున్న ప్రతియు నశించిపోవునేమో యన్న భీతి గలుగుటచేతను, లోపించినభాగములను యథాశక్తిని పూరించి వ్రాసి వలయుసవరణలు చేసి, స్ఖాలిత్యములను సంస్కరించి చింతామణిలోఁ బ్రచురింప నారంభించి యిప్పటికి గ్రంథము నొకరీతిని సమగ్రముగ ముద్రింపించితిని. దీని ప్రతి యెవ్వరియొద్దనైన నున్నచో వారు దయచేసి నాకుఁ బంపినయెడల సరిచూచి కొంత సంస్కరణము చేసి వారి ప్రతిని వారికి వందనపూర్వకముగాఁ బంపివేసెదను.

చెన్నపురి, సరస్వతీనిలయము,
23, [illegible],
10-1-1898 సం॥

కందుకూరి-వీరేశలింగము."

పిమ్మట, ననేకసంస్కృతాంధ్రగ్రంథప్రకాశకులును సుప్రసిద్ధులును, బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి పుత్త్రులును, మన్మిత్త్రులు నగు వేంకటేశ్వరశాస్త్రులు గారు కొంత కాలముక్రిందట నేదియో ప్రస్తావనవశమునఁ "చిత్రభారతము పరిశుద్ధముగాఁ బ్రకటింపవలయునని యున్నది; కావున నది మీరొకసారి యామూలాగ్రముగఁ జదివి సాధ్యమైనంత వఱకు ముద్రాప్రమాదాదులు సవరించి యిచ్చినయెడల వెంటనే పునర్ముద్రణ ప్రయత్నము చేయుదు" నని యప్పుడు శ్రీవీరేశలింగముపంతులుగారు ప్రచురించిన చిత్రభారతపుస్తక మొకటి నాకిచ్చిరి. నేనది యొకవిధముగాఁ జదివిచూచితిని; గాని, నాకది ప్రత్యంతరసాహాయ్యములేక చక్కఁగాఁ బరిష్కరించుటకు సాధ్యముకాదని తోఁచినది. తరువాత నేనొకప్పుడు ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమున బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారితో నీగ్రంథమునుగూర్చి ప్రస్తావింపఁగా వారిప్పుడీభాండాగారమునఁ బరిపూర్ణమైన చిత్రభారతప్రతి కలదని సెలవిచ్చిరి. ఈసంగతి నేను మన్మిత్త్రులగు వేంకటేశ్వరశాస్త్రులుగారితో మనవిచేసి, నాచే నాఁడు జదువఁగా నిచ్చినపుస్తకము నచ్చటచ్చటఁ గొన్నికొన్ని సవరణలు చేసియుంచినదానిని మరల వారికిచ్చితిని. వారాగ్రంథమును బ్రభాకరశాస్త్రులవారిసాహాయ్యమున భాండాగారప్రతితోఁ జక్కఁగా సరిచూపించి సవరణలు చేయించి యిప్పటికీవిధమున సంపూర్ణముగను నిర్దుష్టముగాను బ్రకటింపఁగలిగిరి. అందందు దొరలిన స్వల్పములగు ముద్రాప్రమాదములు క్షంతవ్యములు.

వ్యయప్రయాసములు గణింపక యిట్లనేకసంస్కృతాంధ్రగ్రంథములను నిర్దుష్టములుగను, మనోహరములుగను ముద్రింపించి ప్రకటించుచుఁ జిరకాలమునుండి యుభయ భాషాసేవచేయుచున్న వావిళ్లవారి కాంధ్రులెల్లరును గృతజ్ఞులుగాకయుండరు.

ఈచిత్రభారతమును రచియించినకవి చరిగొండ ధర్మన్న. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తిమ్మనామాత్యునకును, మాదమ్మకును బుత్త్రుఁడు. వైష్ణవభక్తుఁడు. శతలేఖినీ సురత్రాణబిరుదకలితుఁడు. ఈవిషయములన్నియును గ్రంథకర్త యీక్రిందిపద్యమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు:—

సీ. కౌండిన్యగోత్రదుగ్ధసముద్రచంద్రు నా
 పస్తంబసూత్రశోభనగరిష్ఠు
సర్వవిద్యాభిజ్ఞుఁ జరిగొండ తిమ్మనా
 మాత్యాగ్రణికి మాదమకును గూర్మి
నందను నళినాంతు నారాయణధ్యాన
 తత్పరు శ్రీరంగధామ సదృశ
భట్ట పరాశరప్రభురంగగురుపాద
 నీరేజబంభరు నిర్మలాత్ము
తే. ధర్మనాహ్వయు సత్కవితాధురీణు
దాంతు శతలేఖినీ సురత్రాణ బిరుద
కలితు నను జేడ్కఁ బిలిపించి గారవించి
తేనియలు చిల్క నిట్లని యానతిచ్చె.

ఈకవి యీగ్రంథమును, ఏకశిలానగరముం బరిపాలించిన "మానభూపాలచిత్తాంబుఖానునకు" మంత్రియైన యెనుములపల్లి పెద్దామాత్యునకుఁ గృతి యిచ్చెను. శ్రీ వీరేశలింగముఁపంతులుగారు ప్రకటించిన గ్రంథమునందును, వారి యాంధ్రకవుల చరిత్రమునందును, గృతిపతియింటిపేరు "ఇనుములపల్లి" వారనియును, అతని ప్రభువు పేరు "మానభూనాథుఁ" డనియును గనుపట్టుచున్నది. చూ. "శ్రీ యినుముఁ పల్లి మాదసచివేశ్వరు పెద్దనమందిరంబునకా." "మానభూనాథ చిత్తాబ్జభానుఁ డతఁడు" మొదలైనవి. ఇది యిట్లుండఁగా నిప్పుడు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగ ప్రతినిబట్టి సవరింపఁబడిన యీగ్రంథమునఁ గృతిపతియింటిపేరు "ఎనుములపల్లి"వారనియును, అతనిప్రభునిపేప "మానభూపాల (చిత్తాంబుఖాను)" డనియును గనఁబడుచున్నది. చూ. "శ్రీ యెనుముఁ పల్లి మాదసచివేశ్వరుపెద్దన" "మానభూపాలచిత్తాంబుఖాను ఘనుఁడు" "మానధనుఁడైన" "చిత్తాంబుఖాన"విభుఁడు మొదలైనవి.

శ్రీపంతులుగారు తమ యాంధ్రకవులచరిత్రమునం దీ కవికాలనిర్ణయముం జేయుసందర్భమున నిట్లు వ్రాసియున్నారు

"ఈ మానభూనాథుఁ డెవ్వరో గ్రంథమువలన స్పష్టపడదుగాని యెనిమిదవయాశ్వాసాదియందలి యీక్రింది కృతిపతిసంబోధనపద్యమువలన నతఁడు శ్రీరంగరాయనికాలములోని యొక మండలేశ్వరుఁడని యూహింపఁదగియున్నది.

క. శ్రీరంగరాజసేవా పారంగతహృదయ!...

మొదటి శ్రీరంగరాజు విజయనగరసంస్థానమును ౧౫౭౪వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫ వ సంవత్సరము వఱకును పాలించెను. రెండవ శ్రీరంగరాజు ౧౬౧౪-వ సంవత్సరమునకు తరువాత రాజ్యమునకువచ్చెను. ఈకవి యీ యిరువురిరాజులలో నొకరికాలమునం దుండినందున. పదు నాఱవశతాబ్దముయొక్క యంతమునందో పదునేడవశతాబ్దముయొక్క యాదియందో యుండియుండుటకు సందేహము లేదు. ఇదిగాక కవియొక్కకాలమును నిర్ణయించుటకు గ్రంథమునందే యింకొకయాధారము కనఁబడుచున్నది. కృతినాయకునివంశమును వర్ణించుచు కందాళ అప్పలాచార్యులు కృతిపతియొక్క తండ్రికిని, పెదతండ్రికిని గురువైన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. వందారువ్రజపోషమేఘపవనుఁ వారాశిగంభీరు నా
నందాత్ముఁ హరిపాదభక్తు నిఖిలామ్నాయజ్ఞు విశ్వంభరా
మందార క్షితిజాతముఁ నిగమసన్మార్గప్రతిష్ఠాపరుఁ
గందాళప్పగురుఁ వివేకనిధి లోకఖ్యాతు వర్ణించుచుఁ.

క. ఆదేశికపదకమలము, లాదరమున హృదయపీథి ననవరతంబుఁ
మోదమున నిల్పి శ్రీలల, నాథవునిఁ గొలుతురు నారనయుం మాదనయుం.

ఈపద్యములనుబట్టి యీచిత్రభారతకృతిపతియు పాండురంగమాహాత్మ్యకృతిపతి కాలములోనివాఁడయిన శ్లోకగురుఁ శిష్యత్వమునలనఁ దేటపడుచున్నందున, ఈధర్మకవి యించుమించుగా తెనాలిరామకృష్ణుని కాలమువాఁడే. కందాళ అప్పలాచార్యులుగారు చిత్రభారతకృతిపతి తండ్రికి గురువైనందున, ధర్మకవి రామకృష్ణకవికిఁ గొన్నిసంవత్సరములుతరువాత

నుండిన నుండవచ్చును...ఈకవియొక్క చరిత్రమునుగూర్చి యిప్పుడు చెప్పినదానికంటె నధికమేమియుఁ దెలియరా నందున..."

శ్రీ వీరేశలింగముపంతులుగారు, వారికిలభించిన ప్రతి యందలి పాఠమునుబట్టి యీ "మానభూనాథుఁ" డెవ్వరో గ్రంథమువలన స్పష్టపడదు" అని వ్రాసియుండవచ్చును. ఇప్పుడు లభించినప్రతియందలి పాఠమునుబట్టి యీ "మాన భూపాలచిత్తాంబుజానఘనుఁడు" గాని, "మానధనుఁడైన చిత్తాంబుజానవిభుఁడు"గాని యెవ్వరైయున్నదియుఁ తెలిసి కొనుట కవకాశముకలిగినదేమో చరిత్రకారులు పరిశీలింతురు గాత! ఈ చిత్రభారతమునందలికవిత్వ "మనర్గళమైనధార కలదై సలక్షణముగా నున్నది." కావున సరసులు చవిచూచె దరుగాత!

గులాబీ
అడయారు, మద్రాసు.
24 జూలై 1934.

ఓలేటి వేంకటరామశాస్త్రి.

శ్రీ ర స్తు.

# చిత్రభారతము

## పీఠిక.



లక్ష్మీకుచపారిజాతకలికా
శ్లిష్టోరువక్షుండు దే
వాళిమౌళిమణిప్రభారుచిరపా
దాంభోజుఁ డుద్యద్దయా
లీలన్ ధర్మపురీశ్వరుండు గుణశా
లిన్ మాదనాంభోనిధి
ప్రాలేయద్యుతిఁ బెద్దనప్రభు సమ
గ్రశ్రీయుతుం జేయుతన్. 1

చ. మనసిజుఁ గన్నతల్లి నెఱమాటలతొయ్యలి యత్తగారు చం
ద్రునిసయిదోడు శంకరునితోయజలోచనతోడిజోడు క
న్గొనల సిరుల్దొలంకు హరికోమలి యెప్పుడు నిల్పుఁ గాత శ్రీ
యెనుములపల్లి మాదసచివేశ్వరు పెద్దనమందిరంబునన్. 2

మ. దినముల్ బర్వతజాతమీఁది యనురక్తిం బాయఁగాఁజాలకే
తనదేహంబున నొక్కపాలొసఁగి తత్తచ్ఛీలచేతన్ దనర్చిం
ర్చిన లోకంబులకెల్లఁ దల్లియును దండ్రిం దానె యాదేవుఁ
ఫున శ్రీయెన్ములపల్లి పెద్దవిభునిం బ్రోచున్ దయాయుక్తుఁడై.

చ. పొలుపుగ నల్లవేల్పునుఁబొక్కిలితామరపువ్వుముద్దుఁగో
డలిచెలువంబుఁ జూచి పొగడ న్ముఖపంకజమొక్కటిట్లు నా

కలవడదంచు మోములురయంబుననాలుగుదాల్చి మెచ్చునా
నలినజుఁడిచ్చుఁగాతఁ గృతినాథున కర్థిఁ జిరాయురున్నతుల్.

ఉ. సాకసపుంభవృందము పరసంబున నాడురహస్యభాషఁ ద
ద్వ్యాకనిబద్ధకీరము ధ్రువంబుగ నందఱిమ్రోలఁ బల్కఁగా
దూరమునందు సంతసము దూఁకొన నొయ్యన బుజ్జగించునా
భారతి నిల్పుఁగావుత శుభస్థితి నెప్పుడు మన్ముఖంబునన్. 5

క. చిట్టిలుక నెక్కి యాడెడు
అట్టడిరౌతునకుఁ జిలువరాజన్నిదముల్
గట్టుకొని మెఱయు శంకరు
పట్టికి నత్యంతభక్తిఁ బ్రణతి యొనర్తున్. 6

వ. తదనంతరంబ. 7

సీ. వాల్మీకిముని కభివందనం బొనరించి
బాదరాయణునకుఁ బ్రణతి చేసి
బాణమయూరులపాదంబులకు మ్రొక్కి
కాళిదాసునకుఁ గేల్మోడ్చి మొగిచి
మాఘమల్లదేవేకుమారభారవిమాఘు
జయదేవులకు నమస్కార మొసఁగి
ఘను నన్నపార్యుఁ దిక్కనసోమయాజుల
వర్ణించి వేములవాడభీము

తే. నాచనామాత్యు సోము శ్రీనాథుఁ జిమ్మ
పూఁడియమరేశు బమ్మెరపోతరాజు
శంభుదాసు పాలికిభాస్కరుఁడు నాది
యైనసుకవులకెల్ల నెయ్యమున నెరఁగి. 8

వ. ఇవ్విధంబున నభిమతదేవతాప్రార్థనంబును బురాతనమహా
కవికీర్తనంబునుం జేసి యొక్కమహాప్రబంధరచనాకుతూ
హలాయత్తచిత్తుండనై యున్నసమయంబున. 9

సీ. అక్షయ్యభాగ్యవదక్షవదక్షీణభుజా
కౌక్షేయకక్షత్రరక్షితంబు
హాటకకోటీశాతకుంభకుంభప్రభా
మండితాంభోజాప్తమండలంబు
గంధసింధురదానగంధాంధమత్తపు
ష్పంధయఝంకారబంధురంబు
విశ్వవిశ్వంభరాజనశ్వరైశ్వర్యప్ర
దాశ్వరత్నవ్రాతశాశ్వతంబు
తే. సంతతోత్సవతోషితశంభులింగ
సమ్ముఖేందుశిలాసదనచారుమంట
పస్థలీనృత్యదంగనాపాదరణిత
నూపురంబగు నేకశిలాపురంబు 10

సీ. చలివేఁడివెలుఁగులై కలువదమ్ముల నేలు
కనుదోయి నేప్రొద్దుఁ గదుపు చిలుక
మేలైన తామరమేడ నాడెడుకన్య
కిరవైన యురము పెంపొంది నెఱపఁ
వోలుచూలుబాపనదొర నింపుతోఁ గన్న
పాక్కలిపుపటాలిపూవు చెలఁగఁ
బదియాఱువన్నెలపసిమిఁ జూపువింత
సరిగదుప్పటి మేనఁ జౌకళింపఁ
తే. బ్రాఁజదువుగుంపుమ్రోఁతలు పరిఢవిల్ల
మేటిజగముల నాపుమిన్నేటిపాప

పుట్టినిల్లైనయడుగులఁ బొల్చి యెపుడు
సంతసంబున వెలయుఁ బాంచాలివిభుఁడు. 11

తే. ఆజగన్నాథపరమదయాత్తమధ్య
మక్షమామండలుండు భీమప్రతాప
ఖండపరశుండు వైభవాఖండలుండు
భోగివంశాబ్ధిచంద్రుఁడు భూరిబలుఁడు. 12

సీ. అనువత్సరంబు బ్రాహ్మణులకు గోసహ
స్రము లిచ్చు నృగనరేశ్వరు నిరీతిఁ
గంధుల కెనగఁ బాకాలచెర్వాదిగాఁ
జెఱువులు నిలుపు సగరుని కరణి
దివ్యతప్రతాపుఁ డై దిగ్విజయంబుఁ గా
వించు మాంధాతృభూవిభు నిలిచి
దేవభూదేవతార్థిశ్రేణి కగ్రహా
రము లిచ్చు భార్గవరాముపగిది

తే. నిందుశేఖరపాదారవిందయుగళ
భావనాపరుఁ డంగనాపాంచబాణుఁ
డతుల ధైర్యాభిభూతహిమాచలుండు
మానభూపాలచిత్తాంబుఖానఘనుఁడు. 13

సీ. సర్వసర్వంసహాసంరక్షణక్రియా
చాతుర్యసప్తమచక్రవర్తి
హారిదంతకరిదంతహారిరాజసురభూజ
తారకానిర్మలోదారకీర్తి
దుర్వారపరిపంథిగర్వాగాధాంధకా
రచ్ఛటాహారణమార్తాండమూర్తి

హేమభూధేనుగంధేభఘోటకదాన
ధారాకృతాంభోనిధానపూర్తి
తే. యాతఁ డింపొందు లాట కర్ణాట భోట
ఝాట కరహాట పాండ్య పాంచాలగౌడ
చోళ మళయాళ రాజసంస్తూయమాన
మానధనుఁడైన చిత్తాంబుజాసవిభుఁడు. 14

శా. ఆ రాజేంద్రశిఖావతంసనిజబాహాయుక్తవిశ్వంభరా
ధౌరేయుండు విరోధిమంత్రిముఖముఁ బ్రాపతుఁ డుద్య
ద్ధమా, పారీణుండు పటీరహారరసుధాపాణింధమశ్రీయశో
హారుం డెన్మలపల్లిమాధవవిభుం డ్డామాత్యుఁ డుల్లంఘిసైను. 15

సీ. లలితశాస్త్రాగమాలంకారనాటక
వ్యాఖ్యానదక్షవిద్వజ్జనంబు
లత్యంతమధురవాక్యప్రౌఢకావ్యని
ర్మాణబంధురకవిగ్రామణులును
శ్రవణసమ్మోదసంజనకారణహృద్య
గానవిద్యాభిజ్ఞగాయకులును
దత్తిలభరతమతంగాదిమునికృత
నాట్యకళా[1]ప్రాజ్ఞనర్తకులును
తే. బాంధవులు సోదరులు హితుల్ భామినులును
వందిమాగధవరులుఁ గొల్వంగ విమాత్న
చంద్రకాంతశిలానద్ధసౌధరత్న
పీఠికాసీనుఁడై మనఃప్రేమ మీఱి. 16

1 ప్రౌఢ.

సీ. కౌండిన్యగోత్రదుగ్ధసముద్రచంద్రు నా
పస్తంబసూత్రశోభనగరిష్ఠు
సర్వవిద్యాభిజ్ఞుఁ జరిగొండ తిమ్మనా
మాత్యాగ్రణికి మాదమకును గూర్మి
నందను నతిశాంతు నారాయణాఖ్యాన
తత్పరు శ్రీరంగధామసదృశ
భట్టపరాశరప్రభురంగగురుపాద
నీరేజబంభరు నిర్మలాత్ము
తే. ధర్మనాహ్వయు సత్కవితాధురీణు
దాంతు శతలేఖనీసురత్రాణబిరుద
కలితు నను వేడ్కఁ బిల్పించి గారవించి
తేనియలు చిల్క నిట్లని యానతిచ్చె. 17

మ. శతలేఖన్యవధానపద్యరచనాసంధానసురత్రాణచి
హ్నితనామా! చరిగొండ ధర్మసుకవీ! నీవాగ్విలాసంబు లా
శితికంఠోజ్జ్వలజూటకోటరకుటీశీతాంశురేఖాసుధా
న్వితగంగాకనకాబ్జనిర్భర రసావిర్భూతమాధుర్యముల్. 18
తే. కావున విచిత్రగతి నలంకారసరణి
మీఱ రసములు సిప్పిల మెచ్చు లొలుకఁ
దెనుఁగు గావింపు నా పేర ననఘ సుకవి
ధీరు లరుదందఁగాఁ జిత్రభారతంబు. 19

వ. అని యానతిచ్చి కర్పూరతాంబూలంబుతోడఁ గూడ జాం
బూనదాంబరాభరణ సంకుమదమృగమదగంధ సారంబులు
దోరవాత్తులుగా నొసంగి యనిపిన నేనును భుజబలభీమ
ప్రతిగండభైరవ యిరువత్తు గండగోవాళ గండరగండ

భేరుండ మండలీకమృగబేంటెగార సమరరాహుత్తరాయ,
సంగ్రామధనంజయ, కోదండవిద్యాపాండిత్యరఘురామ,
యపరిమితభూదానపరశురామ, నిరంతరభోగసుత్రామ,
యష్టదిగ్రాజమనోభయంకర, దుష్టలాంకుశలారూసరిగ
జాంకుశ, [1]ఇప్పత్తెళుదండియరనాయంకరతలగుండగండ,
హెన్నుకట్టుకుదిరికట్టుమండలీకరగండ, [2]యెబిరుందగండ
సర్వబిరుదరకొమర, వేశ్యాభుజంగ, యనవరతకనక
కర్పూరదానధారాప్రవాహాద్యనేకబిరుద ప్రశస్తమధ్య
మమండలాధీశ్వర, భోగివంశపయఃపారావారరాకాసుధా
కర, శ్రీ చిత్తాంబుఖానమహీమహేంద్ర దక్షిణబాహా
పరిలసద్విశ్వవిశ్వంభరాభారధౌరేయుండును, సుజనవిధే
యుండును, భాషానిర్జితభోగీంద్రుండును, భోగవినిర్జిత
దేవేంద్రుండును, ధరణీమండల వదాన్యాగ్రణియును,
బంధుచింతామణియునునగు నమ్మంత్రిమణివాక్యంబు లంగీక
రించి మద్విరచితకావ్యకన్యకాకంఠమంగళసూత్రాయమా
నంబగు తదీయవంశక్రమం బభివర్ణించెద. 20

సీ. కీర్తింపఁగాఁ ద్రిలోకీపాలనక్రియా
దక్షుఁడై యెవ్వానితనయుఁ డమరె
సకలజగత్తమశ్ఛయసంహృతిక్రియా
దక్షుఁడై యెవ్వానితనయుఁ డమరె
భువనత్రయీపదాంభోజమానక్రియా
దక్షుఁడై యెవ్వానితనయుఁ డమరె
సర్వసర్వంసహాసంవాహనక్రియా
దక్షుఁడై యెవ్వానితనయుఁ డమరె

---

1 హి. 2 యెంతెంబరగండ.

ఆ. నతఁడు మునికోటిలో మొదలైనమేటి
జంగమస్థావరంబులజన్మభూమి
పుణ్యచరితుండు విమలతపోధనుండు
ప్రబలుఁడై మించి కశ్యపబ్రహ్మ వెలసె. 21

క. ఆమునికులదుగ్ధాంబుధి
సోముఁడు భువనప్రపూర్ణశుభ్రయశశ్శ్రీ
కాముఁడు పద్మాక్షీజన
కాముఁడు చెన్నప్రధానఘనుఁ డుదయించెన్. 22

చ. ధరపయిఁ జెన్నమంత్రి వనితామణియైతగు కాంచమాం
బకున్, సురుచిరకీర్తినారనయు శుభ్రయశోనిధి లక్క
రాజు శ్రీ, హరిచరణారవిందయుగళార్చనశీలుఁడు వల్ల
భన్న సు, స్థిరమతి సింగమంత్రియు నృసింహునరంబునఁ
బుట్టి యున్నతిన్. 23

క. అందగ్రజుండు నరహరి
కుందేందుసమానకీర్తి గుణవతి లక్కా
యిం దగ నుద్వాహంబయి
నందితసుజనుల ముగురు తనయులం గనియెన్. 24

వ. వారెవ్వరనిన. 25

ఉ. ధీరుఁడు సింగమంత్రియును ధీజనవశ్యుఁడు ధర్మరాజు ల
క్ష్మీరమణీశపాదయుగచింతనశీలుఁడు తిమ్మనార్యుఁడున్
ధారుణి నుల్లసిల్లిరి వదాన్యగుణంబుల నందు సర్వధా
త్రీరమణస్తుతుం డనఁగఁ దిమ్మనమంత్రి చెలంగు నున్నతిన్.

క. చెన్నుగ నాతిమ్మన[1] య
మ్మన్నవలనఁ గనియె రూపమదనుల గుణసం
పన్నిధుల నత్యుదారుల
నన్నయమంత్రీంద్రు వేంగళార్యునిఁ గడఁకన్. 27

వ. అందు. 28

క. అన్నయ్య యర్థికోటికి
నన్నయ్య సమస్తవాంఛితార్థప్రదుఁడై
మున్నీడు లేనిసంపద
మున్నీటి తెలుంగునను సమున్నతిఁ దనరెన్. 29

ఉ. అమ్మహనీయకీర్తికిఁ బ్రియంబగు తమ్ముఁడు వెంగళన్న రూ
పమ్మున దానసంపదను బాహుబలంబున రూఢి మించఁగా
నెమ్మది లజ్జ నొందుచును నీరజసంభవుఁ[2]డైన మేటి పెం
దమ్ముఁడు సాగరాత్మభవతమ్ముఁడు ధర్మతనూజుతమ్ముఁడున్.

తే. తజ్జనకపూర్వజుండగు ధర్మరాజు
ధర్మపథమున విహరించు ధర్మరాజు
శ్రీరమాధీశపాదరాజీవభక్తుఁ
డై తనర్చెను శుకయోగియట్ల జగతి. 31

వ. అందగ్రజుండు. 32

చ. నరహరిమంత్రిసింగఁడు దినంబును విప్రులకోర్కు లీయఁ ద
ద్గురుతరకీర్తి మించి సురకోటుల సద్నుతమందఁ జేయఁగాఁ
బోరిఁబోరిఁ గల్పకంబు లుడి[3]వోయె మరున్నది వట్టివోయెఁ
జందురుఁడును గందె సాగరము తోడనె భంగమునొందె
సిగ్గునన్. 33

---

1 ఁ గడుమన్ననతోఁ 2. డాసినట్టి. 3 వోయెను వెల్వలఁబోయె ముబ్బు. చం.

క. ఆమంత్రి కులవరేణ్యుని
భామామణి సింగమాంబ పతిహితసుగుణ
స్తోమావలంబ కనియెన్
హేమాచల ధైర్యయుతుల నిరువురసుతులన్. 34

సీ. పరమదయాసక్తి హరిపాదభక్తులు
మానితాచారంబుగా నొనర్చి
గురునమస్కారభూసురపురస్కారంబు
లనుదినవ్రతముగా నాచరించి
శిష్టరక్షణమును దుష్టశిక్షణమును
నిత్యకృత్యంబుగా నిర్వహించి
సత్యభాషణమును సాధుపోషణమును
నైజవర్తనముగా నోజపఱచి
తే. శౌనక వ్యాస శుక పరాశర వసిష్ఠ
నర విభీషణ గాంగేయ నారదాది
పరమభాగవతోత్తమ స్ఫురణమించు
వారు నారయ మాదయ్యగార లవని. 35

శా. వందారువ్రజదోష మేఘపవనున్ వారాశిగంభీరు నా
నందాత్మున్ హరిపాదభక్తు నిఖిలామ్నాయజ్ఞు విశ్వంభరా
మందారక్షితిజాతము న్నిగమ సన్మార్గప్రతిష్ఠాపకున్
గందాళాప్పగురున్ వివేకనిధి లోకఖ్యాతు వర్ణించుచున్.

క. ఆదేశికపదకమలము
లాదరమున హృదయవీథి ననవరతంబున్
మోదమున నిలిపి శ్రీలల
నాదయ మనినారు నారనయు మాదనయున్. 37

వ. అందు. 38

సీ. ఏమంత్రికులదైవ మిందిరావల్లభుం
డళగుసింగరి దయాయత్తమూర్తి
యేమంత్రిమందిరం బెల్లభూసురసుహృ
జ్జనసమూహములకు మనికిపట్టు
ఏమంత్రిమానసతామరసంబు స
త్యదయాగుణముల కాస్థానసీమ
యేమంత్రిమతి పన్నగేంద్రపంకజగర్భ
చిత్రగుప్తాదుల సిగ్గుపఱుచు
తే. నతఁడు సతతాన్నదానపరాయణుండు
బ్రహ్మవిద్యాభినవబాదరాయణుండు
రత్నపూజాప్రహృష్టనారాయణుండు
శ్రీయుతుఁడు సింగమంత్రినారాయణుండు. 39

క. క్షమయెల్లఁ దానె కైకొని
కమలాక్షపదాబ్జభక్తి గలిగి సదా భో
గములం బొలుపొంది యనం
తమహిమచే సింగమంత్రి నారయ వెలయున్. 40

తే. కోరియాతండు శ్రీవత్సగోత్రజాతుఁ
డైన [1]యప్పలనారయ యతివ సింగ
సానిగాంచిన చెన్నాఖ్యచంద్రవదనఁ
బరిణయంబయ్యె సంతోషభరితుఁ డగుచు. 41

సీ. వనజాక్షపదభక్తి ననసూయ యాటచే
నఖిలప్రపంచసమాత్మయయ్యె

---

1 యుప్పల.

ననిశంబు ధర్మవర్తన నరుంధతియాటఁ
బరమపాతివ్రత్యభరితయయ్యె
శ్రీసర్వమంగళాకృతిఁ దనర్పుటఁ జేసి
సత్కుమారోదయస్థానయయ్యె
ననమకుమారూప మంగీకరించుట
నధికగోత్రాశ్రయఖ్యాతయయ్యె
తే. నరయ నారాయణప్రియ యగుటకతన
లక్షణాన్విత లావణ్యలక్ష్మి యయ్యె
ననుచునందఱుఁ గొనియాడ నతిశయించుఁ
జిరయశోగుణనికురంబ చెన్నమాంబ. 42

క. ఆదంపతులకుఁ గలిగిరి
తేజోవిభవమున విమలదీధితిభాస్వ
ద్రాజులు వైభవనిర్జర
రాజులు నరసింగవిభుఁడు రంగప్రభుఁడుఁ. 43

సీ. అమితప్రభావసౌమ్యాకారములయందుఁ
బ్రతిపోల్ప నశ్వినీసుతులనంగఁ
బరమకృపావిష్ణుపాదార్చనలయందు
గణుతింప రామలక్ష్మణులనంగఁ
జండకోదండదీక్షాసాహసములందు
రవణింపఁగాఁ గుశలవులనంగ
నురుతరబాహాబలోపాయములయందు
వివరింప రామకేశవులనంగఁ
తే. దగిలివర్తించుపూవును దావియనఁగఁ
దనువుఁ బ్రాణంబుననఁ బొగడ్తలకునెక్కి

పాయరానట్టి చెలిమి సౌభ్రాత్రమహిమఁ
జెంగలింతురు నరసింగరంగఘనులు. 44

ఉ. వారలలోన నగ్రజుఁ డవారితశౌర్యధురంధరుండు ది
గ్వారణదంతసంకలిత¹భద్రయశోవిభవుండు దీనమం
దారుఁడు సంగరస్థలవిదారితశాత్రవుఁ డంగనామనో
హారుఁడు నారసింహసచివాగ్రణి మించు వసుంధరాస్థలిన్.

ఉ. సాగర యక్షరాజ జలజాతహితాత్మజ ²వారివాహ తా
రాగణనాథులం బెలియరాక కవుల్ నెఱదాతలందు రా
యేగురి దానసంపదలు నేగుఱి సంతతభోగ వైభవ
శ్రీగుణశాలి నారయనృసింహునిత్యాగముఁ బేయకొన్న
చోన్. 46

పట్టించె వేడ్క సద్వైష్ణవబ్రాహ్మణ
యాచకతతికి నానార్థములను
మట్టించెఁ గలన సామ్రాణితేజీల చే
మత్తారిరాజన్యమస్తకములఁ
బెట్టించె నెడరైన పృథ్వీస్థలంబుల
ధర్మసత్రంబు లుద్యానములును
గట్టించె నమృతాంశుకంజాప్తతారక
స్థితి మీఱఁ జెఱువులు దేవళములు
నాతఁ డెన్నులపల్లివంశాంబురాశి
తోషకరనిత్యపరిపూర్ణతుహినకరుఁడు
దనరు సర్వంసహాధీశదండనాథ
మకుటమణియైన నరసింగమంత్రివరుఁడు. 47

1 కప్ప. 2 మేఘవాహ.

ఉ. ఆనరసింగమంత్రికిఁ బ్రియంబగు తమ్ముఁడు రంగనాథుఁ డం
భోనిధికన్యకారమణపూజనశీలుఁడు పద్మలోచనా
మానసరాజహంసము సమస్తదిశాపరిపూర్ణకీర్తి ల
క్ష్మీనిధి దండనాథకులశేఖరుఁడై విలసిల్లు నుర్వరన్. 48

తే. రజతభూమిధరంబుతోఁ బ్రతిఘటింప
దేవళము గట్టి నృహరిఁ బ్రతిష్ఠచేసెఁ
గురవిపురమున వైభవస్ఫురణ మెఱయ
మంత్రినారయ రంగనామాత్యఘనుఁడు. 49

సీ. నాగేంద్రకేయూర నరసింహానరసింహా
విఖ్యాత మేమంత్రివిక్రమంబు
సాగరస్వర్ధేనుసంతానసంతాన
విశ్రుతం బేమంత్రివితరణంబు
ధవళనీరేరుహ తారేశతారేశ
సంకాశ మేమంత్రిచారుయశము
పరనృపస్త్రీకుచోపరిహారపరిహార
కారణం బేమంత్రిఖడ్గలతిక

తే. యతఁడు సౌందర్యవిజితదేవాధిరాజ
తనయ ధననాథజాత కందర్ప నిషధ
రాజ సకలాగమజ్ఞానభోజరాజు
బ్రహ్మవంశాంబునిధిరాజు రంగరాజు. 50

క. ఏతజ్జనకానుజుఁడగు
నాతతనయశాలి మాధవార్యుఁడు పుణ్యో
పేతగుణంబుల వెలయు ధ
రాతల కల్పమని సుకవిరాజులు పొగడన్. 51

సీ. జనవినుతాచారమున నిమ్మహామంత్రిఁ
జెప్పి వసిష్ఠునిఁ జెప్పవచ్చు
ననుపమకారుణ్యమున నిమ్మహామంత్రిఁ
జెప్పి శ్రీరామునిఁ జెప్పవచ్చుఁ
బుణ్యపాపవివేకమున నిమ్మహామంత్రిఁ
జెప్పి వైవస్వతుఁ జెప్పవచ్చు
వనజాక్షుపాదభావన నిమ్మహామంత్రిఁ
జెప్పి శ్రీశుకయోగిఁ జెప్పవచ్చు
ఆ. ననఁగ భూమియందు నతిశయకీర్తుల
వెలయు నుభయకులపవిత్రుఁ డగుచు
సిద్ధచరితుఁడైన యెన్ములపలి సింగ
మంత్రి నందనుండు మాధవుండు. 52

తే. అతఁడు కౌశికగోత్ర విఖ్యాతుఁడనఁగఁ
దనరు గొబ్బూరి లక్కయధర్మపత్ని
చెన్నసానమ్మగన్న రాజీవపత్ర
నేత్రుఁ గృష్ణాఖ్యుఁ బెండ్లాడె నిండుప్రేమ. 53

సీ. శుభలీల మంగళసూత్రంబు మోసిన
యతివల కీలేమ యగ్రగణ్య
తోడిపూసి కట్టియెప్పుడు సంతసిలునట్టి
యువిదల కీభామ యోజబంతి
యనవరతము మాధవారాధనము సేయు
ముదితల కీరామ మొదలిపేరు
కొడుకులఁ జల్లనికడుపునఁ గాంచిన
పొలఁతుల కీచామ తిలకలక్ష్మి

తే. దీనజనతతిఁ బ్రోచి వర్ధిలినయట్టి
చెలువలకునెల్ల నీయింతి శేఖరంబు
ననుచు జనములు కొనియాడ నాదిలక్ష్మి
కరణి విలసిల్లి కృష్ణాంబ ధరణి వెలసె. 54

క. ఆలేమ గనియెఁ గీర్తి
శ్రీలలనావరుల రూపరేఖావిజిత
ప్రాలేయాంశుల విద్యా
నాళీకోద్భవుల సుతుల నలువుర వారల్. 55

సీ. సిద్ధబుద్ధిప్రభాజితకావ్యజీవకుం
భీనసకులరాజు పెద్దిరాజు
నానావిధోపాయ నయకళాజ్ఞానత
ర్జితవైరినృపమంత్రి సింగమంత్రి
యమృతధారాళనానార్థసంపద్వాచ
స్థితిరమావరుఁడయ్య తిరుమలయ్య
యఖిలభూదేవతాహ్లాదకారణసము
ద్యమపుణ్యసంచారుఁ డన్నగారు
తే. ననఁగ శ్రీహరి భుజముల యనువుదోఁప
మానవత్వంబుఁ బొందు నంభోనిధాన
ములన మహిమయు గాంభీర్యమునుఁ దలిర్ప
మీఱుదురు సర్వలక్షణోదారులందు. 56

మ. అనతారాతివసుంధరారమణదుష్టామాత్యమంత్రక్రియా
వనదావానలుఁ డార్యహృద్వనజభాస్వన్మూర్తి మందాకినీ
వనజారాతిపటీరహీరహరశశ్వత్కీర్తి ధైర్యోల్లస
త్కనకక్ష్మాధరు నన్నగారిఁ బొగడంగా శక్యమే యేరికిన్.

క. కడుచిన్నయయ్యు గుణములఁ
బొడవై దీనార్థి విబుధభూరుహమై యె
ప్పుడు ధర్మస్థితిచే న
ల్లడల న్నుతి కెక్కె నన్నగారు ధరిత్రిన్. 58

తే. రామలక్ష్మణభరతు లారసిదినంబు
మనుపఁ జెలువొందు శత్రుఘ్నుమహిమమీఱ
నన్న లెల్లను దనుఁ బ్రేమ నాదరింప
నన్నగారును శత్రుఘ్నుఁడై తనర్చు. 59

సీ. నలకూబరేందుకందర్పసౌందర్యంబు
మీఱు నెవ్వాని యాకారరేఖ
పరిపంథిమేదినీపతుల దేవతలఁగాఁ
జేయు నెవ్వాని కౌక్షేయకంబు
సకలభూసురవనీపకుల దౌర్గత్యంబుఁ
ద్రుంచు నెవ్వాని వీక్షాంచలంబు
పుండరీకమరాళపూర్ణచంద్రులభంగి
విలసిల్లునెవ్వాని విశదకీర్తి

తే. యతఁడు హరివాసరార్చితక్షితినిలింప
జాలకృతసార్థకాశీర్వచఃప్రవర్ధ
మానమానితసంపత్సమగ్రుఁడగుచు
గరిమఁ జెలువొందు నలయన్నగారు ధరణి. 60

వ. తదగ్రజుండు. 61

సీ. అనిశంబుఁ దమ్ముల కాప్తుఁడై పూర్ణుఁడై
కందనిద్విజరాజు గలిగెనేని

సతతంబు గోత్రరక్షకుఁడై యజారుఁడై
వెలయు దేవేంద్రుఁడు గలిగెనేని
మధుపాశ్రయముగాక మ్రాన్పాటునొందక
చెలఁగు మందారంబు గలిగెనేని
యొరుచేతఁ జిక్కక తిరుగుడువడక యూ
ర్మలులేక తగునబ్ధి గలిగెనేనిఁ
తే. గళలపెంపున నతులభోగముల దాన
గరిమ గాంభీర్యసంపద సరిసమానుఁ
డీడుజోడని పోల్పంగ నెసఁగు మాద
మంత్రిశేఖరు తిమ్మనామాత్యవరుఁడు. 62

చ. మదనవిలాసుఁడై యలరు మాదయతిమ్మనమంత్రిచంద్రుఁడ,
భ్యుదయము నొంద శాత్రవసమూహముఖాంబుజముల్
ముడింగె సన్మదమునఁ గీర్తిచంద్రిక సమస్తదిశావళి నిండె
సత్కళా,స్పద మహిమంబునం జెలఁగె బాంధవకైరవకోటు
లున్నతిన్. 63

మ. అలఘుప్రాభవుఁడైన మాదవిభు తిమ్మామాత్యముఖ్యుండు
తా, నెలయూరన్ రజతాచలంబుగతి లక్ష్మీశాలయంబర్థి
ని,శ్చలభక్తి న్విలసిల్లఁ జేసి మఱి పాంచాలీశ్వరప్రాంగణ
స్థలిఁ గట్టించె సువర్ణకుంభవిలసత్సౌధంబునోర్గంటిలోన్. 64

వ. తదగ్రజుండు. 65

సీ. అతులితైశ్వర్యదుర్గాధీశుఁడయ్యు ల
క్ష్మీసమాకలితుఁడై చెలఁగినాఁడు
నిశ్చలసత్యహరిశ్చంద్రుఁడయ్యు వి
శ్వామిత్రదమనుఁడై యలరినాఁడు

భూరిలోకావనపురుషోత్తముండయ్యుఁ
బుణ్యజనాప్తుఁడై పొదలినాఁడు
శ్రీకరాంగప్రభాలోకబాంధవుఁడయ్యుఁ
గువలయాహ్లాదియై గూర్చినాఁడు
తే. తనరిపరిపంథిమంత్రిమంత్రప్రభావ
తిమిరసంహారకారణతిగ్మకరుఁడు
సర్వసర్వంసహానాథ సచివముఖ్య
మౌళిమణియైన సింగనామాత్యవరుఁడు. 66
సీ. తనప్రతాపాగ్నిశాత్రవసమిత్తతి నేర్చి
భూరిభూమీధ్రంబుఁ బుటము వెట్టఁ
దనకాంతిచంద్రిక జననేత్రకువలయం
బుల నేలి మరుముఖాంబుజము ముడుచఁ
దనదానమేఘ మర్థినికాయచాతకా
వళిఁ బ్రోచి చంద్రమండలముఁ బొదువఁ
దనకీర్తిలత దిశాదంతిదంతంబుల
[1]కడఁ బ్రాఁకి కల్పవృక్షంబుఁ బొదువ
తే. నలరుఁజిత్తాంబుజానదయాత్తహేమ
చామరాందోళికార్జునచ్ఛత్రపీఠి
కాకరండకలాచిభృంగారకాది
రాజచిహ్నాంచితుఁడు సింగరాజు భువిని. 67
క. గరిమం దక్కిన సచివులు
సరియగుదురె సింగమంత్రిచంద్రునకు మహీ
వరనుతునకు సామిద్రో
హరగండాంకునకు మాదయకుమారునకున్. 68

1 కలఁ.

వ. ఏతదగ్రజుండు. 69

క. బాహుబలభీముఁ డశ్వా
రోహణరేవంతుఁ డఖిలరూఢయశస్కుం
డాహవనిర్జితరిపు వీ
రాహంకారుండు పెద్దనార్యుఁడు వెలయున్. 70

ఉ. నిద్దపుఁగీర్తిసంపదల నీరజబాంధవసూతికంటెనుం
బెద్దన సత్కళామహిమ మీనపతాకునిమామకంటెనుం
బెద్దన రూపరేఖల నుపేంద్రుని ముద్దులపట్టికంటెనుం
బెద్దన మాదయప్రభుని పెద్దన మించు ధరాతలంబునన్.

సీ. ఏలించెఁ బలిచేత హిమధరాధర సేతు
పర్యంత మేదినీపతుల నెల్లఁ
బాలించె నిజబుద్ధిబలముచే నాజ్ఞావ
శంబులై చెలఁగ దేశంబులెల్లఁ
గూలించె సంగరక్షోణి బాహాసిచే
దర్పితారాతిజాతంబు నెల్లఁ
దూలించె నీగిచే దుర్వారబుధబంధు
యాచకవ్రాతదైన్యంబు నెల్ల

తే. మించి చిత్తాంబుఖానభూమీమహేంద్ర
సకలసామ్రాజ్యలక్ష్మీవిశారదుండు
భాగ్యసంపన్నుఁ డెన్మ్మలపల్లి మాద
మంత్రిశేఖరు పెద్దనామాత్యవరుఁడు. 72

సీ. పరమపావనమూర్తి బంధుచింతామణి
పుణ్యాంగనాశిరోభూషణంబు

సౌందర్యగాంభీర్యసంభవస్థానంబు
 కాయంబు దాల్చిన కల్పవల్లి
సౌభాగ్యసదనంబు సైరణ భూదేవి
 యతిథులపాలిటి యన్నపూర్ణ
భూదేవతాకోటి పోషింప భామినీ
 దేహంబుఁ గైకొన్న దివ్యసురభి
తే. లక్షణంబులప్రోవు శీలములతావు
 చికురనిర్జితరోలంబ సింగమాంబ
 యనుచు జనులెల్లఁ గొనియాడ నమ్మృగాక్షి
 తనకు నర్ధాంగలక్ష్మిగాఁ దనర మఱియు. 73

తే. పాలవెల్లికి నల్లుఁడై పరఁగినట్టి
 యాదిదేవుండు సర్వాంసహావధూటిఁ
 బెండ్లియాడినవిధమునఁ బెద్దమంత్రి
 లక్ష్మిఁ బరిణయమయ్యె నుల్లాసమెసఁగ. 74

## షష్ఠ్యంతములు.

తే. తమ్ములెల్లను దను నిధానమ్ముగాఁగ
 దైవమును దేశికుండుఁగాఁ దాతగాఁగ
 నాత్మఁ దలపోసి సేవఁజేయంగ మెఱయు
 నీదృశగుణాఢ్యుఁడైన మంత్రీంద్రునకును. 75

క. మరుదశనమండలేశ్వర
 హారిదంతకరీంద్రకచ్ఛపాధిప కిరిరా
 డ్గిరిసార్వభౌమబంధుర
 ధరణీధౌరేయునకు బుధవిధేయునకున్. 76

క. నిరుపమవితరణజితజల
ధరసురతరుసురభితరణితనయఖచరశో
కరసఖసుధాఘృణికి వి
స్ఫురణ నభోమణికి మంత్రిచూడామణికిన్. 77

క. దివిజతురగ విశదగిరి సి
తవనజ శరభ హరి హర శతధృతియువతి కై
రవహిత వృష విషధరధవ
ధవళయశోనిధికి సంతతదయాంబుధికిన్. 78

క. ధీరునకు రూపనిర్జిత
మారునకుం గృష్ణమాకుమారునకు గుణా
ధారునకుఁ జాపనిగమకు
మారునకుఁ విబుధసుకవిమందారునకున్. 79

క. శాతాసిహతోచ్చల దభి
యాతినృపాలకవిదారితాదిత్యునకుఁ
భూతలగురుపాండిత్యున
కాతతసత్యునకుఁ బెద్దనామాత్యునకున్. 80



# ప్ర థ మా శ్వా స ము.



వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన చిత్ర భారతంబను మహాపురాణంబునకుం బ్రారంభం బెట్టిదనిన.

ఆ. సకలపుణ్యతీర్థసంఘవరేణ్యంబు
పాపదావశిఖికిం బ్రావృషేణ్య
జలధరాగ్రగణ్య మిల నైమిశారణ్య
మఖిలమునిశరణ్య మగుచు వెలయు. 2

వ. మఱియు నప్పుణ్యక్షేత్రంబున సకలకాల పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత చందన మందార మాతులుంగ మధూక సరళ సౌవీర జంబీర ఖర్జూర నారికేళ నారంగ తాల తక్కోల హింతాల తమాల కురంటక కోవిదార కపిత్థ జంబూ పనస బదరీ శమీబిల్వామలక వట యజ్ఞాంగ పున్నాగ పాటలాది ప్రభేదంబులందనరి ప్రియులకయివడి ననంగి పెనంగి మెఱయు మల్లికా మాధవీ నాగవల్లీ లవలీ సేవంతికైలా జాతి మరీచి ప్రముఖ నానా లతావితానంబుల సురభితా విశేషంబులచేత విబుధాళులకు ననుదినంబు సంతర్పణంబుచేయించుచు సత్ఫలంబులక్ ద్విజశ్రేణికి ననివారితసత్రంబు లిడునట్టి తరువాటికల విజృంభించి ఫలరస మకరందమహాప్రవాహంబులెల్ల హ్రదీభవించిన చందంబున నతి మధురపానీయంబులం బొలుపొంది తటప్రదేశ సుఖాసీన పరమహంసద్విజరాజ ప్రభావిశేషంబున నిరంతర విక

సితసితకమల కల్హార కుశేశయ కుముద కువలయవాసనా వాసితంబులును, కలహంసకారండవ చక్రవాక టిట్టిభ బక బలాహక క్రౌంచ సారసాది నానాజలపక్షి సమూహ కోలాహలంబులును దేవాభిషేకనిమిత్త మునికుమార పూర్యమాణ కరకమండలు సంభూత ఘుమఘుమధ్వాన బధిరీకృత భూ నభోంతరంబులును నగు సరోవరంబులం గనుపట్టి, మునికన్యకా ప్రవర్ధమాన బాలలతాకీర్ణ పర్ణ శాలా ప్రాంగణ ప్రదేశ వికీర్యమాణ నీవారచర్వణ లీలా లంపటమృగశాబకవినోదంబులం జెలువొంది మునిసందోహ పరిపాలిత కామధేను స్తన్యపానసమేధమానవత్స ముఖ స్రవత్పయః ఫేనజాలశమితరజఃపుంజం బై రంజిల్లి పుండరీకాక్ష ఖండేందుమౌళి పూజావేళా మునిరాజరణిత ఘంటాజాత ఘణఘణక్వణన చకితకురంగడింభక చంక్రమణవిలాసంబున నింపొంది శాఖామృగలంఘనాధూతమహీరుహ శాఖాగ్ర నిరంతర నిర్యత్పుష్పరస పంకిలాలవాల ప్రదేశంబై విలసిల్లి యజస్ర మునిమాణవకపఠిత ఋగ్యజుస్సామాది బహువేదఘోషముఖరిత సకలదిక్చక్రంబై మెఱసి ఋషికృతాధ్వర దేవతాహ్వానస్వాన ప్రతిధ్వనిత చక్రవాళ గహ్వరంబై చెలంగి తపస్వికృతక్రతుహోమ ధూమబంధురగంధవాసిత సకలమహీమండలంబై యొసంగి మహాభారతంబు చందంబున నర్జున నకుల విలాసంబునం బొదలి చంద్రమండలంబుపగిది నిఖిల దేవతాభ్యవహారనిలయతాకలితంబై మించి దేవేంద్రసభామంటపంబులీల బుధ గురు రంభాహారిణీగౌరవంబున మీఱి గ్రహమండలంబు తెఱంగున హంసజైవాతృక ప్రముఖాధిష్ఠానం బై వెలసి

రామాయణంబువైఖరి ఖరదూషణవిరోధంబున నొనరు నన్నెలవునఁ జాంచల్యంబు బహిర్మారుతంబునందును, శ్రుతి సముల్లంఘనోద్యోగంబు తాపసకామినీకటాక్షాంచలంబులందును, రాగంబు మౌనిపరిధానంబులందును రజోవిజృంభణంబు కైతకంబులందును దమఃప్రసారం బుపాంత గిరిగహ్వరంబులందును బ్రతికూలత్వం బరిషడ్వర్గంబులందును నాస్తికబుద్ధి యీషణత్రయంబునందును జిహ్వా చాపల్యంబు హరినామస్మరణంబునందును నిరంతరవ్యసనంబు నారాయణపదాంబుజద్వయీసేవైకపాకంబులందును గాని యొండెడలేక పొలుచు నచ్చట విహరించుకుందేటి కూనలమేనులు మవ్వంబు నివ్వటిల్ల నందందదువ్వ శశాదనంబులును లీలాదృష్టివిలాసంబున నవ్వనం బెల్లఁ గువలయతోరణాభిరామంబుగాఁ జేయు హరిణీసముదయంబులకు నెయ్యంబున సంతసంబంతంతకు దేచుదేఁచులును తాపససంరక్షితవన్యధాన్యభక్షణచకితమూషికావళికిం దల్లులగతిం జన్నిచ్చి రక్షించు పిల్లులును వనమక్షికాజక్షణకండూలహోమధేనువులయందు మచ్చికలు పిచ్చిలం దమగోళ్లదూలవారించుశార్దూలంబులును, సంతతయోగాభ్యాసయోగిజనరేచితవాయుపానతుందిలదందశూకబృందంబుల భయంబుడిపి యూరడిలం దిరుగు మయూరంబులును సంతతసంతోషభరితాంతఃకరణమత్తశుండాలజాలంబులతోడంగూడి మాడి విహరించుహరులును, హరినికరసటాచ్ఛటాకంకతికాయమానఖతుండంబులై మైత్రి నెఱపు గండభేరుండంబులును, వెండియు ననేకమృగంబులు నన్యోన్యవైరంబులుడిగి యత్యంతసమ్మదంబున విహరించు మఱియును. 3

సీ. చెలఁగి "హరేర్నా కించి ద్వ్యతిరిక్తమ
స్తి" యటంచుఁ బల్కు రాచిల్కగములు
వరుసమై "వాసుదేవస్సర్వమితి" యని
సతతంబుఁ బలవించు శారికలును
"నచ నచ నారాయణాత్పరం మంత్ర"మ్మ
తెలివిని మ్రోయు నిందిందిరములు
మోదముతో "నమో వేదాంతవేదినే"
యని యెలుఁగించు పికావళియును
తే. దపసులు సకలవేదశాస్త్రములుచదువు
నప్పుడు గవుళ్లుపోయిన యట్టియెడలఁ
దీర్చి చదివించునట్టి సద్ద్విజకులంబుఁ
గలిగి విలసిల్లు నప్పుణ్యకాననంబు.

ఆ. ఆవనంబులోనఁ బావనశీలురు
శౌనకాదిమౌనిజనులుగూడి
సత్రయాగ మమర సమ్మదంబునఁ జేయఁ
గను దదీయమహిమ గనఁగఁ దలఁచి.

సీ. అరుణజటాబంధధరులు భస్మత్రిపుం
డ్రాంకితాళికులు కృష్ణాజినో త్త
రీయులు వల్కకౌశేయులు రుద్రాక్ష
భూషితదేహులు పుణ్యతీర్థ
జలపూర్ణఘనకమండలుహస్తు లభినవ
దండపాణులు జగద్వంద్యచరితు
లఖిలశాస్త్రాగమాభ్యాసవిశ్రాంతులు
స్ఫటికాక్షమాలికాభరణధారు

తే. లంబుజాతదళాక్షుపాదారవింద
యుగళసేవాప్రవీణులు నిగమజాల
మూర్తు లజకల్పులును నైనమునులు యతులు
నేగు దెంచిరి శిష్యసమేతు లగుచు. 6

సీ. మఱియుఁ గొందఱు ముక్తిమత్తకాశినియందు
వినుకలి మేలున మనముదగిలి
గంధంబు బంధమై కమ్మనిపువ్వులు
నొవ్వులై నవ్వులు దవ్వు లగుచు
రాకలు దుఃఖంబు రాకలై యారామ
కూటంబు ఘనకాలకూట మగుచు
భూరిరత్నాంకితభూషణంబులు దూష
ణంబులై చెలఁగ నెయ్యంబుమీఱ

తే. నిద్రయును మేలుకనుటయు నెఱయ లేక
తుల్యమగు నాయవస్థలతోడనున్న
కాముకులకైవడి సురతకాంక్షఁ దిరుగు
నట్టి మౌనీంద్రులును వచ్చి రచ్చటికిని. 7

వ. ఇవ్విధంబున సమస్తధరణీమండలపుణ్యక్షేత్రనివాసు లైన మహాత్ములు శిష్యజనసమేతులై వచ్చి యవ్వనంబునిండ నిల్చి యుండి రయ్యవసరంబున వారలఁ జూడంగోరి విబుధజనమాన్యుండును దపోవిద్యాధన్యుండును సాత్యవతేయశిష్యకుమారుండును విమలాచారుండును సకలపురాణవచనరచనాపరితోషితమునిజాతుండును నగు సూతుండును జనుదెంచిన నతని మృదుమధురభాషణంబుల గారవించి సుఖాసీనుం గావించి యి ట్లనిరి. 8

చ. అనఘ పరాశరాత్మజముఖాంబుజసంభవమైన యీపురా
ణ నికరమెల్లఁ దావకమనఃకమలంబున నున్నదందు మా
కు నొకపురాణరాజము నకుంఠితవాగ్విభవంబుమీఱఁ జె
ప్పి నిఖిల మౌనిసంతతికిఁ బ్రీతియొనర్పుము తాపసోత్తమా!

తే. అనిన నారోమహర్షణతనయుఁ డనియె
వినుఁడు దత్తావధానులై మునివరేణ్యు
లార సకలాఘహరణంబు భూరిపుణ్య
కరము నగునది చెప్పెదఁ జరిత మొకటి. 10

శా. వ్యాసప్రోక్తమహాపురాణములు ముయ్యా ఱందులోఁ జిత్ర
మై, శ్రీసౌభాగ్యవిలాసదంబయి బహుశ్రేయస్కరంబై
కడున్, భాసిల్లున్ సుపురాణ మొక్కటి ధరన్ బ్రహ్మాండ
మన్పేరఁ బెం,పై సర్గ ప్రతిసర్గ వంశ మను రాజాది ప్రశంసా
కృతిన్. 11

చ. చదివెడువారికి న్వినెడు సభ్యులకు న్మదివాంఛఁ జేయు బ
ల్లిదులకుఁగల్గు విప్రులకు లేఁగలతోఁ గనుపట్టు లక్ష పె
న్మొదవుల నిచ్చినట్టిఫలమున్ హయమేధముఁ జేయుపుణ్య
మున్, గొదుకక ధాత్రియంతయు నకుంఠితదానము సేయు
శ్రేయమున్. 12

క. గ్రామములు వేయు సాల
గ్రామంబులు లక్ష కోటికన్యాజనమున్
హేమాద్రు లనంతంబులుఁ
బ్రేమ నొసఁగుఫలము దీనిఁ బేర్కొనఁ గలుగున్. 13

క. అని పలికి మదిఁ బరాశర
తనయు న్భావించి మ్రొక్కి దామోదరపా

దనలినము నుతించి ముదం
బున సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెన్. 14

చ. వినుఁడు మహాత్ములార పృథివీస్థలియందు విచిత్రలీలఁ గృ
ష్ణునకును దేవనాయకతనూజునకుం రణమయ్యె నొక్క రా
జు నెపముచేత నర్జునునిఁ జుట్టలతోడ హరించె ధర్మనం
దనుఁ డొకరుండుఁ దక్క యదునాయకుఁ డుగ్రరథాంగ
ధారచేన్. 15.

క. తదనంతరంబ క్రమ్మఱ
యదువిభుఁడు గృపాసముద్రుఁ డై వాణీశ
త్రిదశేశుల కాశ్చర్యం
బొదవ మనిచె నుభయసైన్యయోధులనెల్లన్. 16

క. ఇది చిత్రభారతంబన
ముదమున వర్ధిల్లె లోకమునఁ బుణ్యౌఘా
స్పదమై లక్ష్మీవల్లభ
పదమై కడుచిత్రమై సభారంజకమై. 17

వ. అనవుడు హరికథాశ్రవణాహ్లాదు లగు శౌనకాదు లతి
విస్మితహృదయులై యిట్లనిరి. 18

సీ. కౌరవబలము నుగ్రతఁ జక్కసేయుచో
సూతుఁడై మెఱసెఁ గృష్ణుండు గాఁడె?
[1]ఖాండవవన[2]దగ్ధ కాలమ్మునందున
సురలఁ దోలించెఁ గృష్ణుండు గాఁడె?

---

1 భగదత్తుఁడల్కమై నిగిడించువైష్ణవా, శుగము వారించెఁ గృష్ణుండు. గాఁడె? 2 దాహ.

[1]కర్ణప్రముక్తమహా దీర్ణపన్నగమహా
శుగముఁ దప్పించెఁ గృష్ణుండు గాఁడె?
ప్రతినదప్పకయుండ నతిగుప్తసైంధవు
నుఱుమాడఁజేసెఁ గృష్ణుండు గాఁడె?
తే. యర్జునున కెల్లభంగుల నైనశౌరి
కంటికిని ఱెప్పరీతి నిక్కముగఁ బ్రోవ
నతనితోఁ బార్థుఁ డేల కయ్యంబుఁజేసెఁ
దామసం బెట్లు పుట్టె నాతనికి ననఘ. 19
వ. ఈవిశేషంబు సవిస్తారంబుగాఁజెప్పి కృతార్థులం జేయుమనిన నారోమహర్షణకుమారుం డిట్లనియె మున్ను నారాయణ ధ్యానానురాగి యగుశుకయోగీంద్రుని నిక్కథ యుదార స్వాంతుం డగు నిలావంతుండను ధనంజయనందనుం డడిగిన నతని మన్నించి యమ్మహానుభావుండు చెప్పినవృత్తాంతంబు నెఱింగించెద. దత్తావధానులరై వినుండని చెప్పం దొడంగె. 20
సీ. అనవరతంబు ననంతాధివాసమై
పొలుపొందు వైకుంఠపురముఁ బోలి
విషధరప్రఖ్యాతవిశ్రమస్థానమై
చెలువైన కైలాసశిఖరిఁ బోలి
నిర్ముక్తసందోహనిలయమై విలసిల్లు
నీరజోద్భవునిమందిరముఁ బోలి
నవ్యసుధారసభవ్యభోగాఢ్యమై
కనుపట్టు నాకలోకంబుఁ బోలి

1 కానీనముక్తనాగమహాశరంబును, బెండుగాఁ జేసెఁ గృష్ణుండు గాఁడె?

తే. జలజనిలయాధినాయకచరణనీర
జాతజాతతరంగిణీసత్ప్రవాహ
వారిపూరపవిత్రమై భూరిమహిమఁ
బొలిచెఁ బాతాళభువనంబు పుణ్యధనము. 21

చ. బలువగు [1]వేల్పుఁతేని నునుఁబానుపునుం గనుపట్టునిల్లు వె
న్నెలతలకానిసొమ్ముగమి నించినపెట్టియ యొట్టివేళలం
బులుఁగులరాచవారికలవోకలకుం జొరరాని యిక్కువై
జిలువలమన్కిపట్టనుచుఁ జెప్పఁగ నొప్పు రసాతలంబు దాన్.

క. నాకులలోన మెలంగియు
నాకులఁ దమమహిమచేఁ దృణంబుగ మది నా
లోకించి భుజగవరులు ని
రాకులతఁ జరింతు రమ్మహానిలయమునన్. 23

తే. కుటిలగతిఁ దమకు నిజముగఁ గూర్చినట్టి
తామరసగర్భమర్యాదఁ దప్పరామి
భావమున నూహచేసి యాఫణికులంబు
లాత్మకాంతాలకంబులయందు నిడియె. 24

శా. ఆభూమిన్ బ్రవహించు నెప్పుడు నపర్ణాధీశమౌళిస్థగం
గాభంగామలపద్మగంధనికరవ్యాప్తప్రవాహోర్ధ్వ[2]యై
యాభోగావతి పన్నగేశఫణదివ్యత్పద్మరాగచ్ఛటా
శోభానూనహిరణ్మయాంబుజములన్ జూడంగ నింపొం
దుచున్. 25

క. వినుఁ డానది శ్రుతిబాహ్యులు
ననవరతముఁ గుటిలగతులు నగుభోగివరుల్

---

1 నల్లవేల్పు. 2 తా, నైభాగీరథి.

దనవారిలోన మెలఁగినఁ
దనవారిఁగఁజేసి హరునితల యెక్కించెన్. 26

వ. అమ్మహాకూలంకషాకూల ప్రదేశంబున నమరావతియుంబోలె విబుధాలయంబై యర్చిష్మతియుఁబోలె శుచిస్థానంబై సంయమనీనిలయంబునుంబోలె ధర్మాధిష్ఠానంబై పుణ్యవతియుంబోలెఁ బుణ్యజనావాసంబై యమలావతియునుంబోలె రత్నాకరంబై గంధవతియుంబోలె మహాబలనివాసంబై యలకానగరియుంబోలె ధనదాశ్రయంబై యైశాన్యంబునుంబోలె సర్వజ్ఞక్షేత్రంబై యొప్పి భోగవతి యన నొక్కపురంబు గలదు. 27

క. ఆపురమున కధిపతియై
యేపట్టున రాజనీతి యెడలక ధర్మ
వ్యాపారం బుడుగక యా
లూ పేయుఁడు దండశూకలోకం బేలున్. 28

తే. అతఁ డిలావంతుఁ డనుపేర సమరు మీఱఁగి
యును కరీంద్రధరాహీశులును మదించి
తా రిలావంతు లనుకొన్న దాన వారి
సత్వధైర్యమనీషలు జడుపుగొనియె. 29

తే. ధర్మవర్తన భీమప్రతాపమహిమ
నర్జునఖ్యాతి తనయందు నమవుపఱుచు
సత్యమున సత్వమున శరాసననిరూఢి
మీఱి [1]తనతండ్రులను విడంబించె నతఁడు. 30

వ. అని మఱియును. 31

---

1 తలిదండ్రులను

క. భోగవతీదక్షిణతట
భోగవతీపురమునందు బుధులు నుతింపన్
భోగవతీసతితో బహు
భోగవిశేషములఁ బ్రొద్దుపుచ్చుచు నుండెన్. 32

వ. అంత. 33

చ. అతఁ డొకనాఁడు మంత్రులు మహారసికు ల్మనులుం గవు
ల్బుధుల్, హితులుఁ బురోహితు ల్సరసిజేక్షణలుం బరి
వారముఁ దోరల్, చతురతఁ గొల్వ నైందవశిలాపరికల్పిత
సౌధవేదికో,న్నతనవరత్నకీలితకనత్తనకాసనమధ్యవర్తియై.

వ. పేరోలగం బున్న యవసరంబున. 35

చ. భువనములం బ్రసిద్ధిఁ గని పొల్చిన సద్ద్విజకోటికన్న నె
క్కువయగుహంసచక్రములు గోరి భజింపఁగ నంబుజాక్షుఁ
బెక్కువిధములన్ స్మరించుపలుకుల్ శ్రుతియోగ్యములై
చెలంగ ము,క్తివనితచేలి కీరమనఁ[1] దేటి శుకుం డరుదెంచె
వేడుకన్. 36

తే. ఇట్లు వచ్చిన శుకయోగి నెదురుకొనిసు
ఖాసనాసీనుఁ గావించి యర్ఘ్యపాద్య
ముఖ్యపూజావిశేషసమ్ముదితుఁ జేసి
ప్రణతు లొనరించి మధురోక్తిఁ బలికె నతఁడు. 37

సీ. అనవరతంబు నత్యానందకారివై
కామరోషవికారగరిమ మడఁచి
సులభుఁడై ద్విజరాజచూడావతంసమై
దనరెడు సర్వజ్ఞు ననుకరించి

1 జేరి.

నట్టిమహాత్ముండ వబ్జాక్షపాదార
        విందభృంగమవు వివేకనిధివి
నీరాకచేతను [1]నెగడె మత్పుణ్యంబు
        లనఘాత్మ నీవెఱుంగనిదొకింత
తే. యైనఁ గాలత్రయమునందు నరసి చూడ
లేదు ప్రాక్తనరాజావళీవిశేష
చరితములలోన మిగుల నాశ్చర్యహేతు
వయినకథ యొద్ది యది నాకు నానతిమ్ము. 38

క. నరనారాయణు లనఁగాఁ
బరఁగి నిరంతరము [2]సఖ్యభావోన్నతిఁ ద్రి
ష్మను కృష్ణులకుం దమలో
దురమయ్యె నదేమినెపము దొరలి మునీంద్రా. 39

తే. పాండుసూనులఁ బొదువునాపదలు మాన్పఁ
బాలుపడి శోభనంబులు గీలుకొలుపఁ
జాలి చుట్టంబు మంత్రియు సఖుఁడు నగుచుఁ
గృష్ణుఁ డతిభక్తి వారి రక్షించు నెపుడు. 40

శా. ఆకుంతీసుతులందు నర్జునునితో నత్యంతమున్ మైత్రిమై
నాకృష్ణుండు మెలంగుఁ దొల్లి బలభద్రాదుల్ కడంకన్ సుభ
ద్రాకన్యామణి రాజరాజునకు నీఁదర్కించుచుండంగ మా
యాకృత్యంబున నీయఁడే నరున కయ్యబ్జాతపత్రేక్షణన్. 41

క. దివిజులు భయమందఁగ ఖాం
డవవన మనలునకు నిచ్చునాఁ డాలక్ష్మీ
ధవుఁడు సహాయంబై ని
ల్చి విజయునకు జయమొసఁగఁడె లీలయపోలెన్. 42

---

1 నీడేజ. 2 సత్యభాషారతి.

తే. ఈవిశేషంబు విరివిగా నెఱుఁగఁ జెప్పి
చెవులపండువు సేయు మచ్చికదలిర్ప
మునివరేణ్య భవద్వాక్యజనితమధుర
సుధ గదా నన్ను నేఁడు విబుధుఁగఁ జేయు. 43

వ. అనవుడు నిలావంతునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 44

తే. అనఘ మేలైనయది నన్ను నడిగితీవు
వినెడువారికిఁ జెప్పెడుఘనమతులకు
నఖిలపాతకహారియు నభిమతార్థ
దాయకమునగు తచ్చరిత్రంబు వినుము. 45

చ. కలఁడు మహాత్ముఁ డొక్కఁడు సుఖంబులు దుఃఖములు
న్సమంబుగా, మెలఁగి సుహృజ్జనంబులు నమిత్రులు నేక
విధంబుగాఁ జెలం,గి లలితలోచనాతతి మృగీసమితి న్సరిగాఁ
దలంచు వాఁ,డిలపయిఁ [1]దుల్యభావనయు నిట్లు భజించుటఁ
దుల్యహానివాన్. 46

చ. అలఘుతపోవిశేషమున నంబుజగర్భునితోడ శాంతిమై
నలినదళాక్షుతోడ భువనస్తుతభూతహితప్రబుద్ధిచే
నల గిరిజేశుతోడ మహిమాతిశయంబున వ్యాసుతోడ నీ
తుల గురుతోడఁ దుల్యుఁడనఁ దుల్యుఁడు మించె ధరా
తలంబున్. 47

తే. అతఁడు పరమాత్ముఁగూర్చి బాహ్యమును లోను
నేకముగఁ జేసి లోకంబులెల్లఁ బొగడ
భూరిభాగీరథీనదీతీరమునను
విమలమతితోడఁ దపముఁ గావించుచుండె. 48

1 దుల్యభాగయనునేట జనించిన తుల్యహాని.

వ. అని శుకయోగీంద్రుం డిలావంతున కెఱింగించిన తెఱంగు చెప్పుటయు విని యట మీఁది వృత్తాంతం బేమని యడుగుటయు. 49

మ. హరిదంత ద్విపదంతకాంతి లసదుద్యత్కీర్తికాంతావనో
హరదుగ్ధాంబుధిసంభవారమణపాదాబ్జద్వయీభావనా
పరతేజోజితవిస్ఫురజ్జ్వలనజంభద్వేషిదంభోళి భా
స్కర కృష్ణారమణీమణీవరతనూజా మానినీమన్మథా. 50

క. అనతారిమానభంజన
వినతాసూనుప్రతాపవిశ్రుతవనితా
జనతాపంచశిలీముఖ
ఘనతామరసాప్తతనయఘనదాననిధీ. 51

మాలిని.—

అతులితగుణరూపా హారిపుంద్రేక్షుచాపా
హతవిమతమహీపా యాత్మవంశప్రదీపా
జితకలితతికోపా శ్రీమహాభోగగోపా
క్షితిభరణదిలీపా క్ష్వేడకంఠప్రతాపా. 52

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మనామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్రభారతం బనుపురాణకథయందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# చి త్ర భా ర త ము

## ద్వితీయాశ్వాసము.



ధర్మపురనృసింహా
రాధనతాత్పర్యబంధురవామణి ధా
త్రీధవనుత యెనుములపలి
మాధవతనుజాత పెద్దమంత్రివరేణ్యా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని జాతుం డగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదు లగుశౌనకాదులకు ని ట్లనియె. 2

క. పగలెల్ల జలదరాశికిఁ
బగలై కొనసాగె నంతఁ బద్మాప్తుండుర్
మిగులంగ నుగ్రుఁడై జగ
ము గలంచఁగ గ్రీష్మకాలము న్వడివచ్చెన్. 3

ఆ. విశ్వకర్మబిడ్డ వేదన మాన్పంగ
రవి మథించి కిరణనివహములను
ధరణిమీఁద వైవ నురుతరోగ్రంబులై
వఱలె ననఁగ దావవహ్ని లొదవె. 4

తే. లోకములజీవనంబెల్ల [1]లోనుబుచ్చి
తనకరంబులఁ గువలయస్థలము మేలుఁ
జెఱిచి కడువెట్టయైన రాజీవబంధుఁ
డెట్లు తా మిత్త్రుఁడయ్యెనో యెంచిచూడ. 5

సీ. భూతలంబెల్ల నద్భుతముగాఁ బగులంగఁ
బాతాళలోకంబు బైలుపడియె
జలధిలోఁగల నీరజంతుసంఘాతంబు
నుడుకెక్కి యంతంత నొదుఁగఁజొచ్చె
ధూళిసమాక్రాంతతోయదపదముగా
నెస రేఁగి గాడ్పులు విసరఁదొడఁగె
నతిగభీర నదీమహాప్రవాహంబుల
నిసుమేరుపడఁగ నీరెల్ల నింకె
తే. నౌర పురుహూతకమలభవాదులకును
[2]వెస వనితల యధరరసము సవి సుఖముఁ
గనిన నోరికి వేఁడి పాల్గొనినభంగిఁ
జేయునన వెట్ట మఱి వేఱ చెప్పనేల. 6

మ. అమరస్థానవిశేషమై తనరు హేమాద్రిన్ శివావాసమై
రమణీయం బగురౌప్యభూధరముఁ దేరన్ బ్రహ్మ వీక్షించి
నెయ్యము సంధిల్లఁగ వానిపై సురనదిన్ హత్తించె లే
కున్న నా, యమరక్ష్మాధరము న్హరాచలము నీఱై పోవవే
యెండచేన్. 7

క. మృగతృష్ణల కగ్గలమై
మృగతృష్ణలు దిక్కులందు మించందొడఁగెన్

---

1 లోఁచిపుచ్చి. 2 వేసవిని తలఁప దినంబు వీలు దినము.

మృగరాజులు నానావిధ
మృగరాజులు [1]హరులు కరులు మెలఁగక డాఁగెన్. 8

చ. మిటమిటఁగాయు నాతపము మించఁగ నోర్వక గండశైల
ములఁ, బెటపెటఁ బ్రేలి వేలముల పెంపువహించెను జీవ
కోటులుఁ, బొటబొటఁ బొక్క భూమిగల భూజము
లందు మహోగ్రవృత్తిమైఁ, జిటచిట నిప్పు లుప్పతిలెఁ
జెప్పఁగరాని నిదాఘవేళలన్. 9

వ. అట్టి సమయంబున. 10

మ. గురుబాహాయుగమెత్తి వామచరణాంగుష్ఠంబునన్ భూమిఁ
ద్రొక్కి రమావల్లభు నాత్మలో నునిచి వీక్షింపంగ రా
నట్టి భాస్కరుపైఁ జూపులు నిల్పి తుల్యుఁడు సమగ్రబ్రహ్మ
నిష్ఠారతిన్, బరమాశ్చర్యముగాఁ దపంబు సలిపె న్పంచాగ్ని
మధ్యంబునన్. 11

వ. అంత. 12

క. జీమూతాక్రాంతంబగు
భూమండల [2]మనఁగ నానభోమండలమున్
జీమూతాక్రాంతముగా
జీమూతాగమము దోఁచెఁ జిత్తం బలరన్. 13

చ. అనిమిషనాథుఁ డమ్మునితపోనలకీలల నబ్ధియింకినన్
దనకు విపక్షుఁడై యచట డాఁగిన యాహిమవన్నగాత్మ
జున్, గినిసి విపక్షుఁజేయఁ గమకించి ప్రచేతసు నింట నిర్గ
మం, బనిచెడు విల్లనంగ నపరాశ సురేశ్వరుచాప మొప్పెఁ
దాన్. 14

1 సిరులహరుల. 2 మున్ స్ఫురన్నభోమండలమున్.

తే. ఇంద్రగోపంబు లవనిపై నెల్లయెడలఁ
గానిపించె సురేంద్రుఁ డగ్గలికతోడఁ
దపముగావించు మౌనిఁ గ్రోధమునఁ జూడఁ
గన్నుగమిరాలు విస్ఫులింగము లనంగ. 15

చ. కరములు చాఁపి వడ్డిఁకుటకై బుధశుక్రుల సాక్షివెట్టి య
య్యరుణుఁడు భూమిచేతఁ దగ నప్పులు గైకొని యియ్య
కున్నచో, ధర తన మూలవృద్ధులకుఁ దక్కక సాగినవారిఁ
గూర్చి య,క్కఱగుడివ్రాసియాఁగె ననఁగాఁ బరివేషము
చుట్టె నాతనిన్. 16

తే. ఉత్తరపుదిక్కు మెఱుపుల నుల్లసిల్లెఁ
బూర్వదిగ్వాయుసంచయంబులు చెలంగెఁ
దగనహోరాత్రములును సంధ్యలును దెలియ
రాకయుండెను మేఘసంరంభమునను. 17

సీ. నిష్కళంకాత్మయై నెగడు వసుంధర
యత్యంతపంకాత్మయై చెలంగె
నమృతప్రవాహాఢ్య లయిన మహానదు
ల్గలుషవిషాఢ్యలై కలఁగఁబాఱె
రాజహంస మనోహరం బగుగగనంబు
సంతతఘనతమశ్ఛన్నమయ్యె
మాధవలక్ష్మీసమన్వితం బగునబ్ధి
పరజీవనాపేక్షఁ బీరఁగి డొంకెఁ

తే. జాతకంబుల మనములు చల్లనయ్యె
మలయుదావానలంబులు మ్రగ్గిపోయె
సస్యజాతంబు నానాఁట సఫలమయ్యె
విమలమైనట్టి వర్షాగమమున నధిప. 18

మ. ఘనరావంబు చెలంగ భృంగి వినుతుల్ గావించి పాడంగఁ
గా, ననమం దెచ్చుట నీలకంఠవిలసన్నాట్యంబు రంజిల్లఁ
దా, ఘనరావంబు చెలంగ భృంగి వినుతుల్ గావించి
పాడంగఁ గా, ననమం దెచ్చుట నీలకంఠవిలసన్నాట్యంబు
రంజిల్ల దే. 19

తే. పృథుతటిద్దేహనవ్యలతాపింఛచికుర
గురుపయోధరకుచయునై కోర్కిమీఱఁ
బ్రావృడంగన యినునిపైఁ జేవఁగొన్న
తమిని వెడలంగనీయక దాఁచె నతని. 20

తే. మొగులుగతి నిమ్ముకొన్నట్టి మొగులు చెలఁగ
నలరు మెఱుపులకై వడి నలరుమొగ్గ
గములఁ బొడమెడు తావి భృంగములు గ్రోలి
తరులఁ గనుపట్టెఁ గేతకీతరుల మెఱసి. 21

సీ. కులపర్వతములు ఱెక్కలతోడ నెగసెనాఁ
గంధరంబులు మింటఁ గలయఁ బర్వె
మందరాచలమథ్యమానార్ణవధ్వాన
మన మేఘనిర్ఘోష మతిశయిల్లెఁ
గల్పాంతసమయాగ్నికణము లొక్కుమ్మడిఁ
బడియెనో యనఁగఁ బెన్పిడుగులురలె
వజ్రంబు దేవతావల్లభుం డురువడి
జళిపించె ననఁగఁ జంచలలు మెఱసె

తే. మత్తశుండాలశుండాసమానపతద
నూనధారాళిధారానవీననీర

పూరపరిపూరితాశానభోధరిత్రి
గాఁగ వానలు గురిసె లోకములు [1]బెదర. 22

వ. అప్పుడు. 23

తే. పరమహంస యనంగఁ దాఁ బరఁగి యమృత
దేహియై మంగళాకృతిఁ దేరి బుధతఁ
జెంది విజ్ఞానగురుఁడు నాఁ జెలఁగి యతఁడు
పర్వత భృగుస్థలమునఁ దపంబు సలిపె. 24

వ. మఱియును. 25

క. తొరలెడు వానలఁ దడియుచు
గిరిచఱిఁ గూర్చుండి యోగికేసరి దినముల్
మరుదశనంబునఁ గడపుచుఁ
జిరకాలం బుగ్రతపముఁ జేయుచు నుండెన్. 26

వ. అంత. 27

తే. ఎలమి మేలైనవర్షంబు లెల్ల జాఱ
స్వాంతమునఁ దూలి గద్గదస్వరము గదురఁ
దుదిశరత్తులఁ బొదివి వృద్ధులవిధమున
నరిగె నెందేని మేఘంబు లాకసమున. 28

క. జలదములముంపు దప్పినఁ
గలితప్రభఁ బొల్చె దిశలు గర్దమ మింకెన్
జలి యంతంతకుఁ మించెం
గొలఁది తఱిగి నదములెల్లఁ గొంచెము లయ్యెన్. 29

క. కమలాదులైన హేమం
తముఁ దద్రాత్రిచయమును ఘనములై తోఁచెన్

1 చెదర.

గమలాస్త్రములగు నిను తే
జముఁ బగళులు గొంచెపడియెఁ జలిచే నధిపా. 30

క. అనుపమ మగు హేమంతముఁ
ఘనసత్త్వం బేమొ యుష్ణకరునిఁ శీతాం
శునిఁ గావించెను దన్నిశ
లను బగలుగఁ జేసె జనములకుఁ జిత్రముగాన్. 31

తే. స్థావరములైన యద్రులుఁ జలికి వెఱచి
యీడుమీఱినసానులతోడికూట
ములు విసర్జింప లేవన్నఁ దలఁప నొరులు
సతులఁ బాసి [1]చరింపఁగఁ జాలఁగలరె. 32

తే. జ్వలనుఁ డెప్పుడు జగత్ప్రాణసఖుఁ డటంచుఁ
బలుకుమాట యథార్థమై నిలిచె ననఘ
యట్లు గాకున్న హేమంత మడరినప్పు
డతని ప్రాపున బ్రతుకునే యఖిలజనము? 33

సీ. ఇంతంత యనరాని యివములెల్లెడఁ బర్వ
[2]వసుమతి వడవడ వడఁకఁ జొచ్చె
వసనాభివిసము లప్పసముఁ బూనిన వాయు
విసరంబు ఱివ్వన విసరఁదొడఁగె
భూనభోదిగ్భాగములుఁ గానరాకుండ
గుఱిలేని పెనుమంచు గురియఁదొడఁగె
శీతంబునకు నరశ్రేణు లోసర్చిన
నెగడులు తఱుచుగా నెగడి మెఱసె

---

1 తరింపఁగఁ. 2 వనభూమి.

తే. నెల్లరోగంబులును నిండి వెల్లివిఱిసె
వెజ్జులకుఁ బండువయ్యెఁ బూవిలుతుమామ
విపులశీతలచంద్రికావితతి చల్లెఁ
దరులుఁ దామరసిరులు నుద్దవిడి ముడిసె. 34

క. చేతోభవకోపంబున
శీతలమని విటులు సతులుఁ జేరక యంతం
జేతోభవదండన మీ
శీతలమని వెఱచి కలసి చెలఁగుదు రాత్మన్. 35

ఉ. అమ్ముని యట్టివేళ హృదయంబున నంబురుహాక్షు నిల్పి లో
కమ్ముల కద్భుతంబుగ వికార మెఱుంగక కంఠదఘ్ననీ
రమ్ములలోననుండి యుదరమ్ముదకంబులఁ బ్రోదిసేయుచున్
నెమ్మిఁ దపం బొనర్చె ధరణీవరులున్ సురలు న్వడంకఁగన్.

తే. ఇవ్విధంబున నేడువేలేండ్లు తపము
ఘోరమతిఁ జేసె నామానికుంజరుండు
గరుడగంధర్వయక్షకింపురుషసిద్ధ
సాధ్యవిద్యాధరాదులు సన్నుతింప. 37

క. ఆసమయంబునఁ దనమది
వాసవుఁ డిట్లని తలంచె వసుధాభుజగా
వాసనివాసులవర్తన
మీసారి వినంగరా దిదేమి విధంబో. 38

క. సారమతిఁ గీడుమేలును
జారులచేఁ దెలియవలయు జగతీశులకున్
జారులు రాజులకెల్లను
దూరము గనిపించు కన్నుదోయి తలంపన్. 39

వ. అని వితర్కించి. 40

క. చారుల లోకత్రయ సం
చారుల సూనృతవచఃప్రచారుల విమలా
చారుల సంతతగూఢవి
చారుల రావించి యతఁడు సమ్మతి ననియెన్. 41

సీ. మీరు భూమికి నేగి గౌరవం బొనరంగ
నచ్చోటఁ దనరు బ్రాహ్మణులు వేద
విధి సంచరించు నవ్విధము రాజులు నీతి
విహరించు తెఱఁగుఁ బ్రవీణులైన
వైశ్యుల [1]పుణ్యాభావంబును శూద్రుల
వర్తనమును బ్రజావళిచరించు
కట్టడయును యోగిగణములు గావించు
తపముచందంబు సద్బ్రహ్మచారు

తే. లైన వారలగతియు గృహస్థులయిన
వారి నడకలుఁ దగుపతివ్రతలమేలుఁ
దెలిసి పాతాళభువనవార్తలు నిజంబు
గాఁగఁ బరికించి రండు వేగంబు మీఱ. 42

వ. అని రహస్యంబుగాఁ జెప్పి యనిచినఁ జారులు క్రమంబున ధరణీతలంబునకు డిగ్గి భూకాంతానితంబావలంబిత రత్న మేఖలాకారంబు లగుపారావారంబులను, సమస్తవస్తు విస్తారరూపంబు లగుసప్తద్వీపంబులను, దటప్రదేశదేదీప్య మానరత్నజాలంబు లగుపుణ్యశైలంబులను, ననవరతాసీన యోగిజనంబు లగువనంబులను, నిరంతరవికసితసితకమల

---

1 పణ్యాభావంబును.

కల్హారమాలికాసారంబు లగుకాసారంబులను, మహాపాత
కంబులనెల్లం బుణ్యంబులుగాఁ జేయ సమర్థంబు లగుతీర్థం
బులను బవిత్రంబు లగుపుణ్యక్షేత్రంబులను, ముక్తికాంతా
నితాంతనిధానంబు లగుమహానదీ[1]విధానంబులను, ననంత
తపోధనులగు మునులను, నానావిధవస్తుసమాస్పదంబు
లగుజనపదంబులను, నజస్ర లక్ష్మీవిహారంబు లగుపురంబు
లను, వేదవిద్యావినిర్జితవాణీవరు లగువిప్రవరులను, సర్వ
సర్వంసహాభారభరణదక్షదక్షిణబాహాదండవిజృంభమాణ
కఠోరకుఠారధారావినిర్జితవైరిరాజన్యు లగురాజన్యులను,
సంపజ్జితయక్షవర్యు లగునార్యులను, బుణ్యగుణభద్రు లగు
శూద్రులను గనుంగొనుచు వచ్చివచ్చి పురోభాగంబున.

చ. కనుఁగవ యింతమూసి కరకంజము లూరు యుగంబుఁ జేర్చి
మే,ను నిగుడఁ జేసి శ్రీవరు మనోజలజంబున నిల్పి యింద్రి
యా,ళిని బిగఁబట్టి గాడ్పులఁ జలింపఁగనీక కడంగి స్వస్తి
కా,సనమున నున్నతుల్యమునిచంద్రునిఁ గాంచిరి భీత
చిత్తులై. 44

వ. ఇవ్విధంబున నమ్మౌనీంద్రుం గనుంగొని తమలో నిట్లనిరి.

ఆ. ఇతఁడు పరమహంసుఁడే నిక్కమగుఁగాక
యున్న నుగ్రగతిని నుండునెట్టు
లిమ్మహాత్ము తేజమేచినఁ గువలయం
బెల్ల ముచ్చుముడుఁగదే తలంప. 46

మ. హరుఁడో యాతఁ; డట్లైన శూలమును నేణాంకుండు
ఫాలాక్షమున్, బరిశీలింపఁగ నేల కానఁబడఁ; వజ్రప్రోద్భ

1 వితానంబులను.

వుండో; ముఖాం,బురుహంబుల్ మఱినాల్గు గావలదె;
యంభోజాక్షుఁడో ఖడ్గమున్, విరిగెందమ్మియు శంఖచక్ర
ములు నేవీ బుద్ధి నీక్షించినన్. 47

ఉ. ఇమ్మునినాథుఁ డేపనికి నీగతి ఘోరతపంబుసేయ నె
య్యమ్మునఁ బూనెనో కడుభయంకరమై ప్రసరించు నిట్టి తే
జమ్మున నెల్లలోకములు స్రగ్గవె వాయువు లేనిచోట దీ
పమ్మునుబోలె వీఁ డచలభావము నొందె దృఢవ్రతస్థుఁడై.

తే. ఇతఁడు గావించుతపము సురేశ్వరునకుఁ
జెప్పకుండిన మోసంబు చెందు ననుచు
నచట నిల్వక దివమున కరిగి రంత
వాయువేగులు వేగులు వారు వెరచి. 49

వ. ఇట్లు చారు లతిత్వరితంబున నాకలోకంబున కేగి యమ
రేశ్వరుం గాంచి దండప్రణామంబు లాచరించి నిటలతటం
బున నంజలిపుటంబు ఘటియించి యి ట్లనిరి. 50

ఉ. దేవరపంపున న్ధర కతిత్వరితంబున నేగి యచ్చటన్
బావనులైనభూసురులఁ బార్థివులం బరికించి పుణ్యతీ
ర్థావళుల న్మహానదుల నారసి మౌనులఁ జూచి బంధుర
గ్రావములన్ వనంబులను గన్గొనిజాహ్నవిఁ జేరఁబోవుచోన్.

శా. చండాంశుండునుబోలె నుగ్రతరతేజఃస్ఫూర్తి ఫాలా
నలాక్షుండునుబోలె మహాప్రభావమున రక్షోహంతయున్
బోలె బ్రహ్మాండాంతర్గతజంతుసంఘహృదయవ్యాప్తాకృతిం
బద్మగర్భుండుంబోలెఁ దపంబునం దగు మునీంద్రుం డున్న
వాఁ డచ్చటన్. 52

తే. అతనితపమున లోకంబు లడరె గిరులు
వడఁకె జలధులు పిండలి వండులయ్యె
ధరణి కంపించె సూర్యచంద్రగుచు లడఁగెఁ
దారకంబులు రాలె దిక్తటులు ప్రీలె. 53

వ. కావున నమ్మహామునీంద్రుం డేమినిమిత్తంబున నట్టితపంబుఁ జేయుచున్నవాఁడో దానికిం దగినకార్యం బూహింపు మనియును, నతనిపేరు తుల్యుండనియును, విన్నవించిన దురంతచింతాక్రాంతుండై కొలువుకూటంబున కేతెంచి ప్రతీహారులచే దిక్పాలపూర్వకంబుగా సకలదేవతావరులను స్వాచార్యుం డగుగురునిఁ రావించి యథోచితంబుగా సత్కరించి వారలు చుట్టునుం బరివేష్టింప భద్రచింతామణీపీఠికాసీనుండై యందఱఁ గలయం గనుంగొని యిట్లనియె.

చ. ఘనుఁ డొకయోగి తుల్యుఁ డనఁగా ధరణీస్థలియందు నేరికి
న్గనఁ గనరాని తేజమున విఱ్ఱవీఁగి తపంబు సేయఁగా
వనరుహమిత్రచంద్ర నగవర్గసముద్ర నదీనదక్షమా
జనతతియు న్జలించెనని చారులు చెప్పినమాట వింటిరే. 55

తే. ధరణియాపద మానువిధంబుఁ దుల్య
మునితప ముడుగురీతియు మనకు విపుల
సౌఖ్యమున నుండుకార్యంబుఁ జర్చచేసి
పలుకుఁడీ మీరు మీయుక్తిబలము మెఱయ. 56

వ. అనవుడు నప్పాకశాసనునకు నఖిలామరాధిపులయనుమతంబున సకలనీతివిద్యాగురుం డగుగురుం డిట్లనియె. 57

ఆ. బలిమిఁ జేయరానిపని యెట్టిదైన ను
పాయబలముచేతఁ జేయవచ్చు

సాహసంబు చేసి చనరాని జలనిధి
నావచేఁ దరించు తేవ ననఘ. 58

ఆ. మునులు తపముఁ జేయుచును బహిరింద్రియం
బుల మనంబుతోడఁ గలిపి నిలిపి
యచలనిష్ఠఁ బొల్తు రదిగాన వారి మ
నంబుఁ గలఁపఁ దద్వ్రతంబు చెదరు. 59

క. మనసిజు నీక్షణమున రాఁ
బనుపు మతం డమ్మునీంద్రు భావముఁ గడు నే
ర్పునఁ జొచ్చి తపము మాన్పెడు
ననఘా! యాతని కసాధ్యమైనది గలదే. 60

వ. మఱియును. 61

ఆ. ధరణిజనులు వడఁకఁ దపముగావించు ము
నీంద్రకోటి మాన్ప నిందువదన
లోపినట్లు విధుఁడు నోపఁడు నిక్కవ
మచ్చరలను బిల్వనంపి పంపు. 62

వ. అని యమ్ముని తపోవిఘ్నోపాయంబుఁ జెప్పిన గురు నభి
నందించి పురందరుండు పుండ్రేక్షుకోదండనిర్జితయోగిజన
తపోదర్పుండైన కందర్పునిం దలంచిన. 63

సీ. వనితలచేతి వేదనకొప్పు తనకొప్పు
పసఁజూడ నొసపరి బాగుమీఱఁ
దనమోముసిరినీడు కొనఁగోరి కొనగోరి
కస్తూరికాతిలకంబు చెలఁగ
వనజాక్షి [1]సంతన తనమేన తనమేన
మామ[2]పెక్రాయంబు మహిమఁజూప

1 కోరిన. 2 లేఁబ్రాయంబు.

మెఱుఁగుఁజుక్కలతోడ సరులైన సరులైన
తనయురంబున నిండి తళుకులీన

తే. కేళి సలిపెడు తన మంచి కేలి యుంగ
రముల కాంతులతతి యుంగరముల విరుల
నందియలమించు పదముల నంది యలర
వంబు మీఱంగ నింద్రుభావంబు దనర. 64

చ. ననుపులు మందె మేలములు నారుల పెన్బొలయల్క వేళ
లం, బెనఁగి కవుంగిలించునెడ పేరులయొత్తులు గోరుటొత్తు
లుం, దనువున మీఱఁగా నలసతం జిఱునవ్వులుఁ గొప్పుఁ
బువ్వులున్, గనుఁగవ కెంపులున్ రతుల గర్వము సొంపులు
నింపుదోఁపఁగన్. 65

ఉ. పూవులవిల్లు నమ్ములును బూనుచు బంగరువ్రాఁత నిండు
మా,టావళి దట్టిగట్టి యొరదాఁకిన కెంజిగురాకుబాకు శో
భాన్వితిగా నమర్చి వలిపంబుఁ బయిన్ వలెవాటు వైచి ల
క్ష్మీవనితాకుమారకుఁడు మేనిమెఱుంగుజగంబునిండఁగన్.

మ. చెలికాఁడైన వసంతుఁ డాదరముతోఁ [1]జేయూఁదఁగాఁ
జల్లగా,లి లసచ్చామరపాణియై నడవ [2]నాళీకద్విషుండున్
సుధా,జలపూర్ణంబగు గిండి దేరఁ దనదక్షత్వంబు మీఱంగ
నిం,తులమానం బెడలంగ వచ్చె నమరేంద్రుం డిచ్చలో
మెచ్చఁగన్. 67

వ. ఇట్లు వచ్చిన భావసంభవుని నయ్యింద్రుం డాలింగనంబు
చేసి గారవించి సుఖాసీనుం గావించి కుశలం బడిగిన
యనంతరంబ రంభం దలంచిన. 68

---

1 జేయూఁతగాఁ. 2 బల్వికన్ హిమాంశుండుదా.

చ. చెలువము రచ్చ కాముకుల జీవన మంగజరాజ్యలక్ష్మి శూ
రులు గనుపట్టి పద్ధతి మరుద్గణి కామణి సోమసూజుల
న్వాలవఁగఁ జేయు నౌషధము స్వర్గవిభూషణ మంబురాశిస
త్కులభవపుణ్యరాశి నలకూబరప్రాణపదంబు రంభ దాన్.

మ. కురులం [1]దావిచయుం బొసంగు విరులం గొప్పొప్పుగాఁ
దీర్చి కస్తురి ఫాలంబున సోఁగబొట్టిడి కళాస్తోమంబుపైఁ జల్లు
ముంగర నాసధరియుంచి లేనగవు వీఁక న్మోవి పల్లొత్తులు౯
మరువై దాఁచఁగఁ గ్రొత్తముత్తియపుఁ గమ్మల్ వీనుల న్మించఁ
గాన్. 70

ఉ. ఏపునఁ దారహారము వహించి మనోహరహీరకాంతి సం
దీపితమైన క్రొమ్ముంగపుతీఁగ ధరించి సమస్త రత్నసం
స్థాపిత మేఖలాన్వితనితంబము సోయగమూరుశోభలం
బై పడి మేలి పన్నవలిపంబున మీఁజిదుబాళి చేయఁగాన్.

ఉ. చేరిక గోరు[2]కోణములఁ జెక్కు విలాసము వేసినట్టి బం
గారపుఁగుండల౯ గెలువఁగాంచి నిశాతనవాంకుశంబుల
న్జీరిన కుంభికుంభముల చెన్ను వహించినయట్టి క్రొత్తకెం
జీరలతోడి చన్నుఁగవ చెల్వముఁ బయ్యెదఁ జొకళింపఁగాన్

సీ. తన కన్నుదోయి యుద్దండ మన్మథబాణ
జలజమీనములను సాటి గాఁగఁ
దననెమ్మొగంబు చంద్రసరోజ మణిదర్ప
ణావళులను బడియచ్చుగాఁగఁ
దనతనూయష్టి సౌదామినీవల్లి కా
తపనీయములకు విధాత గాఁగఁ

---

1 బాపటయుం బొసంగ. 2 బాణముల.

దనమందగమనసౌందర్యంబు మదకేకి
దంతిహంసల కోజబంతిగాఁగఁ
తే. దనమృదుధ్వని కోకిలోత్కరవిపంచి
కాశుకాళికి నొజ్జగా గర్వమొప్పఁ
దనవిలాసంబు మదనవిత్తంబుగాఁగ
రమణఁ గనుపట్టె విభ్రమారంభ రంభ. 73
తే. అందియలుమ్రోయ మేనిసోయగపుఁదావి
కళలు వెల్లుగ మూఁగి ఝుమ్మని చెలంగ
గురుపయోధరధమ్మిల్లభరముకతన
నడచువేళల నిరుపేదనడుము వడఁక. 74
ఉ. మేనకమూఁపుతోడ నును మేనొరయం గరపద్మమూఁది చే
తోనయమొప్పఁగా హరిణితోఁ దనముచ్చట చెప్పుచుం
బ్రియం, బాని సుకేశితోఁ జదురులాడుచు నొయ్యన
మంజుఘోషతో, లేనగవొప్ప మానసము చలింపఁగ మరము
లెత్తి యాడుచున్. 75
సీ. తాటంకమణిభానుధాళధళ్యంబులు
చెక్కుటద్దములపైఁ జిందులాడ
నవ్యహారప్రభానైగనిగ్యంబులు
కుచపర్వతంబులఁ గుప్పలుఁ ఱుకఁ
దరణి రుఙ్మేఖలాధాగధగ్యంబులు
కటిమండలంబుపైఁ బుటము లెగయఁ
జారు కంకణదీప్తి చాకచక్యంబులు
హస్తపంకజముల నలముకొనఁగ
తే. గరిమఁ బదియాఱువన్నె బంగారుసిరులు
మెఱపులనుగూడి రూపమై మెలఁగునట్టి

యనువు మీఱంగ వచ్చె దేవాధినాథు
కొలువునకు రంభ కుచజితకుంభికుంభ. 76

వ. ఇవ్విధంబున వచ్చి కృతాంజలి యైయున్న రంభనుం దక్కిన రంభోరులం గరుణావలోకనంబుల మన్నించి జంభారి నిజకార్యారంభం బెఱింగింపందలంచి పంచబాణున కిట్లనియె.

సీ. అనఘ నీరూపతేజోంశంబు సౌందర్య
వంతుల నుపమానవస్తువయ్యె
భవదీయకోదండపాండిత్యవిభవంబు
సకలధానుష్కసౌష్ఠవము గెలిచెఁ
దావకవిపులప్రతాపానలజ్వాల
నగచాపుదేహంబు సగము చేసె
యుష్మదీయశరప్రయోగవైదగ్ధ్యంబు
కంజగర్భుని తల[1]గడిచిపాఱె
తే. నిన్ను నొకపరి మదిఁ జేరుకొన్న యంత
సర్వవిరహులు నాజ్ఞావశంవదైక
మానసాంభోజులగుచుఁ ద్రిమ్మరుదురనిన
[2]మీఱి వినుతింప శేషుండు నేరఁగలఁడె. 78

మ. ననరేవిల్లు మదాళిసంఘము గుణం బబ్జాతపత్రాక్షిదృ
ష్టినికాయంబు శరోత్కరంబు లవియుం జేపట్టి నీవిద్య నే
ర్పున రెండొక్కటి గాఁగఁ జేయుదు బళీ రూపంబునం
జెంద కే, యనఘా! నీకు సమానుఁడుంగలఁడె బ్రహ్మాండాంత
రాళంబునన్. 79

---

1 గడచి. 2 నిన్ను.

ఉ. ఆ యమరాచలంబు ధనువై విలసిల్లఁగ విష్ణుఁడమ్ము గా
వేయిశిరంబులం బరిధవిల్లెడుశింజినిఁ గూర్చియున్న శూ
లాయుధు మాటమాత్రమున నంగము వ్రయ్యఁగ మోఁది
మించితౌ, తీయనివింటనే వెనుకతీయనిబీరమునన్ మనో
భవా. 80

క. [1]కఱకై మీఱియు నాయ
క్కఱకై చనుదేఱ నిన్నుఁ గనుఁగొనినపుడే
చెఱకువిలుఁ బూనఁజూచిన
చెఱకున్ లోనైరి సకలసిద్ధులుఁ దనరన్. 81

ఉ. చండకఠోర విష్ణుకరచక్రముకంటె మదీయదీర్ఘదో
ర్దండవిజృంభమాణభిదురంబునకంటెఁ బరేతరాడ్గదా
దండముకంటెఁ జంద్రధరదారుణశూలముకంటె నెక్కుడై
మెండుకొనుంగదా భవదమేయమృదుప్రసవాంబకంబుదాన్

క. హరిహరకమలభవాదుల
సరకుగొనక గెలుచునీకు సామాన్య మునీ
శ్వరులను జయించుటనఁగా
సరకా నరకాంతకాత్మసంభవ తలఁపన్. 83

వ. ఐన నొక్క కార్యంబు వినుము. తుల్యం దనుమునీం
ద్రుండు దారుణంబగు తపంబు గావింప లోకంబులు చీకాకు
పడియెఁ, గావున నతని తపంబునకు విఘ్నంబు సేయవలయుఁ;
నీకు సహాయంబుగా రంభాదిదేవతాంభోజాక్షుల నంపెద
ననిన నింద్రునకు నిందిరానందనుం డిట్లనియె. మద్ధనుః
ప్రభావం బవధరింపుము. 84

---

1 కఱకులయి మించి నాయ,క్కఱకుం జనుదేని వారిఁ గని నీవపుడే, చెఱకువిలుఁబూనునంతనె.

క. పిడికిట నడఁగెడునడుముఁ
గడుఁదియ్యని మేను భృంగకలితగుణంబుఁ
విడివడనిక్రొప్పు నేర్పడి
పడఁతుక గతియయ్యె మించి పౌరుషవృత్తిన్. 85

క. మును లెంత నాకు రుద్రుం
డన లక్ష్యస్థాణురూప మాపద్మజుఁడుఁ
గనుఁగొనఁగ నజప్రాయం
బనఁ దక్కినవారి నెన్నఁదగునే యెచటన్. 86

వ. దేవా! యమ్మునితపంబు వారించి నీకు మెప్పు పుట్టించెదఁ జూడుమీ యన నతండు మనంబున ఘనంబగు సంతసంబున ననర్ఘ్యమణి భూషణాంబరాదులు గట్టనిచ్చి ప్రియపూర్వకంబుగా ననిపి రంభ కిట్లనియె. 87

సీ. నీకుచంబులు శూరనికరంబులకునెల్ల
రమణీయశైలదుర్గములుగావె
నీవాలుఁజూపులు నిఖిలపల్లవులకుఁ
బంచాస్త్రశరపరంపరలు గావె
నీముద్దులొల్కెడి నెయ్యంపుఁబల్కులు
విటజనాకర్షణవిద్యగాదె
నీమందహాసంబు కాముకశ్రేణిపై
మరుఁడుచల్లెడి సౌఖ్యమందుగాదె

తే. సరసిజానన నీతోడి సురతకేళి
పరమమైనట్టి సాయుజ్యపదముగాదె
నీవిలాసంబు మదిలోన [1]నేర్పుమీఱఁ
దలఁచుచుండుటయును జన్మఫలముగాదె. 88

---

1 నెవ్వదీఱ.

సీ. అతివ హవ్యములు దేవాళికిచ్చుటలు నీ
¹విందుల నాదటఁబొందఁగోరి
దీక్షితులగుచు వేదికమీఁద నిలుచుటల్
నీకుచవేదిపై నిల్వఁదలఁచి
సోమపానముఁ జేసి సొక్కుట దలఁప నీ
యధరామృతంబున కాసఁజేసి
యవభృథస్నానంబు లాచరించుటలెల్ల
నీనునుఁజెమటల నానఁబూని
తే. వీతిహోత్రునిలో నేయి వేల్చుటయును
బొలఁతి పొలయల్కకాఁకలఁబొరయఁ జూచి
యనుదినమును గ్రీడింతురు యజ్వలిట్లు
సవనములఁ జేసి నీవిలా²సంబుఁ గనఁగ. 89

తే. కడునిశాతంబులైన ఖడ్గములకైన
నింతయును భీతినొందక యెదురుశూరు
³లోడుదు రొకింత నీవల్గిచూడఁ గీర
వాణి నీచూడ్కియది యెంతవాఁడి చెపుమ. 90

క. ధరణీతలమున యోగీ
శ్వరుఁ డొక్కఁడు తుల్యుఁడనఁగ సంతతనిష్ఠా
పరుఁడై తపమొనరింపఁగఁ
దరుణీ, భువనంబులెల్లఁ దల్లడమందెన్. 91

క. కావున భువనత్రయమును
గావుము; ననుఁ బ్రోవు; తుల్యు ఘనతప ముడుపం

1 పొరుగువారని వారిపొందుఁగోరి. 2 సవనములను. 3 లోడుదురు డొంకి నీవల్గిచూడఁ.

గాఁపు నయోపాయంబులు
వేవేలును నీవుదక్క, విమలేందుముఖీ! 92

వ. అని ప్రియంబును మన్ననయుందోఁప నానతిచ్చినఁ గరకమ
లంబులు మొగిడ్చి రంభ జంభారి కిట్లని విన్నవించె. 93

ఉ. ఇచ్చక మొప్ప నీయెదుట నిచ్చెలులెల్లను బుద్ధిమాలి తా
రిచ్చకువచ్చినట్టిగతి నేవిధినైనను బల్కనిమ్ము కా
ర్చిచ్చను నమ్మహామహుని చిత్తమునొచ్చినఁ గీడుదప్పునే
పచ్చనివింటిజోదు హరుపైఁబడి యేగతియయ్యెఁజెప్పుమా!

ఆ. ఎదిరిసత్వమెఱిఁగి యెదిరినచోఁ గదా
విభుఁడు జయమునొందు వేవిధములఁ
గొలఁదికానిపనులకును బోవఁగాఁ గీడు
కొలఁదిగనక వెంటఁ గూడకున్నె. 95

ఆ. వినఁ గానిమ్ము నీయాజ్ఞ ననిమిషేంద్ర!
ధరణిపై నుగ్రవృత్తితోఁ దపము సేయు
తుల్యుని భుజంగతుల్యుఁగాఁ దుదినొనర్చి
యతులసంభోగముల సోలి యాడఁజేతు. 96

క. నీయాన నమ్ము చూపెద
నాయోగిని నగుచు నేరుపంతయునట నే
నీయాననమ్ము చూపెద
నాయోగికి నగుచుఁ బోయి యనిమిషనాథా! 97

వ. అని యప్పద్మలోచన సహస్రలోచనుచిత్తంబు మెచ్చు
నట్లుగాఁ బలికిన నతండు సంతసిల్లి యయ్యిందువదనకు నపరి
మిత భూషణాంబరాదులు వినయపూర్వకంబుగా నొసంగి
యనిపిన. 98

క. అంత సకలవనలక్ష్మీ
కాంతము వనరాశికన్యకాసుతవిజయో
దంతము జితమానవతీ
స్వాంతము నై నిప్పటిలు వసంతము వచ్చెన్. 99

సీ. మంచున [1]మేనెల్ల మర్దించి పత్త్రసం
చయమును డుల్చు విశల్యకరణి
ముదిసిన తరుజాతమునకుఁ జిత్త్రంబుగాఁ
దారుణ్య మొసఁగు సంధానకరణి
పసరుచందముదోఁచి యొసఁగెడు కోరక
వ్రాతంబునకును సౌవర్ణకరణి
హరునిచే మటుమాయమై మేనెఱుంగని
చిత్తజాతునకు సంజీవకరణి

తే. పలుకనేరని కోకిల ప్రకరమునకు
నంచిత స్వరమిచ్చు మహౌషధంబు
కాముకశ్రేణులకునెల్లఁ గాలకూట
మనఁగ మించె వసంతసమాగమంబు. 100

చ. చలమున మూగలైనపికసంఘము నమ్మరుచే కటారి మూ
గలుగనొనర్చుటొప్పగు జగంబున టాఁగలుగాని యట్టి రా
చిలుకలనెల్ల టాఁగలుగఁజేసి మనోభవు సేనలోన రాఁ
గలుగనొనర్చెఁ జిత్త్రములుగా వెవసంతుని చేఁతలన్నియున్.

తే. తరువులకు మేఘుఁడప్పులు దానొసంగి
యవి వసంతునికిమ్మని యప్పగింప
దానికి ఫలములియ్యఁ బత్త్రంబులిచ్చె
ననఁగఁ దరువులపత్త్రంబు లవనిరాలె. 102

1 మేలెల్ల డించిన.

తే. అలవసంతుఁడు కొమ్మలయందుఁ బ్రేమఁ
బత్రభంగము లొనరింప బహుళభూరు
హములఁ గనుపట్టు కొమ్మలయందునెల్లఁ
బత్రభంగంబు చేసె నభంగలీల. 103

సీ. కెంజాయ పల్లవపుంజంబు గీల్కొని
యధికసంధ్యారక్తి ననుసరింప
గట్టియై యెండసోఁకని తరుచ్ఛాయలు
తిమిరంపుగుంపుల కొమరుదాల్పఁ
గోరకంబులు నిండుకొని సందడిలునట్టి
తారకంబులతోడఁ దరస్తరింపఁ
బుప్పొడి దట్టమైకప్పినతావులు
వరచంద్రికావైభవంబుఁజూపఁ

తే. దొరుఁగుపూఁదేనియలు మంచుతోడ నొరయ
నేలులైపాఱు ఫలరసమిందుకాంత
జనితసలిలంబుఁ దులకింప వనములెల్లఁ
జాల సితపక్షరాత్రుల చందమయ్యె. 104

మ. ఒగరెక్కం గడులేఁతలై మృదువులై యోగ్యంబులై
యున్న యా, చిగురాకు ల్దమ కంఠదోషముల నుచ్ఛేదిం
పఁగాఁ జాలు మం,దుగతిఁ మేసి పికంబులెల్లఁ దరుసందో
హంబులఁ వ్రాలి సో,లి గరిష్ఠంబగు పంచమస్వరముఁ
గ్రోల్చెఁ మన్మథప్రీతిగాన్. 105

క. పరిపక్వఫలములెల్లం
బరికించి తదీయరసముఁ బానము గావిం
చి రుచులఁజొక్కి కడుం బో
తరమున రొదఁజేసెఁ శుకవితానము పేర్మిన్. 106

తే. భూరి మధుపానమునఁ జొక్కి పుష్పరేణు
పటలి భూతిగఁదాల్చి నేర్పరితనమున
ఝుంకృతులు శృంగనాదంబుజాడగాఁగఁ
దుమ్మెదలపిండు మించె సిద్ధులవిధమున. 107

క. వెన్నెలతళుకును మించిన
వెన్నెల బిసకాండములు ప్రవీణతతోడన్
గ్రొన్నెలఁదగురాయంచల
గున్నలు జవరాండ్రకిచ్చెఁ గోరికతోడన్. 108

చ. మలయము నేలి పద్మినుల మంజులసౌరభమెల్లఁ గ్రోలి పు
ష్పాలఁ గనుపట్టు మేలితమ్ముల్మకరందఁగ వ్రాలి కైతకం
బులఁ బొడకట్టుధూళి దివిబోవఁగఁ ద్రోలి మృదుత్వశీలియై
కలయఁ జరించెఁ జల్లనగుగాలి సదాను[1]నదన్మదాలియై 109

వ. ఇట్లు సమస్త మహీరుహంబులకు సంతసంబొసంగు వసంత
సమయంబున ననంతధ్యానపరాయణుండై హృదయస్థిత
నారాయణుండును నిష్కలప్రచారుండును నిర్వికారుండును
నగు తుల్యుండుగ్రతపంబుఁ జేయుచుండెనంత. 110

సీ. చెలువైన చిల్కతేజీమీఁద నొసపరి
కెందమ్మి పక్కెరఁ బొందుపఱిచి
క్రొత్తదాసనపుఱేకులు గీలుకొల్పిన
బిరుదైన దగులాలసరియొనర్చి
కురువేరు నెరులచిక్కులుదిద్ది సవరించి
కట్టిన [2]సరివెలికట్లు వైచి
నవకింశుకప్రసూనదళంబు సరిలేని
యరిగఁ బ్రియంబున నవధరించి

1 సరన్మదాలియై. 2 వెలిసమకట్లు.

తే. యిరుఁగెలంకులనుంచిన యొఱలతోడఁ
దనరు చిగురాకుఖడ్గాలుదారలీల
నొనరఁదామరనూలున బెనఁచికట్టి
కలువతావులుఁ జెలువంపుగతి ఘటింప. 111

సీ. తనకు జోడెఱుఁగని దంట తామరతేకు
జొంపంపు సొంపైన జోడుదాల్చి
తనకొక[1]దాపుకోర్వని మహావీరుఁడు
[2]దాపున చిగురుటత్తళముగట్టి
తనతలమీఁదనింతయు లేని నెఱజోదు
కలిగొట్టుపూఁబొమ్మికంబుఁ బూని
తనకొక్క[3]మాత్రైనఁ దలఁపని కడుదిట్ట
కమలకర్ణిక ఘోటకముగఁ గట్టి
తే. తనకుఁ [4]జేమించినట్టి దిద్ధరణి లేని
ఘనుఁడు నాళంబుతోడి పంకజముఁ గేల
నిడుగుఁగాఁబట్టి సురలు వర్ణింప నపుడు
ననల విల్కాఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యె. 112

మ. చెలువంబై కనుపట్టు రాచిలుక తేజీనెక్కి మిన్నంద భం
జళిఁ ద్రొక్కింపుచు వింతవింతగతులన్సవ్యాపసవ్యంబులన్
గలయం ద్రోలుచు మండలీకరణరేఖ న్జూపుచున్మించెఁ బూ
విలుకాఁ డభ్రగరాజువాహనముపై విష్ణుండునాఁ బొల్పు
గన్. 113

వ. మఱియును. 114

---

1. తావుగోరని. 2 తావుల. 3 సూత్రైనఁ దలఁపని పెనుదిట్ట. 4 జెయి మించినట్టిదిద్ధరణి లేని.

సీ. పక్షపాతముకల్మి పార్శ్వభాగంబుల
[1]నీలకంఠంబులు సోలినడువఁ
బల్కులఁ నమృతంబు లొల్కఁ బల్కెడుశుక
ప్రముఖ సద్ద్విజకోటి బలసికొలువఁ
గన్నులకింపైన కాంతిఁ బ్రొద్దులుపుచ్చు
రాజహంసలు క్రమారంభ మొనర
నరమర లేనినెయ్యమున నల్లల్లనఁ
గదిసి ముందఱ మరుద్గణము రాఁగ
తే. పంబి భృంగీశ మధురగానంబు చెలఁగ
మాధవుఁడు నెయ్యుఁడై మహామహిమ మొసఁగఁ
దలఁప నొరులకు లేనట్టి బలము మెఱయఁ
దథ్యవిషమాంబకఖ్యాతిదాల్చి యతఁడు. 115

వ. సపరివారుండై నిజకేతన ఛత్ర చామరాది లాంఛనంబులు వెలుంగ బ్రహ్మవిద్యాకల్యాండగు తుల్యుండు దపంబు సేయు వనంబు వొచ్చి నిల్చినంత రంభయు జంభారి పంపుఁ బూని దన నెయ్యంపుఁజెలులు కొలువ వచ్చుచుం దన లోన. 116

చ. అనిమిషనాథుఁ డిట్టిపనికై ననుఁబంపెఁ దదీయకార్యమే
యనువుననైనఁ జేసి హృదయంబున సంతసమందఁ గందునో
మునివరు మోసపుచ్చుటకు ముందఱనిల్వ నతండెఱింగి నె
మ్మనమునఁ గందునో చనుట మానితినేని బలారి[2]గందునో.

క. అని తలపోయుచుఁ గూరిమి
వనజాక్షులఁ గూడి మనసు వదలియు బీరం

1 నీలకంఠాశ్వంబు, నీలకంఠాంగము. 2 గుందునో!

బు నిగుడ మునివరు నాశ్రమ
వనమున కేతెంచె దివ్యవనితామణి దాన్. 118

వ. ఇట్లు వచ్చి సఖీసమేతంబుగా దివ్యయానావతరణంబుఁ జేసి యందు. 119

ఉ. ఇచ్చకు వేడ్కసేయఁదగు నీడల నీడలఁ గమ్మతావులం
బొచ్చెము లేక చల్లఁగలపొన్నల[1]గున్నల మించుబోయలన్
నిచ్చలుఁ బూచి పెంపొదవు నిమ్మల యిమ్ములఁ బాంథకోటిపై
మచ్చరికించునట్టి యెలమావులతావుల సంచరించుచున్. 120

ఉ. మూఁగుచుఁ దోడిచేడియల ముచ్చటలం గికురించి యొండు చో, దాఁగుచుఁ బుష్పసౌరభకదంబములన్ గల తీవ యుయ్యెలం, దూఁగుచుఁ బువ్వుఁదేనియలతుంపురుగుంపులచేత నిచ్చమై, దోఁగుచు నిండు జవ్వనముతో ముఱిపంబున విఱ్ఱవీఁగుచున్. 121

క. చెలఁగుచు మర్మపుఁబలుకులఁ
గలఁగుచుఁ గరతాళగతుల కనురూపముగా
మలఁగుచు రాయంచలగతి
మెలఁగుచు నంతంత వేల్పుమెలఁతలు వరుసన్. 122

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశినులు దమలోన. 123

క. మరువము మేను లతాంగి
మరువము దగ[2]మమ్ము హరుని మాఱుకొనిన య
మ్మరువమ్ము మానుటకు నై
మరువమ్మిది బ్రహ్మచేసె మానసమలరన్. 124

1 తిన్నెల. 2 మున్ను.

క. వ్రీడావతి చనుదోయికి
ఈడని పోల్పంగ ఫలము లేవియనం దా
ఈడనకలవని వేఱొక
ప్రౌఢ వలుకఁ దోడిచెలులు పొదలిరి వేడ్కన్. 125

క. పడఁతీ! తావులకున్ బై
పడ నేటికిఁ బొగడ లివియ పంచాస్త్రునకున్
విడిపట్టు సతులసిగ్గుల
విడిపట్టుగదా యటంచు వెఱతురు చేరన్. 126

మ. చెలియా, యప్రతిమానగంధములచేఁ జెన్నొందు సం
పెంగ దాఁ, గలుషాకారులటంచు భృంగవరుల న్గారించి
సంపెంగదా, తలఁపన్ దీనిగుణంబులెల్ల విని పాంథవ్రాత
ముల్ సంతసంబుల పొందంగని భీతినొందుననిన్ భూమిన్
విచిత్రంబుగాన్. 127

ఉ. మానిని, యెఱ్ఱనై తనరు మంకెనపువ్వులమీఁది భృంగసం
తానముఁ జూచితే వనమున న్విహరించు రమావధూటికిన్
బూనికఁ బుష్పజాలములఁ బూజలొనర్చి వసంతుఁ డింపు
తోఁ, దానిడు ధూపవహ్ని జనితంబగు ధూమమురీతి
నొప్పెడున్. 128

ఉ. శంబరవైరి వీనిసుమజాలము చేతనె నేర్పుతోడఁ గ్రో
ధంబున శంబరాసురునిఁ దార్కొని యేచిన వాని మాంసర
క్తంబులు పీల్చి యాఁగదు ద్రాళఁగ నోపక క్రక్కుచున్న
భావంబనరాగవత్కుసుమవల్లరుల న్గనుపట్టె నీపముల్.

ఉ. విన్నఁదనంబుతోడఁ గడువెల్వెలఁబాఱెడు నిందువంక నే
మున్నది గెల్వ నాకనుచు నుద్ధతిమారుఁడు చందమామ

నుఁ, బిన్నఁగఁజేసి మోదుగకుఁ బెద్దఱికంబిడి యిందు
వంక నే, కొన్న జయంబులెన్నియని కోరి పఠింపుదు నంబు
జాననా ! 130

ఉ. వారిజములు ల్మహీంజమగువారిజము ల్సమమైన పేరికై
పోరుచు మన్మథుం డనుపఁ బోయి తమిన్ యువకోటిఁ
గాఁడుచో, సారసమై చెలంగమిని సారసము న్మణిగించి
మించె నీ, వారిజ మాత్మ రాగజిత వారిజబంధురరాగ
పూరమై. 131

ఉ. ఓ యెలనాఁగ, కేసరములోలిఁ గనుంగొని తమ్ములంటి వా
నో యలనాగకేసరములో వివరింపుము రాకపోకలన్
రాయని మేలుగల్గి ద్విజరాజకరగ్రహణోచితంబులై
వేయువిధంబుల న్బరిఢవిల్లునె పద్మము లెన్నిచూడఁగన్.

చ తరువరమైన యీకొఱవి దయ్యె మెఱుంగ మరుండు పాం
థులన్, వెఱవఁగఁజేయఁ బెంచి వనవీథుల నుంచిన నెల్ల
వారల, న్దఱిమి వారించు నక్కొఱవిదయ్యముఁబోలె [1]నట
చ్ఛిలీముఖో, త్కరరవఘోరహుంకృతిఁ బతత్సుమనోనల
[2]జాలకీలలన్. 133

చ. కొసరనితావిమించు కలిగొట్టు మనోభవభూవిభుండు సం
తసమును జెందునట్లుగ ధనంబులు పెట్టెడుఁ గాపుఁబోలెఁ
దాఁగొసరునఁ జాల భక్తిఁ [3]గలిగొట్టు మనోహరగంధ
బంధురప్రసవసమాజ మంచు మదిఁ బాంథులు భీతివహింతు
రెంతయున్. 134

---

1 రటీ. 2 కీలభిన్నతన్. 3 గలకొంటి.

చ. మారుఁడు కోపగించి కుసుమంబులచేఁ గడకంటఁ జూచి బ
న్నీరని తామధువ్రతనిజేష్టభటాళికి నప్పగించినన్
వారణఁజేసి యాకులము వార లొసంగెడు పన్నుగాఁగఁ బ
న్నీరనిశంబు నిచ్చుఁ గడునేర్పరి గొజ్జఁగిగా తలంచినన్.

చ. చెలువముతోఁ బ్రవాళములచే సుమనోనికరంబు గప్పి ని
ర్మలగురుభక్తిమై ఫలసమాజము విప్రకరార్చితంబుగా
మెలఁగుచు మాధవుండు మది మెచ్చఁగ లచ్చికి మందిరంబు
నా, నలరి యశస్వితోడ నెనయా వనచూతము చూత
మంగనా! 136

చ. వినుతవయోవిలాసమున వీఁగురసాలము నంటుకొమ్మయం
చు [1]నొక సరోజనేత్ర దనచుట్టఱికం బెఱిఁగింపఁ జేరినం
తనె నిజకుంతలంబుల బెనంగుచుఁ జన్నుల నంటినంత న
ప్పనికయి సిగ్గుఁజెందె నవపల్లవకృత్యముగాఁగ నవ్వుచున్.

శా. నెమ్మి న్శంకరుఁ డాత్మమాళిఁ గదియ న్నీరేజవిద్వేషితో
నిమ్మారేడుదళంబు దాల్చి తనలో నిందీవరాప్తప్రకా
శమ్మెల్లం బదియైదునాళ్లపనిగాఁ జర్చించి మెచ్చున్జుమీ
యిమ్మారేడుగణింపనైన జగము ల్వీక్షింప నీభూజమున్.

ఉ. చందన మెల్ల భోగులకు శైత్యగుణంబున మంచిదయ్యె వె
[2]చ్చందనమయ్యెఁ బాంధుల నజస్రము నేచు నెపంబు రాజు
మెచ్చం దనమీఁదితప్పునకుఁ జాలఁగ అంపపుకోఁత
కోర్చియున్, డెందము చల్లఁ[3]జేసెడినదే కడుచిత్రము దీని
శాంతమున్. 139

1 నగ. 2 ల్చందనమాని. 3 చేసె వినుఁడీ.

ఉ. లాలనతోఁ బయోధరఫలంబుల పెంపున నారిగా రస
జ్ఞాళిఁ దలంచి వచ్చిన రయంబున దట్టముగాఁగ [1]నవ్వుటన్
హేల దలిర్ప నారికెడ మే యని తక్కినవారలెల్లఁ గాం
తా లలిఁబల్క నారికెడ మయ్యెఁ జుమీ యిది స్త్రీసు
జాతిలోన్. 140

క. కరవీరము మన్మథభీ
[2]కర వీరమ్మూర్తమగుగతి నుండంగాఁ
బరికించి విటులు సిగ్గునఁ
బరికించిరి దానిఫూఁత పసలెఱుఁగరొకో. 141

క. అరిఁ బూని మదనుఁ డేసిన
యరిఁ బూనికఁ జెలుచుఁ జిన్నవైనంగానీ
విరవాదు లనుచుఁ గడున
వ్విరి వాదులు మాని వేల్పువెలఁదులు తమలోన్. 142

క. ఏలాలత లెన్నైనను
నేలాలతలుండ ననుచు నింతులు తమలో
నేలలు పాడుచుఁ దగు ను
య్యాలలుగాఁ జేసి యూఁగి రతిముద మొదవన్. 143

క. పొదరిండ్లకంటెఁ జెలువగు
పొదరిండ్లుంగల్గ విటుల పొందికకై యు
న్మదనాగయానలకు న
న్మదనాగమ పర్ణశాల మఱియొండేలా. 144

క. ఈకుసుమగుచ్ఛమతి భృం
గాకీర్ణం బగుచు నొప్పె నతివా, చూడన్

1 నవ్వుడే. 2 కరవీరము మూర్తమైన.

రాకాంతంబున గ్రహణ
వ్యాకులిత శశాంకబింబమని పోల్పంగన్. 145

వ. అని వినోదాలాపంబులాడుచుం జనిచని. 146

ఉ. సుందరులెల్లఁ దత్తరపుఁజూపుల నవ్వనమెల్లఁ జూడ నిం
డం దిమిరంబు పర్వినఁ గడంగి యొకించుక నవ్వినంతలో
నం దమమీఁద వెన్నెలబెణంగయితోఁచిన రాత్రియన్న బు
ద్ధిం దళదంబుజాతములఁ దేటి గనుంగొన మాని రంతటన్.

వ. అందు. 148

ఉ. అందనిపువ్వుఁగొమ్మలకు నైై చరణాగ్రము లూఁది నిక్కి యా,నందముతోడ హస్తనలినంబులు సాఁచినఁ గక్షదీధి
తుల్, చిందులు ద్రొక్క నీవి [1]విడి చీరకటిప్రభ లెల్ల
దిక్కులం, జిందఁగ నాననాబ్జముఁలఁ జెల్వపుఘర్మకణంబు
లొల్కఁగన్. 149

ఉ. నిక్కులనాత్మసంచయము నిక్కులతాతతులంటి యత్తఱిఁ
జిక్కనిపువ్వుఁదేనియలు చిక్కఁ గరంబులు జీరువాఱఁగాఁ
జొక్కపుఁదావికిన్మదులఁ జొక్క నఖాగ్రముల న్సురాం
గనల్, దక్కఁగఁ బుష్పగుచ్ఛములు దక్క మనోహరలీలఁ
గోయఁగన్. 150

తే. మాధవీపుష్పముననున్న మత్తషట్ప
దమని యెఱుఁగక జంబూఫలమని చేరి
పట్టఁబోయిన నది కేలు కుట్టినంత
నులికిపడె నొక్కసఖి తోడిచెలులు నగఁగ. 151

---

1 తతి చీరఁగటి.

ఉ. పయ్యెదజాఱ సంతసము పర్వఁ గడున్నిగుడించునూర్పులుం
బయ్యెదఁ జేరఁ జన్నుఁగవ బాగులు గన్గొని చక్రవాకముల్
దయ్య మెఱుంగు లుప్పతిలి తార్కొని చంపలఁ జెంపఁ
గొట్టఁగా,దయ్య మెఱుంగు వీరలవిధం బని కొందఱు బంతు
లాడఁగన్. 152

వ. మఱియుఁ గొంద ఱిందీవరాక్షు లక్షీణ ప్రభావంబున భావ సంభవుని పట్టపుటేనుంగుల చందంబున మందమందగమనంబులు మీఱ మిక్కిలి చలంబున మక్కువ లెక్క లెక్క మిగిలి పిక్కటిల్లిన చొక్కపుఁ దేనియ లొక్క పెట్టఁ దొరఁగం దిగుపడి పరిమళంబులు మరగి పరిభ్రమించు తుమ్మెదలు తండోపతండంబులై యుండఁగొన నీలమేఘ ఘటాచ్ఛన్న చంద్రబింబ సహస్రంబుల నవ్వుమవ్వంపుఁబువ్వు[1]గుత్తులు చేరఁ దదలికఫలకలులితచికురనికరంబులం దమపిల్లలని యుల్లంబుల నుల్లసిల్లి మాటిమాటికిం జేయు తేఁటిదాఁట్లఁ జోపం జాఁపు కరంబులు కిసలయవిసరంబు లనెడు నాస మెసవం జేరి కోకిలంబుల చీకాకుపఱుప వెఱపునం గడవ నడువ నమ్మురిపంబుఁ జూచి యచ్చటచ్చటఁ దిరుగు తమ కొదమలని రాయంచలు ముంచుకొనినం జనలేక నిలిచి పయ్యెద చెఱంగుల విసరఁ గవిసి చెన్నుగల గబ్బిగుబ్బలఁ దమకులంబువారలని ప్రేమపెక్కువల జక్కవలు చుట్టుముట్టిన నలయికలఁ జెమర్చి వణఁకునంగంబుల నిష్యందమానమరందబిందుసందోహమందపవనచలితలలితలతానికరంబు ననుకరించి మించిన వేడుకఁ దమ తమ యిచ్చల

1 గుత్తులజాడఁ.

విచ్చలవిడి సంచరించి యలరు నలరులం దెచ్చి యొక్కచో
నిలిచి యొకర్తు నుద్దేశించి. 153

చ. ఫలరసపూర్ణవాహినియు భవ్యమరందమహాస్రవంతియున్
జలజవిరోధికాంతమణి జాతతరంగిణి గూడి యిచ్చటన్
గలఁకలు దేఱిపాఱు నసఁగా నడిఁ జూచి త్రివేణిసంగమ
స్థలమని మాధవుండు విడఁజాలఁడు సంతతసమ్మదంబునన్.

తే. కీరవారంబు [1]మెప్పుడేఁ గీరవాణి
వాణిఁ జేరంగ నేప్రొద్దు వదరుచున్న
దకట ద్విజకులమయ్యుఁ బాంథాలినేచు
నతివ బలుగూళ్లఁ బెరిగిన కతన నేమొ? 155

క. ఈ కోకిలములు విరహులఁ
జీకాకుపడంగఁ జేయుఁ జెలియా యివి ప
ల్లాకులు పెంచినకతమున
నో కడుఁ [2]బుల్లాకు మేఁతనో వివరింపన్. 156

వ. అని యానందరసపూరితహృదయారవిందలై సరసాలా
పంబు లాడుకొనుచు నందనుంగూడి. 157

సీ. సమపీవరోన్నతస్తనమండలంబులు
మహనీయకుంభయుగ్మములుగాఁగ
నునుసోయగంబులఁ దనరెడు నూరుకాం
డంబు లనూనతుండములుగాఁగ
ధవళాంశుసంకాశదశననిర్యత్ప్రభా
సముదయం బతుల దంతములుగాఁగ

1 ముక్కునఁ గెంపుదేర. 2 బల్లా.

గరఁగి చెక్కులవెంట దొరుఁగు కస్తూరిబా
ట్లాతతదానధారాళి గాఁగఁ

తే. శంబరారాతి పట్టపుసామజముల
పోల్కిఁ బరిణతిమీఱంగఁ బోతరించి
మందగమనంబు లెసఁగ నమందలీల
వనములోపల విహరించి వచ్చివచ్చి. 158

క. చందనగిరిభవపవన
స్యందితకల్హారకమలసందోహరసా
నందభరపరిభ్రమదిం
దిందిరమగు నొక కొలను గనుఁగొనిరి సురతరుణుల్. 159

వ. అని శుకయోగీంద్రుం డిలావంతునకుఁ జెప్పినవిధంబు దప్పకుండ నెఱింగించిన విని యట మీఁది వృత్తాంతం బేమని యడుగుటయు. 160

శా. ముగ్ధాంభోరుహాలోచనామదన, [1]శంభుప్రాభవోపేత, స
మృద్ధాత్రీధరధీర, భోగికులసమ్రాడ్బంధురప్రజ్ఞ, శ్రీ దు
గ్ధాంభోధిగభీర, దానఘన, సింధుశ్రీదతారేట్సుధా భుగ్ధే
నుప్రతిమానభోగకలనా, భూమండలాఖండలా!

క. భూరిపరిపంథినిచయా
వారణ కుంజరఘటా నివారణలీలా
ఘోరపరాక్రమఘనకం
ఠీరవ సుగుణాఢ్య సత్యనిత్యాభరణా. 162

---

1 శంభత్ప్రాభవోపేత.

భుజంగప్రయాతము.—

సరోజాతవిద్విడ్భుజంగేంద్రతారా
హారక్ష్మాధరాజప్రియాకుందహారా
మరక్షోణిజాతద్యుమత్తేభదుగ్ధా
బ్ధిరమ్యోల్లసత్కీర్తిదీప్తిప్రచారా. 163

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మనామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్రభారతం బనుపురాణకథయందుఁ ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# చిత్ర భారతము

## తృతీయాశ్వాసము.

---



రమణీరమణపదాం
భోగిమహాషట్చరణ, కల్పభూమీరుహదా
నా, రామాజనమదన, ద
యారసరాఘు రామ, పెద్దనామాత్యమణీ. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని
జాతుం డగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదు లగుశౌన
కాదులకు నిట్లనియె నట్లాకోలను గనుంగొని యద్దరి నిలిచి
యావేల్పుముద్దియలు తద్దయు వేడుకం దమలో నిట్లనిరి.

సీ. తనసొమ్ములైయున్న ఘనతరపద్మరా
గప్రభాపటలి నల్లడలఁ బర్వఁ
దనజీవనస్థితి మనియెద నని రాజ
హంసమండలము నెయ్యమునఁ గొల్వఁ
దన నిత్యమధురత్వమునకుఁ దక్కినవారిఁ
జౌకసేయుచుఁ గవీశ్వరులు పొగడఁ
దనకు నీడై సంతతంబును వికసించి
పుండరీకంబులు దండి మెఱయఁ

తే. దన్నుఁబాయని సిరిఁ జూచి తలఁగలేక
వేడ్కఁ బ్రమదాళులెల్ల సేవించుచుండ
సరసులకునెల్ల మేటియై సార్వభౌము
చందమున నుల్లసిల్లి యీ సరసి మెఱసె. 3

చ. సరసిజనేత్ర చూడు జలజాతదళంబులపైఁ బయఃకణా
లి రమణ మీఱె మారుఁడు చలింపని ధైర్యమున న్విరో
ధులం, బోరిగొని చేరవచ్చినను బుత్రునిశౌర్యము మెచ్చి
లచ్చి దా,మరకతరత్నపాత్రికల మౌక్తికసంఘ మొసంగు
కైవడిన్. 4

చ. అలశశి తన్నొఱంగి కమలాకృతి నీటఁ దపంబుఁజేసి ని
ష్కలుషవధూజనాననతఁ గాంచిన నాశ్రయహైన్యజాత
విహ్వలతఁ దదంక మీ కువలయత్వము నొంది విధుం
గుఱించి యిం,దులఁ బటు నిష్ఠమై నిలిచెనో తరుణీనయ
నత్వసిద్ధికిన్. 5

క. తన పతియగు ద్విజరాజున
కును దను రాగంబుఁ జూడఁగోరియె యతఁ డిం
పునఁ దారలతోఁగూడిన
నును మొగమునఁ గెంపుగదిరెనో తొగగమికిన్. 6

మ. మకరందంబున దానము ల్సలిపి, జిహ్మప్రక్రియల్మాని, కొం
జక పుష్పాళ్లు విభూతిగా నలఁది, యైశ్వర్యంబుతోఁ బుష్ప
లి,ట్ప్రకరంబుల్ హరుఁ డంగజాతుని హరింప న్మాని దేవా
ప్తికై, ప్రకటప్రేమఁ దపంబుఁజేసె విలసత్పద్మాసనస్థేమతన్.

తే. కందమూలంబులు భుజించి కమలవనము
అందు నెలవొప్పఁజేసి ద్విజాలిపొగడ

భువనసంచారమహిమచేఁ బొలిచి రాజ
హంసతతులెల్ల హంసాలి ననుకరించె. 8

వ. ఇట్లు తదీయవిశేషంబు లీక్షించి యిది యంభోనిధియుం బోలెఁ గమలోదయస్థానంబై చంద్రమండలంబునుంబోలె నమృతమయంబై రామరాజ్యంబునుంబోలె లక్ష్మణానందకరంబై కౌరవసభయుంబోలె ధార్తరాష్ట్రనివాసంబై మించి నేత్రోత్సవంబు గావించె నని సంతసించి సలిలక్రీడాసంసక్తచిత్తలై యత్తరుణులు తత్తీరంబున. 9

చ. [1]వలుదవిభూషణంబులు జవంబున డుల్చి చెలంగి వస్త్రముల్
గలయ బిగించి పెన్నెరులు గట్టిగఁ గొప్పులు దిద్ది మంద
యానలు వనవీథిఁ గ్రుమ్మర మనంబుల నిండిన నేదదీఱ మె
చ్చులు దిలకించు నా సరసిఁ జొచ్చిరి సంతస మెచ్చరింపఁగన్.

వ. అయ్యవసరంబున. 11

సీ. అంగుష్ఠములు ముట్టి యంఘ్రితలంబులఁ
జెంది గుల్ఫంబుల నంది యూరు
వులఁ జేరి జఘనస్థలులు సోఁకి నాభిరం
ధ్రములను సుడిసి పక్షముల నూది
చన్నులుపట్టి కక్షంబుల నొరసి కం
ఠములు నిమిరి కపోలములు పుణికి
యధరంబు లాని నయనముల నొరసి ఫా
లములఁ జుంబించి శీర్షముల నంటి

తే. క్రమముమీఱఁగ నిరతాభిరతిదలిర్పఁ
గళల నెళవులు పరికించు కాంతు లనఁగఁ

1 వలదురుభూషణంబులు.

జాలె నీరేజపత్రలోచనలనెల్ల
సారసామోదయుతసరోజలము లలమె. 12

చ. [1]జలములుచొచ్చి యీఁదునెడ సారసనేత్రలమోముఁదమ్ము
లుం, జలజములుం గనంగ నొకచందమున న్వెలసిల్లఁ దుమ్మె
దల్, దలఁచఁగలేక పిల్లలని తారొకని వే కురులందుఁ
జొచ్చి మేఁతలుఁగ మకరందము ల్గురిసెఁ దక్కని ప్రేమల
ముద్దుసేయుచున్. 13

ఉ. పాటలగంధులెల్ల మురిపంబులఁ బంతములెక్కఁ జల్లుఁ బో
రాటము లాడుచు న్కువలయంబులఁ బద్మముల వేటలాడు
చుఁ, గూటువఁగూడి కేకిసలు గొట్టుచు నోలలు వెట్టి యా
డుచుఁ, బాటికి నీఁదుచు న్మునిఁగి చయ్యన నొండొకచోటఁ
[2]దేలుచున్. 14

క. కరకమలము లాననపం
కరుహంబులు నేత్రపద్మగణముఁ బాదాం
బురుహంబులుఁ జొప్పడ నా
తరుణులు పద్మినులె యనుట తథ్యం బయ్యెన్. 15

తే. అధరరాగంబు గన్నులయందుఁ జేరె
నడలయలసత తలఁపులఁ గడలుకొనియెఁ
గేళిరుచి పెంపు లూర్పులఁ గీలుకొనియె
సరసిలో నోలలాడెడి సతులకెల్ల. 16

వ. ఇవ్విధంబున జలక్రీడావినోదంబులు సలిపి యలసతం జెంది చాలించి యయ్యిందువదన లుదకంబు వెడలివచ్చు నవస
రంబున. 17

1 చలమునఁ జొచ్చి. 2 దేలఁగన్.

చ. తడిసిన మేలివస్త్రములఁ దార్కొని మేనులసోయగంబు
వెల్వడునెడఁ జూడ నొప్పెఁ జనవల్లభ, చిత్తజరాజ్య
లక్ష్మి నేర్పడర సమస్తపాంథహృదయంబులకుం గడునద్భు
తంబుగా, నెడపక విశ్వరూపము వహించినకైవడి నేమి
చెప్పుదున్. 18

చ. జలములు జాఱఁగాఁ జికురజాలము మించె సుధాంశు
మ్రింగి తత్కళ లఱగించుకో వెరవుగానక క్రక్కెడు
రాహురీతి వానలు గనుపట్టె నప్పటి ఘనంబు తెఱంగునఁ
బువ్వుఁదేనియం, గళములబంటిఁగ్రోలి తిరుగ న్వెడలించు
నళివ్రజాకృతిన్. 19

తే ఇట్టి చెలువంబు చూపఱ కింపొనర్ప
మేనితడియొత్తు లెడలించి మించుదుప్ప
టముల సవరించి కురులనీరముల జార్చి
వేడ్కఁ గైసేయఁదొడఁగి రావెలఁదులెల్ల. 20

ఉ. చారుపటీరపంకమునఁ జాలఁగఁ బన్నిరుపోసి మంచి క
స్తూరిని మేళవించి తమ చొక్కపుమేనుల మెత్తుకొన్న
యొయ్యారపు బాగుమించెఁ గుసుమాయుధుఁ డుర్వి సువర్ణ
కారుఁడై, మీఱెడు వన్నెకై పటిక మెత్తిన హేమశిలా
కలో యనన్. 21

తే. ముత్తియంబుల కమ్మలు ముంగరలును
[1]జల్లిబోటులు బవిరెలుఁ జంద్రికలును
మొగపుఁదీవెలుఁ గంకణంబులు సరంబు
లును మొదలుగాఁగసొమ్ములెల్లను ధరించి. 22

---

1. జల్లిబొట్టులు.

క. కురులు కొనగోళ్ల చే దు
వ్వి రసంబులు చిల్క కమ్మవిరులం జెవిపై
నెరవిరులు బాగుగా ని
ల్పిరి కొప్పులు దిద్ది యానిలింపాబ్జముఖుల్. 23

వ. ఇవ్విధంబున నవ్విలాసినులు చీనిచీనాంబరసుగంధానులేప
నానర్ఘ్యమణిభూషణ మనోహరమాల్యంబులు ధరించి. 24

సీ. ముఖచంద్రరోచులు మోహరించినఁ జూచి
వేనలిచీఁకట్లు వెనుకఁ దొలఁగఁ
గాను సింగంబులఁ గనుఁగొని కుచకుంభి
కుంభముల్ ఱవికల కొంగులీఁగఁ
బలుకు కోకిలకూఁత లలరిన నధరంపుఁ
బల్లవంబులు ద్విజపంక్తిఁ జేర
దరహాసచంద్రికల్ తళుకుచూపినఁ బాద
సరసిజాతంబులు సంచలింప

తే. వఱలి మట్టియలందియల్ సరవి మొరయఁ
గాంచికాదామకింకిణీక్వణన మెసఁగ
నీరజాక్షులు సురపొన్న నీడఁ దపముఁ
జేయుచున్నట్టి తుల్యుఁ గాంచిరి ముదమున. 25

వ. అయ్యవసరంబున. 26

క. ఒక్క కమలాక్షి యలసతఁ
జిక్కితి వని యుత్తరీయచేలమునఁ గడున్
గ్రిక్కిఱిసిన నునుగుబ్బలఁ
జిక్కిన గంధంబు [1]కమ్మ చెమటల నార్చెన్. 27

---

1 గ్రమ్మఁ జెమటల.

ఆ. నెలఁత యొక్కతె పాపట నెరులుదిద్ది
బాహుయుగ మెత్తి తనకక్షభాగసీమఁ
బొడమి బంగారు తళుకులఁ బోలునట్టి
వాల్మెఱుంగుల మునికి నివాళిఁజేసె. 28

క. ఒకకోమలి యమ్మునినా
యకు డగ్గఱి తపముఁజేసి యలసితి విఁకఁ గొం
చక మోవిఫలము భిక్షగఁ
బ్రకటితగతిఁ గొను మటంచుఁ బకపక నవ్వెన్. 29

తే. జపము సన్నంపు టెలుఁగున జరపు నతనిఁ
జేరి వేఱొక వికచరాజీవనేత్ర
మొగము మొగమునఁ జేరిచి నగవులొలుక
వ్రాయఁగారాని పలుకులు పలికె నపుడు. 30

ఉ. వేఱొక కొందఱింతులు ప్రవీణతతో మునినాథుఁ డున్న య,బ్భూరుహమల్ల డాయఁ జని పువ్వులఁగోయుద మంచుఁ గొమ్ములన్, మీఱిన వేడ్కనెక్కుతఱి నీవులు [1]జాఱఁగఁ గానవచ్చె నూ,గారుల మేలు, నాభులనయంబులు, నూరుల సోయగంబులున్. 31

వ. అయ్యవసరంబున నమ్మునిచంద్రుండు తన మనఃకమలపీఠంబున నిఖిల దేవతాకిరీటసంస్థాపితానర్ఘ్యమణిఘృణిపరివేష్టిత పాదారవిందయుగళుండును సనకసనందనాదిపురాతన యోగిజనసంస్తూయమానగుణాలంకారుండును గౌస్తుభ మణిహారుండును లక్ష్మీకఠోరస్తనసంఘట్టనజాతకిణసంకాశ శ్రీవత్సాంకుండును రూపనిర్జితసహస్రకోటిమిహిరతమం

1 జార్చినఁ.

డును పీతాంబరధరుండును శంఖచక్రగదాదిలాంఛనకలిత
కరకమలుండును సకల భక్తపరాయణుండును నగు శ్రీ
మన్నారాయణుని నిలిపి బాహ్యేంద్రియంబులఁ గికురు
పెట్టి నిశ్చలుండును నిర్వికారుండునునై స్థాణువు చందం
బున నుండుట యెఱింగియును రంభ తన సౌందర్య
గర్వంబు పెంపున ముందటికి డెలుంగక యతనిం జేరి. 32

తే. చెలియ తెచ్చిన వీణఁ గెంజేతనంది
కొని మెఱుఁగు గవియఁగ గవిసెన యుడల్చి
తీఁగెలు బిగించి సారెలు దిద్ది శ్రుతులు
గూర్చి యుత్తరతుంబికఁ గుచముఁ జేర్చి. 33

సీ. తనభూషణంబులఁ దనరెడు మాణిక్య
గణము లొక్కుమ్మడిఁ గరఁగిపాఱ
నీరసాకృతిఁ బొల్చునిష్ఠుర స్థాణువుల్
భాసురలీలఁ బ్రోమ్మోసులెత్త
నాసమీపంబున నల్లల్లఁ జరియించు
మృగపక్షిజాతంబు మేఁత లుడుగఁ
జైతన్యమొంది వస్త్రంబులఁ గనుపట్టు
చిత్రరూపంబులు శిరములూఁచ
తే. నొళవు చెమరింప దివ్యపయోజనేత్ర
గ్రామములు మూఁడు నిఖిలమూర్ఛనల తెఱఁగు
మంద్రమధ్యమతారక్రమంబు మెఱయఁ
బాడె రెండవశారదభంగిఁ బొంగి. 34

వ. అప్పుడు. 35

క. అనిమిషనాథునిబన్నము
మునివరుతప ముడుపఁగోరి మును దా నే తెం
చిన మదనుఁడుఁ దన బలముల
కును సెలవిడి చెఱకువింట గుణమెక్కించెన్. 36

క. కోయిలలదిఁ గనుఁగొని వెసఁ
గోయని కూయంగఁ జిలుకగుంపులు కినుకం
బాయని నెమ్మొగములఁ గెం
జాయలు దులకింప వెక్కసంబుగఁ బల్కెన్. 37

వ. అంత. 38

శా. నాదబ్రహ్మములక్ష్యమైమునుపులోనన్మోఁయుచుండంగ నా
హ్లాదం బొప్ప సుఖించుచున్నమునికై యారంభ పాడంగఁ
దన్నాదం బాత్మవశంబుఁ జేయుచు మహానాదామృతాంభో
నిధిన్, [1]స్వాదూత్కర్షము దాల్ప నాతఁడు తపోవశ్యత్వము
న్వీడునే. 39

క. తనమనమున మును నిలిపిన
వనజాక్షునిపాదములకు వందనమిడి మో
ల నిలిచినదానిఁ దా నో
య్యనఁ గనుఁగొనె నతఁడు లోచనానందముగాన్. 40

వ. ఇవ్విధంబున నప్పూఁబోఁడిం దప్పక చూచి తనలో నిట్లనియె.

ఉ. కారుమెఱుంగులెల్లనొగిఁ గాయముగా సవరించి మేలి బం
గారపునిగ్గుతోఁ గలిపి కమ్మని వెన్నెలతేటఁ దోఁచి శృం
గారరసంబునం గరువుకట్టి మనోజసువర్ణకారకుం
డీరమణీశిరోమణిని నింపున మున్నొనరించె బాపురే! 42

1 స్వాదోత్కర్షము.

తే. పలుక విహరింప నేర్చిన పసిఁడిబొమ్మ
రూపు గైకొని మెలఁగు మెఱుంగుఁదీఁగె
పోసఁగఁ జైతన్యమొందిన పుష్పలతిక
గాని యిది కాంత యని నమ్మఁగాదు మదిని. 43

తే. చంద్రమండలిమీఁద నక్షత్రపంక్తి
యుండు నంద్రది చూడ నయుక్తమయ్యె
వనితవదనేందుమండలంబునకుఁ గ్రిందఁ
బాదనఖతారకలు గానఁబడియెఁగాన. 44

చ. ఎలమిఁ గుశేశయప్రతతినెల్లను గెంజిగురాకుగుంపుతోఁ
గలిపి మనోజధాత తన కౌశలమేర్పడఁ గ్రొత్త లత్తుకల్
చిలుకుచు దీనిపాదములు చేసిన నీగతి నొప్పెఁగాక కెం
పులఁ దులకించు నీచెలువముం గను నే యటుగాక తక్కినన్.

తే. సోగవట్రువ బాగున సొబగులైన
కంజదళనేత్ర రదముల కాంతి దనరెఁ
బంచబాణుని లేమ చేపట్టినట్టి
దాసనపుఁబువ్వుబంతుల వాసి మెఱసి. 46

క. మానినిజంఘాయుగ మిల
లోనం దూణులకు గాహళులకుం బరువై
యీనని వరిగర్భములకు
సీనని సంపదలఁ దావహించె దళముగాన్. 47

ఉ నిండిన వేడ్కమీఱ నిట నీరరుహాయతనేత్ర రత్నపుం
బెండెము పెట్టుకెల్ల మదిబెగ్గిలి పెన్బొలయల్క వేళలన్
దండము వెట్టినట్టి మగతండము నూరులఁ జేరకుండఁగాఁ
బెండెముఁ బెట్టుకేయనుచుఁ జేర్చినుతింపఁగ బుద్ధిపుట్టెడున్.

తే. కమలముల మేలుఁ జెందొవగముల చెలువు
మత్స్యకచ్ఛప రేఖాసమగ్రతయును
గలుగ నీయింతిపదములు కొలనులయ్యె
మురిపముల హంసకంబులు మొరయునపుడు. 49

చ. కరభము లీడువచ్చుననఁగాఁ దగునెప్పుడు చేతులంబహి
ష్కరణమునంద వే ననఁటికంబము లెన్నఁగ సాటియా ఫల
స్ఫురణనశింపవేనిఁ గరిపోతకరంబుల జోడుదూఁగు బ
ర్బరతవహించ దేని సురభామినియూరుయుగంబుతోడుతన్.

తే. అమృత మధరంబునన్ దేజ మాననమునఁ
గమ్మతెమ్మెర యూర్పుల ఖమ్ము నడుమ
నుండుటీక్షించి యో యాపయోజముఖకిఁ
బృథ్వి యయ్యెను దాఁ గటి పెంపుకతన. 51

తే. రత్నకీలిత కాంచనరశన చేత
నింతి కటిచక్ర మొప్పె మహీస్థలమునఁ
గమ్మిగొక్కించి వొక్కముగా నమర్చి
యున్న మన్మథురథచక్ర మో యనంగ. 52

క. వనితజఘనంబుమీఁదుగఁ
గనుపట్టి మనోజ్ఞ రత్నకాంచీదామం
బనుపమగతి నొప్పెడుఁ గం
తు [1]నివాసద్వారబంధతోరణమనఁగన్. 53

ఉ. కౌనునభంబుగాని హరిక్రమ్ర వలగ్నముగాదుచూడ న
ట్లైనను దానిమీఁదఁబొడవైన పయోధరమండలంబు శో
భానిధి యైనచందురుఁడు [2]భాస్వరతారకలుంగ్రమంబునన్
గానఁగవచ్చునే పోలుపుగా నిఁక సందియమేల దీనికిన్. 54

---
1 నివాసకవాటబద్ధతోరణ. 2 భాసుర.

సీ. కుటిలవక్త్రనమయ్యెఁ గుంతలదేశంబు
దలకూడె సుమనోవితానమహిమ
నిష్కరత్వంబున నెగడెడు చోళమం
డల మతిసౌభాగ్యముల వహించెఁ
దప్పకచూడంగ నుప్పతిల్లెడు నంగ
రాజ్యంబు బంగారురాశియయ్యెఁ
గడునెక్కుసంబైన కాంచీప్రదేశంబు
సకలసంపదల కాస్థానమయ్యె

తే. శంబరారాతియను మేటి సార్వభౌముఁ
డతివయౌవనభూమి నెయ్యమున నేల
మధ్యరాష్ట్రంబునంద క్షామంబు మిగుల
నయ్యె నచ్చటివివరంబు దయ్యె మెఱుఁగు.

క. చనుఁగవయును జఘనంబును
ఘనతకునై పోరుచుండఁగాఁ గలఁబడకుం
డను మదనుఁడు నడుమను ద్ర
వ్యనఖాతమనంగ నాభివివరము పొల్చెన్.

తే. తనరునూగారుతో వళిత్రయము మించె
ఘనపయోధరభరము నోర్వనినడుముకు
శంబరారాతినీలకీలంబుతోడఁ
గూడబంగారుకట్లు గీల్కొలిపె ననఁగ.

తే. పసిఁడికుండల కుంభికుంభములఁ జక్ర
వాకములఁ బువ్వగుత్తుల వసుమతీధ
రములఁ బరిహాసమొనరించి రాయిడించి
చెన్నుమీఱెడు నీయింతిచన్నుదోయి.

క. ఈలలనబాహాయుగ్మముఁ
బోలుటకై యామృణాళములు వల్లికలుం
హేళివసంతులఁ గూర్చి వి
శాలవనమునందుఁ దపము సలుపుచునుండెన్. 59

క. గణుతింపఁగ మరుశంఖము
[1]మణితాప్తికినై తపస్సమాధి నిలిచి యా
మణిదీప్తి మెఱయుతరుణీ
మణికంఠంబై సువర్ణమహిమం దనరెన్. 60

క. పగడంపుఁదియ్యమోవికిఁ
బగ డంబుగఁ దాల్చి కెంపు బాగులచే దా
ని గెలువ[2]నోదవమినో యా
చిగురాకుంబోలు నింతిచేఁగట్టువడెన్. 61

క. హల్లకగంధికి మదనుఁడు
పల్లవరాగంపుముద్రపై నమృతముఁ దాఁ
జల్లుచు నధరముఁ జేసెనొ
పల్లవ[3]రాగంబుగాఁగఁ బ్రతిభాస్ఫూర్తిన్. 62

తే. పండువెన్నెలఁగాయు నీపడఁతిమోము
నందుఁ గెమ్మోవి తనరె సుధాశనప్ర
చయము సుధఁగ్రోలఁగాఁబూని చంద్రునందు
మించుఁ గెంపులగిండిఁ గీలించె ననఁగ. 63

క. ఈపడఁతి మెఱుఁగుఁ జెక్కులు
చూపట్టెం రతియు భావజుండునుఁ దమలో

---

1 మణిదీప్తికినై. 2 నోపమినో. 3 రాగదముగాఁగఁ.

నేపున నలరుచుఁ జిహ్వాము
లాపోవఁగఁజూచు మెఱుఁగుటద్దములనఁగన్. 64

క. రమణికి నాసిక తనరెను
గమలానందనుఁడు పాంథగణపక్షిసమూ
హముఁ బడనూఁదఁగఁ దిలసూ
నమునం గావించు జమిలినాళమురీతిన్. 65

తే. మించు బవిరెలకెంపులు మేలువాలుఁ
గన్నుఁగవకొల్కులకు వింతకాంతినొసఁగ
వెలఁది ముత్యాలకమ్మలకళలు గండ
ఫలకములనిండ నింటిపీనులు దనర్చె. 66

తే వెల్లదామరతేకుల విరియఁదోలి
వాలుగలనెల్ల నొకవంక వలలఁబెట్టి
చికిలిచేసిన యలుఁగులఁ గికురుపఱిచి
కామినికి నొప్పె నీవాలుఁగన్నుదోయి. 67

ఉ. వమ్మొక యింతలేక నిడువాలిక బాగును సోగలాగునున్
గమ్మ నవీనకాంతి గతిఁ గ్రమ్మఁగఁజేసి దివానిశంబులున్
నెమ్మి లతాంతసాయకుఁడు నిక్కముగా సవరించు వింటికిన్
బొమ్మలఁ బెట్టినట్టి కనుబొమ్మలు చూడఁగనొప్పె బాపురే.

చ. కమలజుఁ డీవధూటియలికంబటు చూచి మునిద్రుమప్రసూ
నము నొనరించి పోలదని నవ్వుచుఁ జెట్లనుగట్టి క్రొన్నెలం
గ్రమమునఁ జేసిన న్సవతురామికి రోసి [1]సవోడురాజునుం
దమకముతోడ నాకసమున న్విడఁ బాఱఁగ వైచె నిగ్గునన్.

1 తదిందురేఖనున్.

చ. పొలఁతిముఖాబ్జసంపదలఁ బొందఁ దలంచియొ చంద్రుఁ డబ్జతన్, జెలఁగినఁ దమ్మి యబ్జతను జెందినచో సమమైన పేరికై, చలమున రెంటికిం బగ నిజంబుగ నిద్దరఁ జెల్లెఁ గాక యీ, నెలవుననున్న తమ్మికిని నింగి శశాంకున కేల పోరగున్. 70

చ. తరుణిముఖారవిందమునఁ దానకమై విలసిల్లు తుమ్మెద ల్పరిమళలోభయుక్తిఁ దెగిపాఱక నిల్చెనొ కాక మోము చంద్రునికళంక మీగతి వినోదము సల్పెనొ కాక యింతి లేఁ, గురుల మెఱుంగు చందములొకో వివరింపఁగఁ జోద్య మయ్యెడిన్. 71

ఉ. అన్న సరోజగర్భుఁ డనయంబుగ దర్శనిశన్ బ్రభాతముం బున్నమరేల ఖేదగతిఁ బొందఁగఁ జేయ మరుందు మించఁ జే,సె న్నలినాక్షి పెన్నెరులచీఁకటి [1]చాయలు నిండియుండఁగాఁ, గన్నులఁ దెల్లవాఱఁగ మొగంబున వెన్నెల లుప్పతిల్లఁగన్. 72

వ. అని యివ్విధంబున నమ్మునీంద్రుం డయ్యిందువదన సకలావయవంబులం జూచి చూచి తనివిచాలక మఱియు నిట్లని వితర్కించె. 73

సీ. కిసలయంబులమేలు కెందామరలఁగూర్చి
    యిచ్చోట బ్రహ్మదా నేమిచేసెఁ
గరికరంబులసౌరు కదళీతరులఁగూర్చి
    యిచ్చోట బ్రహ్మదా నేమిచేసె

---

1 ఛాయలు.

గజకుంభములబాగు కందుకంబులఁగూర్చి
యిచ్చోట బ్రహ్మదా నేమి చేసెఁ
జంద్రబింబముచాయ సరసిజంబునఁగూర్చి
యిచ్చోట బ్రహ్మదా నేమిచేసె
తే. బర్హములమేలు షట్పదపంక్తిఁ గూర్చి
యెలమి నిచ్చోట బ్రహ్మదా నేమిచేసె
ననుచుఁ జరణోరుకుచముఖ ఘనకచముల
నసలు వీక్షించి చిత్తవిభ్రాంతినొంది. 74

క. కనుఁగొనెడు యోగివల్లభు
ఘనతరమైనట్టి ధైర్యకంచుకము దలం
ప నితరసాధనములచేఁ
జినుఁగునెయని మరుఁడు విరులచేఁ బగిలించెన్. 75

వ. అయ్యవసరంబున నయ్యతివరుం డాత్మాధీనుండయ్యెనని తలంచి. 76

ఉ. ఆరమణీశిరోమణి నయంబున నమ్మునినాథుఁ జేరి యొ
య్యారపురీతి నిల్చి వినయంబున హస్తయుగంబు మోడ్చి
క్రొక్కారు మెఱుంగుతోడఁ జెలికారముఁ జేయు సువర్ణ
కాంతులన్, మీఱిన యట్టి చన్నుఁగవ మేలిమి కానుకగా
నొసంగుచున్. 77

సీ. ప్రవహించు శృంగారరసపూర మమ్ముని
మేనికి జలకంబుగా నొనర్చి
[1]తళతళత్కాంతిచేఁ దనరెడు దరహాస
చంద్రికావితతి వస్త్రముగ నొసఁగి

---

1 మందహాసవికాసమహిమంబుచందనపంకంబుగా సమర్పణమొనర్చి.

[1]మవ్వంపుఁదేనియల్ చివ్వన నిడువాక్య
ములు ప్రసూనములుగాఁ బూజఁజేసి
చొక్కంపు నిడువాలుచూపు మెఱుంగులు
పొసఁగు నీరాజనంబులుగఁజేసి
తే. యమృతరసములు చిప్పిలు నధరబింబ
మదన నైవేద్యమునుగ నియ్యఁగఁ దలంచి
యడుగుఁ దమ్ములకెరఁగి నెయ్యంబుతోడ
రంభ యిట్లను [2]సంగమారంభ యగుచు. 78

తే. స్వర్గసౌఖ్యంబులకునెల్ల సంయమీంద్ర
గణనఁ జేసిన నేనె కారణము సూవె
యట్లు గాకున్న నాకొఱకై నరేంద్రు
లాహవంబునఁ దెగివత్తురా ముదమున? 79

క. వినుమట్టిరమేను నిన్నుం
గనుఁగొని కాంక్షించియుండఁగా వేడుకఁ గై
కొన వేల? రతులకుం బై
కొనవేల? సుఖానుభవముఁ గొనవేల? తగన్. 80

క. తనువులు నొచ్చినపిదపం
గను బ్రహ్మానందకేళికంబెఁ బ్రయాసం
బునఁ జెందక పద్మాక్షీ
జనితాసంగములు మిగుల సౌఖ్యముగావే. 81

శ్వా. నీ వీమోక్షము గోరి యోగముల నెంతే డస్సి డెందం
బులో, నేవెంటం గొనరాని మీఁది యమృతంబేలా విచా
రింప? నా, నీవీమోక్షముఁజేసి యోగముల నెంతే నెమ్మదిం

1 అచ్చపుఁదేనియల్ బిచ్చిలుమృదువాక్య. 2 సంభ్రమారంభ.

డాయ నీ, వేవెంటఁ జనకుండఁ గల్గు నమృతం బిచ్చోటఁ
నామోవిపై. 82

సీ. నా గుబ్బచన్నుఁ లున్నత హేమభూమీధ్ర
శిఖరములకు నీడు సేయవచ్చు
నాజఘనంబు బృందారకానేకప
శీర్షంబునకు నీడు సేయవచ్చు
నాకరంబులు సురానోకహంబులఁ బోల్చు
చిగురాకులకు నీడు సేయవచ్చుఁ
నా మందహాస ముద్దామ మందాకినీ
తోయంబులకు నీడుసేయవచ్చు
తే. నా యధరరుచి దేవతానాథసతత
సేవ్యసుధసొంపునకు నీడుసేయవచ్చుఁ
గాన నాతోడి యోగంబు గల్గెనేని
దివ్యభోగంబులెల్ల సిద్ధించినట్లు. 83

వ. అని యిచ్చనచ్చలంబు హెచ్చంజేరి మీఁదఁ జలువలు
గోలుపు కప్పురంపుఁ బలుకులు వోని ముద్దుఁబలుకులను,
వలరాజు వాఁడితూపులకు మెఱుంగుసూపు నోరచూపు
లను, సుధారసంబు తేటలగు పాటలను, మదననివాసంబు
లగు పెక్కు విలాసంబులనుం గరఁగించితినని సంతసిల్లి
కరంబులు మొగిడ్చి. 84

ఉ. అమ్మునినాథు నెమ్మొగమునందుఁ గటాక్షమునిల్పి రంభలోఁ
గ్రమ్మెడు సాహసంబు వెలిఁగానఁగవచ్చు నలీకమోహముౕ
ముమ్మరమై తనర్పఁ దన మోమొక యించుక వాంచి పాద
పద్మమున నేల వ్రాయుచు సుధారసమొల్కఁగఁ బల్కె
నేర్పునన్. 85

సీ. మచ్చువిల్తునికాఁక నొచ్చినదేహంబు
నీ చల్ల కౌఁగిట నిలుపకున్న
వెన్నెల మంటచే వేఁగు చన్దోయి నీ
కరవారిజంబులఁ గప్పకున్న
వేఁడి నిట్టూర్పుల వెచ్చనామోవి నీ
యధరామృతముచేత నార్పకున్నఁ
జెలులు చెప్పఁగ నైన చింతాభరంబు నీ
తియ్యనిపల్కులఁ దీర్పకున్న
తే. నెవ్విధంబున నీవల పీఁదనేర్తు
ననుచు నమ్మునికేలంట నతఁడు దొడ్డ
బ్రహ్మవిద్యా మనంబునఁ బాదుకొలిపి
దానిచేఁతకు రోసి డెందమునఁ గినిసి. 86
శా. కంఠారావమొనర్చె నత్తఱి మహోగ్రస్ఫూర్తి దిజ్నాగ
ముల్, గుంఠీభూతమదంబులై వడఁకఁగా గోత్రంబు లూ
టాడఁగాఁ, గంతేశాల సరోరుహప్రభవ నాకస్వామి భో
గీంద్ర వైకుంఠులద్దరిలంగ లోకములు సంక్షోభంబునం
బొందఁగన్. 87
క. భూపాలక విను తుల్యుఁడు
శాపజలం బపుడు కేల సవరించి మహా
కోపస్ఫురితాధరుఁడై
యాపడఁతుకఁ జూచి యిట్టులనియెం బెలుచన్. 88
ఉ. ఓసి దురాత్మురాల, వినయోక్తులచే నను వెఱ్ఱిఁ జేయు వే
రాసలు మాను నిప్పు చెదలంటఁగ నేర్చునె బల్మిఁ బైఁ బడం
గా సమకట్టి చేరితివిగానఁ దురంగమవై చరింపు నీ
మై నొబగెల్లఁ బొల్లువడ మర్త్యునిమోచి ధరాతలంబునన్.

వ. అని శపియించిన. 90

సీ. సైంహికేయచ్ఛన్న చంద్రబింబమురీతి
వదనంబు మిక్కిలి వాడి కంద
హిమసిక్త రక్తపద్మముల చాడ్పున నశ్రు
వులతోడి కెంపుఁగన్నులును మొగుడ
శ్యేనత్రసచ్చారికానినాదంబు చొ
ప్పున భీతి గద్గదస్వనము పొడమఁ
బెనుగాలి చేతఁ గంపించు వల్లికభంగిఁ
దల్లడపాటునఁ దనువు వణఁక

తే. నొదవు చంపకవాసన కులికిపడుచు
నళుల కైవడిఁ గుంతలంబులు విడంగ
ఱిచ్చవడి సొమ్మసిలి యంత వెచ్చివెచ్చి
తన్నెఱుంగని పెనుమూర్ఛ ధరణి వ్రాలి. 91

ఉ. అత్తఱిఁ గొంతసేపునకు నయ్యెలనాఁగ మనంబు ధీరతా
యత్తముఁజేసి లేచి తనువంతయుఁ గంపము నొందుచుండ రా,
జోత్తమ తుల్యపాదముల కొయ్యనఁ జాఁగిలి మ్రొక్కి నిల్చి లో,
నత్తిన శోకము న్భయము నద్భుతముం బిరుసై పెనంగఁగన్. 92

మ మునిచూడామణి నీమనంబు కినుకం బొందంగ లక్ష్యంబటఁ, వనజాతాక్ష లలాటలోచన సుపర్వజ్యేష్ఠ దేవేంద్రులైనను నిల్వంగ భయంబునొందుదురన న్నాబోటి యంతేదలెల్లను నీముందఱ నిల్వనోపుదురె చెల్లంబో కృపంజూడవే. 93

మ. అనఘా, పిచ్చుకమీఁద వేయుదురె బ్రహ్మాస్త్రంబు రౌద్రా
కృతిఁ, నను రోషించి తురంగరూపమున నానాదేశముల్
భ్రమ్మరం,గ నరుఁ మోవఁగ నానతిచ్చితిరి నాకా యట్టి
కష్టంపు రూ,పున వర్తింపఁబడఁ భవత్కరుణచేఁ బోషించి
రక్షింపవే. 94

సీ. విటుఁడు పల్లొత్తినఁ గటకటపడు మోవి
యినుపకల్లెములకు నెట్టులోర్చుఁ?
గొనగోరు సోఁకినఁ గ్రొవ్వాఁడు దేహంబు
ఘనకశాహతుల నేగతి సహించు?
వలిపపయ్యెద మోవఁ దలఁకెడియంసంబు
పక్కెర నేరీతి నిక్కి తాల్చు?
నారులు పాదాంభోజయుగళి మోవఁగనున్న
యే నన్ను్యల వహింప నెట్లు నేర్తు?

తే. సంతతము మందగమనాలసంబులైన
నాదుపాదంబు లిలఁ బవనంబులీల
పర్వఁబెట్టంగఁ జాలునే పరమయోగి
వర్య! నాకిట్టి దుర్దశ వలదు మాన్పు. 95

వ. అని తనలోన. 96

ఉ. కూరిమితోడఁ జేరి నలకూబరు నంతటివాఁడు మత్పదాం
భోరుహాలాక్ష కుంకుమపుబొట్టుగఁ గైకొని యెల్ల వేళలం
గారవ మెచ్చరింపఁ దన కౌఁగిటిలోపల నిద్రఁబోల్పుగాఁ
గూరుకుచుండు నాకు వెడగుఱ్ఱపురూపమువచ్చె దైవమా!

వ. అని యివ్విధంబునఁ జింతించుచుఁ దోడిచెలుల చందంబులు
వీక్షించుచు నొల్లం బోయిన యుల్లంబున దీనయై యప్సరమ.

మునీంద్రపాదారవిందంబులకుఁ బునఃపునః ప్రణామంబు
లాచరించి కన్నీరు సోన గురియఁ బెదవులు దడుపుచు నత
నికి దయ పుట్టునట్లుగా వెండియు నిట్లని విన్నవించె. 98

తే. ఎంతకాలంబునకు నాకు నే నెపమున
శాపమోక్షంబు గల్గెడు సజ్జనాగ్ర
గణ్య! నీ నెమ్మనంబునఁ గరుణఁ జేసి
యానతీఁదగు నశ్వేతఁ బూనఁజాల. 99

క. అని కరుణపుట్టఁ బల్కెడు
వనితకు నా తుల్యమౌని వాత్సల్యముతో
ననియెం దరుణీ! దుఃఖం
బునఁ జెందకు వినుము శాపమోక్షక్రమమున్. 100

చ. వినయవివేకశాలి పరవీరభయంకరదోర్బలుండు కుం
డిననగరంబునాయకుఁ డనింద్యచరిత్రుఁడు పుణ్యమూర్తి రా
మ నల భగీరథ ప్రముఖ మానవనాథ సమానరమ్యవ
ర్తనుఁడు చతుర్ధనుం డనఁగ రాజొకఁ డుర్వర యేలుఁ
గోమలీ. 101

ఉ. ఆతనికిం బురాకృతమహాసుకృతంబున మేనితోడ నే
యాతతసౌఖ్యసంపదల నత్యధికం బగుపుణ్యవిష్టప
వ్రాతము చూడఁగాఁ గలదు వారిజలోచన, యా నృపా
లకుఁ, బ్రీతిఁ దురంగ రూపము ధరించి వహింపుము నేర్పు
మీఱఁగన్. 102

క. ఆనృపతికి సంతోషం
బానఁగ లోకములు చూపి యరుదెంచిన నీ

మేని చెలువంబు తొల్లిటి
పూనిక నే యుండునటకుఁ బొమ్మని యనిపెన్. 103

వ. ఇవ్విధంబున ననుప నంతకుమున్న యమ్మునీంద్రు కోపంబు
నకు బెదరి. 104

సీ. రతిరాజు బాణసంతతిమూలఁ బడవైచి
చాపంబు గడపటఁ జప్పఁజేసె
జంద్రుఁడు తన రాక జాడఁగాదని రోసి
యుల్లంబులోఁ గంది వెల్లఁబాఱె
మలయానిలుండు సోమరినై తినని మేని
బడలికతో సుడివడి చలించె
దోరమైన యా వసంతుండు నేగెడుత్రోవఁ
గానక యడవిఁ జీకాకుపడియెఁ

తే. జిలుక గుంపులుఁ గండుగోయిలలగములు
నోలయఁజాలక చెట్లనె [1]యొదుగఁజొచ్చె
వలుద రాయంచగమియు వంకల నణంగె
మధుపకులమెల్లఁ దమ్ములమఱువుసొచ్చె. 105

వ. ఆ రంభయుఁ దన గర్వసంరంభం బుడిగి కన్నీరుదొరుఁగ
విన్నంబోయి యరవిరి దమ్మిపైఁ బరిభ్రమించు మదభ్రమర
బృందంబు చందంబున వదనంబుపైఁ జికురంబులు వ్రేల
వడి దూలఁ బుప్పొడి గప్పిన కొదమ నునుదీఁగె బాగున
ధరణీపరాగంబునం గనుపట్టి తనువల్లిక వణంక నయ్యాశ్ర
మంబు వెడలివచ్చునెడఁ దోడంగూడి యరుదెంచిన పువ్వుఁ
బోండ్లయందు నొక ప్రౌఢ యిట్లనియె. 106

---

1 యొదిగె జక్కు, వలుద రాయంచ.

సీ. వనిత యమ్మునిప్రౌఢ వద్దనె వద్దనె
చెప్పితి నామాట సేయవైతి
చేర నేటికిఁ గీడుగోరనె గోరనె
సన్నఁ జేసినఁ మానఁ జాలవైతి
రమణి పోదము పీడి రా వేల రా వేల
గాదని చెప్పినఁ గానవైతి
నిక్కపుపరుఁడని నీవింత నీ వింత
పిల్ల చేఁతలు చేసి జేలవైతి
తే. వకట నీనేర[1]మని యెంత యనినఫలము
నేమిరాఁ గందు నీ చిన్ని మోమువమ్మి
మెఱుఁగుదప్పిన యద్దంబు తెఱఁగుదాల్చె
నేమిచేయుదు నింక నాకేది దిక్కు. 107
క. అని వగచుచు నాయంగన
మన మూఱడిలంగ మంచి మాటలచే నొ
య్యన తన్విఁ దాని యనుమతిఁ
జనియె నిజస్థానమునకు సఖులుం దానున్. 108
వ. తదనంతరం బారంభ తచ్చాపదవానలజ్వాల సోఁకి వసి
వాళ్లువాడు తనువల్లిచే బెడంక నల్ల నల్లనవచ్చి చతుర్థన
బావాపరిపాలితంబైన కుండిననగరసమీపంబున నొక్క
వనాంతరంబున. 109
సీ. నెరులసొరళులందు నెమ్మోమునిరి చంద్రు
నందుఁ గన్నుల మెఱుంగంబుజాత
ములయందు మోవిచాయలు బింబములయందుఁ
గంఠంబుసొంపు శంఖంబునందుఁ

---

1 మేమని యెంతు నబల, ముట్టినను గందు.

జనుదోయిగరిమంబు చక్రవాకములందుఁ
గౌనువిలాస మాకసమునందు
జఘనమండలియొప్పు సైకతస్థలియందు
నడుగులపస చివురాకులందు
తే. నడలమురిపంబు గజగమనములయందు
మేనిచెలువంబు క్రొక్కారుమెఱుపులందుఁ
బలుకు [1]సుకుమార మెల్ల రాచిలుకలందుఁ
జేరఁ దొలిమేను వదలి యాచిగురుఁబోఁడి. 110
సీ. ప్రియునికెమ్మోవి చుంబింపనోపని లేమ
కఠినఖలీన మేగతి వహించు
హారంబు బరువని యలయు లతాతన్వి
వాగెల నెట్టికైవడి ధరించు
జడసోఁకు లోర్వఁగాఁ జాలనితరళాక్షి
కడువంక పల్లమే కరణిఁ బూను
నొడ్డాణమును దాల్పనోపని సతిపొట్టఁ
బట్టెడబిగి నెటువలె సహించు
తే. మిగుల మెత్తని నడుపుల మెలఁగునింతి
మనసుకంటెను జవమున మసలునెట్టు
లనుచు దేవత లద్భుత మంది చూడ
రాజకులనాథ సాంబ్రాణి తేజి యయ్యె. 111
వ. ఇట్లు రంభ తురంగంబై చరించుచుండె నంత. 112
ఉ. కుండినవల్లభుండు రిపుకుంజరసింహపరాక్రముండు దో
ర్దండధృతావనీతలుఁడు దానజితామరభూజచంద్రమా

---

1 సుడికార.

పాండవతనూభవుండు వనితామదనుం డొకనాఁడు వేడ్క
తో, మండలనాథులున్ హితులు మాన్యులు భామలుఁ జేరి
కొల్వఁగన్. 113

తే. భానుఁ డుదయాద్రిపై నున్న పగిది రత్న
ఖచితసింహాసనంబుపైఁ గడుముదమున
నాత్మతేజంబు దిక్కుల నాక్రమింప
నోలగం బుండె సకల నేత్రోత్సవముగ. 114

వ. అప్పుడు 115

క. కరికుంభజాతమౌక్తిక
పరికరమును సంకుమదము ఫలములు పింఛా
వరలు మృగమదముఁ గప్పుర
శిరముల్ గొనివచ్చె నొక్క చెంచయ్యొడకున్. 116

తే. వచ్చి కడుసంభ్రమంబున వసుమతీంద్రు
నంఘ్రులకు మ్రొక్కి యా యుపాయనము లెల్ల
సమ్ముఖంబునఁ బెట్టి హస్తములు మొగిచి
తనవచఃప్రౌఢి మెఱయ నిట్లనుచుఁ బలికె. 117

శా. సామీ! క్షేమములోని మా ప్రజలు నిచ్చల్ పండుగల్
సేయుచుం, బ్రేమం దామరతంపరై మనుదు రేభీతి న్మదిం
బొందకే, యేమేతప్పులు చేసినన్ గరుణ నీవే ప్రొద్దు మన్నిం
పఁగా, మామా పల్లెలలోననుండు మెలమి న్నాబోటివా
రాకయన్. 118

వ. అని విన్నవించిన నా చతుర్థనుండు సంతసిల్లి యా చెంచు
నకు నిట్లనియె. 119

చ. కలుగునె చేరువన్ బొలము కందువలన్ మృగకోటిపత్తు
లున్, మెలఁగునె క్రందుగా ననుచు మేల్నగవొప్ప నతండు

పల్కినన్, నిలిచి ముదంబుమీఱఁగ వనేచరముఖ్యుఁడు
హస్తనీరజంబులు మొగిడించి ఫాలమున మోపి చతుర్ధను
తోడ నిట్లనున్. 120

ఆ. మెకము లేమి [1]భ్రాంతి మేదినీవల్లభ
మందలై మెలంగు మావనముల
శరభ సింహ నాగ శార్దూల భల్లూక
హరిణ కిటి శశాదులైన వెల్ల. 121

తే. కారుఁగోళ్లను గౌఁజులుఁ గక్కెరలు[2]ను
బారువములుఁ బూరేళ్లను గేరజములు
గువ్వలును మొదలుగ లెక్కకొలఁదిమీఱఁ
గలవు పులుఁగులు నేతులు గ్రక్కఁ గ్రొవ్వి. 122

వ. మఱియును. 123

క. కూరిమితోఁ దిరుగుచుఁ గ
స్తూరీమృగకులము పొదలుదూఱఁగ ముండుల్
చీరినఁ దెరువుల నెత్తురు
కాఱ నచట నెపుడు పచ్చికస్తురి గలుగున్. 124

వ. అని విన్నవించిన సంతసంబునం బొదలి వేత్రహస్తులం
జూచి వేఁటరులం బోటరుల వేడుకలపేటి యగువేఁటకుం
బిలువనంపి తగినవారల నిలిపి యోలంబు సాలించి యంతర్గ
పురంబున కరిగి మజ్జనభోజనాదులు సలిపి యనంతరంబు.

సీ. పసిఁడిప్రాఁతల పచ్చపట్టు దట్టిగఁ గట్టి
కస్తూరి దట్టంబుగా నలంది

---

1 భాతి; భ్యాతి. 2 మ, యూరములును.

గరుడపచ్చలమించు కడియాలు ధరియించి
యురమున నీలంపుసరులు దాల్చి
మహనీయవైడూర్యమణి కీలితంబులై
పొలుపొందుకుండలములు ధరించి
మంచుచెల్వము నేవగించు నున్ననిపాగ
గట్టిగా నొసపరిఁ జుట్టచుట్టి
తే. జమునినాలుకఁ బురణింపఁ జాలునట్టి
వన్నెయడిదంబు వాఁపటివంకఁ బూని
శరశరాసనములు పరిచరులు దేర
రాజు చనుదెంచె నంతఃపురంబు వెడలి. 126

వ. ఇవ్విధంబున మృగయోచిత శృంగారంబు నంగీకరించి నిజమనోరథంబునకుం దగిన రథం బారోహణంబుఁ జేసి యతండత్యంతసంతోషభరితాంతఃకరణుం డై మున్ను దనకు మృగంబులచొప్పు చెప్పిన యచ్చొప్పరి ముందఱ నడువఁ బురంబు వెడలి చనునప్పుడు విక్రమప్రచండసింహోపమేయంబు లగుసారమేయంబులను మృగాక్రమణక్రియాభంగులం బొంగుసివ్వంగులను బలవత్ప్రతిహృదయపాటనపాటవంబు లగుసాళువంబులను వినోదకారణంబు లగు నోరణంబులను వెండియు మెకంబుల నీవలావలం జననీక కన్నుల చెన్నులఁ దగులువఱచు వలలును వలలం జిక్కువడ ముడివెట్టి యిష్టంబుగాఁ బురికొని పురిదిగుచు నురులం దలం గీలించి తమ యొరపుదెరవునం జననీక పట్టికొట్టిన నలువులులం బెట్టుదట్టింపుబోనులును బోనులం బోనమిడి [1]కోడెలజాడలం బొదలం జేరి యిరుఁగెలంకుల నొత్తుడు

1 గోడలజాడలంబొదలి...నొత్తుకత్తెరలనొప్పు తెరలనుం.

కత్తెరల నెత్తుడుతెరలను బూని తమ మేనిపొంకంబునులు బింకంబులును భయంకరంబులు గాఁగ సంతతహింసిత మృగవ్రాతులగుకిరాతులు సంతోషంబున. 127

సీ. నీలికాసెలమీఁదఁ గీలుకొల్పినయట్టి
నెలవంకకత్తుల తళుకులెసఁగఁ
బొలుచు జుంజురుమీసముల నీలకాంతుల
మొగముల నఱుక్రమ్మి ముంచుకొనఁగ
మిట్టగ్రుడ్డులమీఁదఁ దొట్టిన కెంజాయ
చరమసంధ్యారక్తి చౌకళింపఁ
గర్ణార్పితంబులై గనుపట్టు సంకుటా
కులు కృష్ణపక్షతారల హసింపఁ

తే. జెలఁగి తలముళ్లు వాకట్టు తిలకములును
గను మెఱుంగులు [1]గుతిమందులును ధరించి
పందివాటులు చేపట్టి పంతములకు
నొండొరులఁ గూడఁ బోయిరి దండిమెఱసి. 128

వ. అందు. 129

సీ. ఎరమీఁదిపులినైన గొఱియచందంబునఁ
గొనివత్తు మిదె చూడు మనెడువారు
నఱిమెడు సింగంబునైనఁ బ్రాణంబుతో
డనె పట్టి తెచ్చెద మనెడువారుఁ
జండించు గండభేరుండంబునైనను
గనుకట్టు కట్టెద మనెడువారుఁ

---

1 గుడి.

జాలఁ గోపించిన శరభాధిపంబునై
    నను మెడఁ గట్టెద ననెడువారు
తే. ఘోరమృగముల గమియించుకొని ప్రతాప
మడర సురియలఁ బొడిచెద ననెడువారు
నగుచు నా నరపాలునియగ్రవీథి
నడచి రంతంతఁ జెంచులు పుడమి వడఁక. 130

వ. ఇవ్విధంబునఁ బ్రబలంబు లగుశబరబలంబులు గొలువ నాత్మ
జనపరివృతుండై చనిచని. 131

క. ముందటఁ గనియెన్ నరపతి
చందనపున్నాగవకుళసాలకుటజమా
కందపిచుమందజంబూ
తిందుకసరళాదితకుతతతం బగునటవిన్. 132

వ. ఇట్లు గనుంగొని చొత్తెంచి యందు. 133

క. తగువారలఁ బాసను నా
మృగములు విహరించునట్టి మెలఁకువఁ గని లో
నిగుడొత్తెడు వేడుకతో
జగతీశుఁడు సన్నఁజేసి శబరులకనియెన్. 134

క. కీలెఱిఁగి వలలు పన్నుఁడు
చాలేర్పడఁ దెరలుచుట్టి చాగుందురలన్
గిలించి బోను లొడ్డుఁడు
కాలాగక రొప్పుఁ డడవిఁగల మృగవితతిన్. 135

వ. అని యానతిచ్చుటయుఁ జెంచు లుచ్చులువెట్టిన నెలవుల
మేకంబులు దారుకో పెఱింగి కీలుకొయ్యలు గిలించి వల
లొడ్డియు, దొడ్డివైపుగాఁ దెరలుచుట్టియు, నురులువదలించి

తోరణంబుల గతింగట్టియు, బోనులుమాటియు, మెకం
బుల నడుమ చేకొని యచ్చట నొక్కతమగంబు పన్నిన.

ఉ. ఆతమగంబుపై నరవరాగ్రణి సమ్ముఖవర్తి మానవ
వ్రాతముతోడ నెక్కి నిడువాలికరూపులఁ జాపదండముల్
జేతులఁబూని వేఁటరులఁ జీరి మృగంబులఁ జోప బంపి ని
ర్భీతకిరాతులన్ వలల క్రేవలఁ గొందఱ నిల్పఁ [1]జాల్పుగన్.

వ. అయ్యవసరంబున మేఁతలవెంబడి మూతులు సాఁచి తల
వంపులై నిలువుగుంపులు చాయం బసిమిగల కసవులు
మెసంగి దృశ్యంబు లగుఋశ్యంబుల నెలమిఁ గదిసి మిస
మిసమెఱయు సస్యంబు లాస్యంబులం జర్వించి గర్వించి
అంకెలువేయు జింకలను, నొగరుగల చిగురుం బ్రోవులు
గోవులు వట్టిమేనుల తేటలంబొల్చు లేఁటికొదమలను,
మదులం బొదలు మదనకదనోత్సాహంబుల మోహంబులు
వొదవం బదరు మదవతులయెడ సకరుణంబు లగుహరిణం
బులను దట్టంపునీడల జాడల లలితంబులై పొదల యిరు
వులఁ బిల్లలపొందులకుఁ గ్రందుకొనుపందులను, మవ్వంబు
నివ్వటిల్లం దమ కందంబులైన కందంబు లాస్వాదించి
వెంద్రుక దెగంబొడిచి కడచి మూఁకలంబాయు నేకలంబు
లను, దమ రమణీసముదయంబుఁ గవయుటకై హెచ్చిన
మచ్చరంబునం బెచ్చు పెరిగిన[2]గవలగవులం దగిలి కయ్యం
బునకుం జీరుకొట్టుచుం గన్నులనిప్పు లుప్పతిల్లం బరస్పర
యుద్ధంబు ప్రవృద్ధంబుగా నొనర్చి యచ్చట మనుమెకం
బులం బెదరించు మనుమెకంబులను, గొలఁదియుంగాని
తిండిమెండునన్ గండెక్కి నిక్కి సొక్కి నిర్భీకంబులై

1 బొల్పుగన్. 2 వగలందగిలి.

తెరుగు ఛల్లూకంబులను, నిచ్చకువచ్చు మృగము కలిమి నలమి పాలభక్షించి మించుగబ్బిగల బెబ్బులులను, నుదు గక తుడుమువడి బెడిదంబున జముని లాయంబునం గలలు లాయంబును నుద్ధవిడిఁ గొమ్ములంజిమ్మఁ దలంచు కారుపోతు లను, మదంబు ముదంబునం బిడుల వెదకి నెఱిం గను మొఱంగి పొందంజేర వారణంబు సేయ డాయు నెడఁ జిక్కనగు వెక్కసంబున సాహంకారంబుగా ఘీంకారంబు లొనర్చి యుద్ధంబులకు సన్నద్ధంబులై తలపడి పిఱుతివియక నిలిచి పొలిచి యన్యోన్యదంతంబుల నింతింతలు చిదుప పలుచెదర నొండొండ వెనకకుం జాఁగి తూగి కయ్యంబు సేయుచు శౌర్యధురంధరంబులై కనుపట్టు గంధసింధురం బులను, కుంభికుంభస్థలంబులు చించి మెదడు భుజించి తదు దంచితమౌక్తికజాలంబు లోలంబుల వెదఁజల్లుచు నఘంగ విక్రమంబులం బొంగు సింగంబులను గంభీరవంబులం గంకారవంబులచే సుడి వఱిచి విఱిచి తదామిషం బొక్క నిముసంబున మ్రింగి నింగి ముట్టినసంతసంబున సరభసంబు లై తిరుగు శరభసముదయంబులను, శరభంబులఁ జెండాడి గుండెలుం గండలును మేసిమేసి సిరిగలిగి మెండుకొను గండభేరుండంబులను మృగహింసాచంచు లగుచెంచులు నేర్పున వలలకుం జేరికగా నొత్తి తెచ్చిన. 153

సీ. విపులధ్వనికి నుల్కి విపినాంతరము నెల్లఁ
జీఁకటినొనఁగ నీక్షించుఁ గొన్ని
గాడ్పులఁ బసిగొని కలఁకమైఁ జెవులు రి
క్కించి నల్గడలు నాలించుఁ గొన్ని

తెరలచందము గని వెఱచి తీవ్రంబుగా
 నఱచి యంతంతఁ గేళ్లుఱుకుఁ గొన్ని
వీఁకమైఁ జని పోఁగుదాఁకి క్రమ్మఱ భీతి
 నేపరి పొదలసందిఁగుఁ గొన్ని

తే. వెనుకవారలు తఱుమంగ వేగిరమునఁ
బిల్లతండంబు తమమ్రోలఁ బెట్టుకొనుచుఁ
గినుకతో వచ్చి యచ్చట జనులఁ జూచి
నిగుడఁజాలక గుంపుగా నిలుచుఁ గొన్ని. 139

క. అప్పుడు ధరణీకాంతుఁడు
ముప్పిరిఁగొను సంభ్రమము ప్రమోదము వెలుఁగుం
జొప్పడఁగ నామృగంబులఁ
దప్పక కన్గొని గృహీతధనురస్త్రుం డై. 140

క. ఎందును బధికులు పోడఁగని
[1]డెందములోఁ గలఁకఁబడుచుఁ దిట్టుదురను నీ
కుం దేల? వలదు మాన్పెదఁ
గుందేలా! యనుచు నతఁడు కూలఁగ నేసెన్. 141

క. కలకలము సేయు మనుజుల
యెలుఁగులు విని చెదరునట్టి యెలుఁగుల నేసెన్
బొలమెల్లఁ గలికిచూపుల
యెలములచే నిర్లుకొలుపు నిర్లంద్రుంచెన్. 142

క. ఏరీతినో ర్తు నే భూ
దారుఁడ నగుఱెటేఁగి యెటేఁగి తామిచ్చట భూ

1 తెందేఁపలుగాఁగ నిన్నుఁ దిట్టుదురను నీ.

తే. నెఱుఁగరాకుండఁ జక్కఁగాఁ దఱిగినట్లు
వనములోపలఁ గలమృగవ్రాతములను
జేతికసివోవ నారాజశేఖరుండు
వాలుఁ గ్రొవ్వాడితూపులపాలు చేసె. 148

వ. ఇవ్విధంబున నమ్మహీవరుండు మృగంబులం జంపి యంత
రంగంబున సంతసంబంది తన యిఱుఁగెలంకుల మెలంకువలు
సల్పు వేఁటరులకు సెలవుపెట్టినం బొంగి నింగి పగుల
నార్పులు నిగుడించి వివిధవాద్యంబులు మొరయించిన హత
శేషమృగంబులలో బెదరి తెగువలం బాఱినం దెగువల
లను జొచ్చునెడ బిసలుబెడిసిన ముచ్చుముడింగి పడునేక
లంబులను, నేకలంబుల జోకలంబాసి క్రేళ్లుఱికి చనునెడఁ
గాలు వలలఁ జిక్కిన మొక్కలంబున నీడ్చి యూడ్చుకొన
లేక కాలువలంజిక్కిన గండుమీనుల తెఱంగునం బొరలు
హరిణంబులను, హరిణంబులకంటెను మున్ను నిగుడం
దలంచి తెరలు దెరలం[1]దూరి జాలు చనునెడల మెడల
కడలందగిలిన యురులుబిగియ నురులు మనుబోతులను,
మనుబోతులకంటెం బెల్లెగసి తుటుములుగట్టి చన డొంకల
చెంతలంబెట్టిన బోనులందగిలి నొప్పులుగొనియున్న దుప్పు
లనుం జూచి రభసంబునం బొడిచియు నీడ్చియుం జిమ్మియు
డాసియు వ్రేసియుం బొరిగొని వెండియు నెట్టకేలకుం
దప్పిగొని పఱచు మృగంబులం గని. 149

క. బలమునఁ దీవ్రతఁ హరులపాటివియంచు నుతించి కుక్క
లం, గళములు దువ్వి లుబ్ధకులు గట్టినపట్టెడలూడ్చి చూపి

1 దూలి జాలి.

నంబులుల నెలుంగులం బ్రదిలిపోవఁగనీయక యొక్క
టొక్కటే, చలముమెయిన్ హరించెఁ దమ చండత సర్వ
జనాద్భుతంబుగాన్. 150

చ. కనుఁగవఁ గట్టినట్టి కుడుకల్ దలఁగించి మృగాలినెల్లఁ గ్ర
న్ననఁ గనిపించి పోవిడిచినన్ వెరవొప్పఁగఁ బాఱి మూఁగి
మూఁగి నిగిడి లాఁచిపట్టుకొనెఁ గీడ్పడఁగాఁ జెనులేటి
గుంపులన్, వినుతపరాక్రమంబులగు వేఁట సివంగులు
రాజు మెచ్చఁగన్. 151

తే. ఉరులఁ గొమ్ములను ధరించు హరిణతతుల
విడువ నవి పరమృగముల వెంటఁబఱచి
కలసి పోరాడి వానికొమ్ములఁ దవిల్చి
పండఁబడియెను లుబ్ధకప్రతతి పొగడ. 152

తే. ఇవ్విధంబునఁ దమనేర్పు లెల్లఁ జూపు
శునకముల బిరుదు సివంగులను గురంగ
ములఁ బ్రియంబున దువ్వుచు బుజ్జగించి
చెంచు లానందమున సంచరించి మఱియు. 153

క. బలుసాళువముల నోరణ
ముల డేగల వైచి యోదముల నీరములన్
మెలఁగి చతురత్వ మేర్పడఁ
బొలియించిరి పొలములోని పులుఁగుల నెల్లన్. 154

వ. ఇట్లు వేఁటలాడి చాలించి ప్రాణంబులతోడఁ గస్తూరిమృగం
బులను సౌరభంబులకుం దల్లులగు జవ్వాజిపిల్లులనుం బట్టి
తెచ్చియిచ్చిన భిల్లులకుం బసదనంబులు గొల్లలుగా నిచ్చి
తన్నుఁ గొల్చివచ్చిన సామంత వీరభటవారంబులకు మృగ

మాంసంబులు దోరవాత్తుగా నిచ్చి యొక్క రమ్యప్రదేశం
బునం దానును విశ్రమించి యచ్చుట. 155

ఉ. నేతులుగారు మాంసముల నిగ్గులు గ్రమ్మెడు సీకుద్రెళ్లఁగాఁ
జేతుల నొత్తుచుం బెదురుచివ్వల నంటఁగఁ గ్రుచ్చి వ్రచ్చి
సం,జోతిగ నిమ్మపంటిపులుసుం లవణాదులఁగూర్చి వేడ్క
నుర్వీతలభర్త యాత్మహితబృందముతో భుజియించె
నత్తఱిన్. 156

క. మనమున మృగయాక్రీడలు
గొనియాడుచు బలములెల్లఁ గొలువ నిజస్యం
దనమెక్కి ముదంబున నా
జననాయకుఁ డాత్మపురికిఁ జని తన యెదుటన్. 157

క. పరుషఖలీనముతో భా
స్వరమణి సంఘటితహేమపల్యాణముతో
మెరయుచు సకిలింపుచు నిజ
ఖురపుటముల ధరణిఁ ద్రవ్వ గుఱ్ఱముఁ గనియెన్. 158

తే. కని తదంతికమునకు నజ్జనవరేణ్యుఁ
డరిగి తేరట డిగ్గి నెయ్యంబుమీఱఁ
గలితలక్షణలక్షితాంగముల నివిరి
దానిచందంబు లిట్లని తలఁచె నతఁడు. 159

క. పదములచొప్పును వడియొ
ప్పిదము నలంకారలక్ష్మిపేర్మియు ధారా
స్పదభావముఁగల్గి శుభ
ప్రదమై హాయ మమరె సత్ప్రబంధమురీతిన్. 160

సీ. సురలోకమునసుండి ధరణీతలంబున
కవతరించిన యుత్తమాశ్వమొక్క
యక్షనాయకుని లాయంబు వెల్వడి వసుం
ధరకు నేతెంచిన తురగమొక్క
రాజీవబాంధవురథముఁ బూనఁగలేక
వసుధ కేతెంచిన వాహమొక్క
శరధివల్లభుని మందురలోన వెల్వడి
యుర్వికి డిగిన గంధర్వమొక్క
తే. కాకయుండిన నీశుభ్రకాంతిమహిమ
మీ మనోవేగచాతుర్య మీశుభాంగ
పాటవము నీమహాబలప్రాభవంబుఁ
గలుగనేర్చునె పెఱతురంగముల కెందు. 161

క. అని బహువిధములఁ బలుకుచు
మనుజేంద్రుం డత్తురంగమముఁ గైకొని కుం
డినగరి కేగెఁ దూర్య
స్వనములు కడునిగుడ సకలజనములుఁ బొగడన్. 162

తే. అరిగి నిజమందిరముఁ జొచ్చి యత్తురంగ
రత్నమును మందురాభ్యంతరంబునందు
నిలిపి చిత్తంబు దానిపై నెలవుకొలిపి
యంగసేవకు నియమించె నర్హజనుల 163

వ. వెండియు హృద్యఖాద్యవిశేషంబులం బోషించుచు నొక్క
నాఁడు పేరోలగంబుననుండి తనమంత్రులకు నిట్లనియె.164

క. ఏవనమున వేఁటాడం
గా వేడుక నేగ నచటఁ గలిగినతురగం

చేవిధమున మెలఁగెడినో
యావిధ మెఱుఁగుటకు నెక్కి యాడఁగవలయున్. 165

క. కావున మీ రీక్షణమున
దైవజ్ఞులఁ బిలిచి చంద్ర తారాబలముల్
భావించి శుభముహూర్తము
ధీవిలసితు లగుచుఁ దెలిసి తెండు హయంబున్. 166

తే. అనుడు మంత్రులు సర్వసిద్ధాంతవిదుల
నడిగి తెలిసిన శుభసమయంబునందు
హయముఁ బల్లించి తేఁబంపి రావిభుండుఁ
గొలువు వీడ్కొని నగరిలోపలికి నరిగె. 167

వ. అని శుకయోగీంద్రుం డిలావంతునకు నెఱింగించిన
తెఱంగుఁ జెప్పిన విని యట మీఁది వృత్తాంతం బేమని
యడుగుటయును. 168

శా. అంభోజాతభవాన్వయాంబునిధి తారాధీశ, భోగీంద్ర ది
క్కుంభిక్ష్మాధరకూర్మ దుర్వహ మహాక్షోణీభరాధారదో-
స్తంభప్రాభవ, బంధుయాచనకవిద్వల్లోకమందారతే
జోఽంభోజాప్త:నృసింహ వీరవర సంప్రాప్తాతిభాగ్యాధికా.

క. బాహాసితీక్ష్ణధారా
రాహుముఖగ్రస్త విమతరాజ మహాల
క్ష్మీహరిమందిర స్వామి
ద్రోహరగండాంక దానరుచిరశశాంకా. 170

సుగంధి.—

తారకా శశాంకకుంద తారకాశ మల్లికా
శారదాభ్ర కల్పభూజ శారదాత్రిదృక్సఖా

హారనాగ పుండరీక హారనాగరాజ నీ
హారగోత్ర శుభ్రకీర్తిహార గోత్రరక్షకా. 171

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మ నామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్ర భారతం బనుపురాణకథయందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# చిత్ర భారతము

## చతుర్థాశ్వాసము.



నరసింహపదాబ్జ
ధ్యానపరాయణమరాళ తారాధిపభో
గీనసమకీర్తి పూర్వ
స్థానాయకవినుతచరిత మాదయపెద్దా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని
జాతుం డగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదు లగుశౌన
కాదులకు నిట్లనియె నట్లు చతుర్థనజననాథుం డభ్యంత
రంబునకుం జని. 2

క. ఒడలఁగల తొడవులన్నియు
నెడలిచి కామినులచేతికిచ్చి ప్రియంబే
ర్పడఁ బందిరిలోపలఁ దగ
నిడినకనకపీఠి నున్నయెడ ముద మొదవన్. 3

మ. కొనగోరుల్ దలసోఁకఁ జన్నులమెఱుంగుల్ దిక్కులం
బర్వ నల్లన లేఁగౌను వడంకఁ గంకణము లుల్లాసంబుగా
మ్రోయ నక్కునఁ జేరుల్ [1]గుదులై పెనంగొన బెణంకుం

1 విరులై.

జాపులోడ్డింపఁగా, జననాథాగ్రణి కంటె నొక్కతె తలన్
సంపెంగతైలంబునన్. 4

చ. ఒక చపలాక్షి యొయ్యన నృపోత్తము నౌదలపైఁ దనర్చు
నా, చికురభరంబు పాపిటలు చేసి మనోహరచందనంపుటం
టకలియిడెం గరంబులు తడంబడ రాచుచు రత్నకంకణ
ప్రకరముఁ గుండలంబులును రాపడి మ్రోయఁగఁ దూఁగి
యాడఁగన్. 5

ఉ. కొందఱు భామినీమణులు గొజ్జఁగినీరు సువర్ణకుంభరా
జిం దగ ముంచి చేరి యభిషేకము చేసిరి మోము లప్పు
డం,దందఁ జెమర్పఁ జన్ను లొరయం గరమూలరుచుల్
దిశాళిం, జిందఁగ వింత సంభ్రమము చేఁ బదనూపురకోటి
మ్రోయఁగన్. 6

ఉ వేఱొక ప్రౌఢ చేరి పృథివీరమణాగ్రణికిన్ శిరంబు నీ
రార్చి మేనిపైని గనుపట్టు తడిన్ వసనొత్తి పచ్చక
ర్పూరముఁ జందనంబు నగరు న్నమకూర్చిన ధూప మిచ్చి
యొ,య్యారపు బాగునన్ సురఁటి యల్లనఁ ద్రిప్పె మనో
హారంబుగన్. 7

తే. చెలువయొక్కతె వెలిపట్టు చేలఁ గట్టెఁ
గాంతయొక్కతె మేఖలఁ గటినమర్చె
నిందుముఖి యొకర్తి యుత్తర జందియంబు
లంసపీఠికఁ జేర్చె జనాధిపతికి. 8

శా. బంగారంచులపట్టుపచ్చడము శుంభల్లీలమై నొక్కసా
రంగీలోచన గప్పె నొక్కతె కచవ్రాతమ్ము సారింపుచున్

1 దగన్.

జెంగల్వల్ సవరించి కొప్పిడియె రాజీవాక్షి యొక్క_ర్త ప్రే
మం గస్తూరిని బొట్టుఁబెట్టె నభిరామం బైనఫాలంబునన్.

ఉ. శ్రీవిలసిల్లి సంతత సువృత్తమునం గడువన్నె కెక్కి నా
నావిధసద్గుణాళివలనం బొగడొందుచు నాయకప్రమో
దావహమై లతాంగిగతి నక్కునఁ జేర్పఁగ నందమైన హా
రావళి యొక్క కోమలి నృపాగ్రణికంఠముఁ జేర్చె వేడుకన్.

క. శ్రుతిభూషణయోగ్యం డీ
పతియని తలపోసి యొక్క భామామణి వి
శ్రుతరత్న కీలితములగు
శ్రుతిభూషణయుగళ మిడియె శోభనలీలన్. 11

చ. హరితరుపంచకంబు నిఖిలార్థుల కర్థము లిచ్చునప్పుడుఁ
గరఁగక వ్రేళ్లు క్రిందుపడెఁగా యని డెందమునందు రోసి
యీ, నరపతి వ్రేళ్లుదారత ధనం బిడునప్పుడు క్రిందుగా
మిసీ, [1]స్విరుడు ఘటించె నాఁగఁ దరుణీమణి యొక్క తే
గూర్చె నూర్మికల్. 12

ఉ. వేఱొక పద్మనేత్ర నునువింత మెఱుంగులనొప్పు మేలికై
వారముతీరు గన్గొని ధ్రువంబుగ నిందుల తారతమ్య మీ
డేరఁగఁ బల్కుమంచుఁ బ్రకటించినకైవడి నిల్పె మోహ
నా, కారపు టద్దముం దెలి మొగంబును మానవనాథుముం
దటన్. 13

ఉ. రాజశిరోవతంసునకు రమ్యగుణంబులఁ బోల్చి స్నేహసం
యోజనదాల్చి చంచలతనొంది మెఱుంగుల నుల్లసిల్లి వి

1 స్థరుణి యొకర్తు మెచ్చి బిరుదంబుగ నుం...వలల్ ఘటించెగాన్.

భ్రాజిత నైజదృక్తతిని బాటియనం గనుపట్టునట్టి నీ
రాజన మిచ్చి రింతులు గరంబులఁ బళ్లెరమెత్తి త్రిప్పుచున్.

వ. ఇవ్విధంబున నలంకృతుండై నిజదేవతానమస్కారంబు గావించి షడ్రసోపేతరుచిరాన్నంబులు భుజియించి హస్తప్రక్షాళనం బొనరించి కర్పూరతాంబూలం బవధరించి యశ్వారోహణకుతూహలుండై యంతఃపురంబు వెడలి. 15

సీ. ఆత్మశాలాగ్రబద్ధాంజలులై చేరి
సామంతలోకంబు సాఁగి[1]కొలువ
నవ్యఘంటాకేతనశ్రేణు లొరయంగ
భద్రదంతావళపంక్తు లమరఁ
గల్యాణపల్యాణకలితంబులైనట్టి
ఘనజవనాశ్వసంఘములు మెఱయ
బహువిధశస్త్రాస్త్రపాణులై యిరుమేలఁ
[2]బాటిల్లి వడి వీరభటులు చెలఁగ

తే. శంఖభేరీమృదంగనిస్సాణపటహ
కాహళీవేణుముఖవాద్యఘనరవంబు
చక్రవాళాద్రిగహ్వరస్థానసుప్త
మృగకులాధీశజాలంబు మేలుకొలుప. 16

ఉ. ఒద్దికతోడ మంత్రులు నయోచితభాషలు పల్కఁ గర్ణముల్, బ్రద్దలువాఱు వాయిని బళా యని వందిజనంబు మాగధుల్, తద్దయుఁజేరి యాత్మబిరుదప్రకరంబుల సన్నుతింపఁగా, ముద్దియ లింపుగా భువనమోహనవైఖరిఁ గూడి పాడఁగన్. 17

1 నిలువ. 2 బటవణియిడిపి.

ఆ. సంతసమునొంది మేదినీకాంతుఁ డపుడు
గన్నుసన్నల నిజమంత్రిగణముఁ బిలువ
నదియ సుముహూర్తమంచు నాహయముఁ దెచ్చి
నిండువేడుకతో ముంగల నిల్పుటయును. 18

సీ. వలుద ముత్యాలకోవల నేర్చి కట్టిన
మంచిబంగరుకనుమటువుతోడఁ
బచ్చలుగూర్చిన పయిఁడిపుట్టముమీఁది
కెంబట్టు జగి తలాటంబుతోడఁ
బద్మరాగోపలబంధబంధురమైన
నవ్యకాంచన ఖలీనంబుతోడఁ
బనిరువాణంబున భాసిల్లు మేలివ
జ్రంబుల పసిఁడి పల్లంబుతోడ

తే. నిరుగెలంకులఁగట్టిన యొరలనున్న
ఖడ్గములతోడ మెఱుఁగు సంగడులతోడ
బిరుదు నూపురములతోడ మెఱయుహయము
పార్థివోత్తమునకు నేత్రపర్వమయ్యె. 19

క. ఆ సామ్రాణికిఁ జూపుల
దోసముపాయంగ నగరుధూపంబు మహో
ల్లాసంబుగ నిడి పూజలు
చేసి జయధ్వనులు నిగుడ శ్రీకరలీలన్. 20

ఉ. ఆతఱిఁ జేరవచ్చి వినయమ్మున నమ్మనుజేశ్వరుండు సం
ప్రీతిఁ బ్రదక్షిణంబు లొనరించి నమస్కృతిఁ జేసి పండిత
వ్రాతము దీవనల్ వినుచు వామపదాబ్జము మున్నుగాఁగ

విఖ్యాతిగ నెక్కె దైవతహయంబు సురేశ్వరుఁ డెక్కు వైఖరిన్. 21

వ. ఇత్తెఱంగున నత్తురంగారోహణంబుఁ జేసి సంతోషభరితాంతఃకరణుండై చతురంగబలంబులుం గొలువ రాజమార్గంబునం జనునప్పుడు. 22

శా. ఆ రాజేంద్రుని రూపరేఖయుఁ దురంగారోహణక్రీడయున్ ఘోరానేకపసంచయంబులతెఱంగున్ ఘోటకవ్రాతసంచారప్రక్రియయున్ బదాతులవిలాసంబు న్నిరీక్షింపఁగాఁ బౌరుల్ నిల్చిరి భర్మహర్మ్యశిఖరవ్రాతప్రదేశంబులన్ 23

వ. అప్పుడు. 24

ఉ. మించిన నీలహర్మ్యతతి మేఘము సొంపువహింప నందు వర్తించు సతుల్ తటిల్లతలతీరు భజింప మృదంగమండలోదంచితరావముల్ స్తనితధర్మముఁ దాల్పఁగ మానవేశ్వరు న్ముంచెఁ బ్రసూనవృష్టి జనముల్ గొనియాడ ననేకభంగులన్. 25

వ. అయ్యవసరంబునఁ గొందఱు ప్రౌఢకాంతలు చతుర్థనమహీకాంతునిం జూచి తమలో నిట్లనిరి. 26

మ. తరుణీ, వీనికి సార్వభౌమత యథార్థం బయ్యెఁ గాకుండిన న్వరదానంబు మహాప్రవాహములు దిగ్వ్యాప్తంబులౌనే యకే, హారు తేకైవడిఁ గొల్చివచ్చు విను కొమ్మా రాజకంఠీరవ, స్ఫురణన్ బొల్పుఁగదే పరాక్రమకళాస్ఫూర్తి న్వివేకించినన్. 27

మ. చెలియా, మిక్కిలి చిత్రమయ్యెడి నిరీక్షింపం గళావైభవోజ్జ్వలుఁడై వేగినవేళ రాజు విహరింపం బూనెఁ దత్సం

గతిఁ, జలనం బందక పుండరీకము వికాసస్ఫూర్తిఁ జెన్నొంౘెఁ గాం,తులఁ జెంపెక్కి సమస్తతారకలు సంతోషంబునం బొందెడిన్. 28

క. అని పౌరులు గొనియాడుచుఁ
దనుఁ జూడఁగ ధరణి విభుఁడు తద్ఘోటక వ
ల్గనకేళి నధిక వేగం
బునఁ బుటభేదనము వెడలిపోయె నరేంద్రా. 29

వ. ఇవ్విధంబున నద్ధరణీపురుహూతుండు సకలసేనాసమేతుండై పురంబు వెలువడి యొక్కవాహ్యాళిప్రదేశంబున కరిగి సమస్తసైన్యంబులును దిదృక్షాధీనంబులై యంతనంత నిలువ నచ్చుట. 30

ఉ. అప్పుడు సాహిణీలు గదియం జని రెండుకెలంకులం బ్రియం బొప్పఁ జెలంగ మాగధమృదూక్తినినాద మెకాని సేనలోఁ జప్పుడు మాన్పఁగఁ జబుకుసాదులు గుఱ్ఱముఁ [1]గుస్తరింపఁ గా,నప్పృథివీశ్వరుండు దనహస్తములం గళలంది వేడుకన్.

చ. కొదమమహాతురంగముఁ గోరిక లీరిక లెత్త నెంతయుఁ బెదరఁగనీక యల్ల నడపించెను వీథులఁ జూపఁబూని త త్పదములయందియల్ చెవులపండువుగా మొరయంగ దేహముఁ, గదలనియట్లుతోఁచ మెడఁగట్టిన జంగు గణంగి మ్రోయఁగన్. 32

చ. పొడవుగఁ బాఁగ నెక్కి మదివూనిక మోదము నామతింప లే వడియన రానితీవ్రమున వాటముగాని తెఱంగు దోఁపఁగా

1 మస్తరింపఁగా.

నడుగులజాడ యేర్పడఁగ నానరనాథుఁడు నేర్పుపెంపునన్
బోడమెడుజుంటితేనియలఁబోలెడు పల్కుల బుజ్జగింపుచున్.

ఉ. రాగల సన్నఁజేసి సుకరంబుగ వామకరంబులోని య
వ్వాగె యొకింతచేర్చి కళ వైచుచు ధేయను నంతలోన ను
ద్వేగ మెలర్పఁ జూపులకు వెక్కసమై కనుపట్టి దివ్యశో
భాగుణశాలి యైనహరి పాఱెఁ జెలంగి దువాళి వీథులన్.

వ. మఱియును. 35

సీ. వాగెలు గుదియించి రాగసన్నలుసేయ
హరిణపుటంబుల నవఘళించు
నోర చందంబుగా నొక్కింతచూపిన
మండలీకరణక్రమంబు నిల్పుఁ
గేలుసారించి జంకించి యల్లల్లన
పట్టినఁ గుఱుచలఁబాఱితిరుగు
సమముగా నిల్పి హస్తములసల్లించిన
నలసతలేక నూఱాఱుదాఁటు

తే. మూఁడుపదములు ధరణిపై మోపియాడు
రెండువంకల జమిలిపేరెములువాఱు
సకలసైనికులెల్ల నాశ్చర్య మనుచు
వర్ణనముసేయ మించె నవ్వారువంబు. 36

క. జననాథుఁడు దనగుణములుఁ
గనియును విని యొఱుఁగలేనికతనఁ బదాబ్జం
బునఁ దాటించినఁ దురగం
బనిమిషమార్గమున కెగసె నాతనిఁ గొనుచున్. 37

వ. ఇత్తెఱంగున నయ్యుత్తమాశ్వంబు కారణజన్మంబు గావునఁ బార్ష్ణిఘాతావమానంబు సైరింపక యమ్మహీకాంతునిం గొనుచు గగనంబునకు నుద్గమించె నిక్కడ మంత్రిపురోహితసేనాపతిప్రముఖాఖిలజనంబులు చింతాక్రాంతస్వాంతులై చేయునదిలేక పునఃపునరవలోకితగగనభాగు లగుచు మగుడి పురంబునకు వచ్చి వేదనాదోదూయమానం బగు తత్పుత్రకళత్రవర్గంబు నూఱడించి దివసంబులు గడుపు చుండి రంత నక్కడఁ జతుర్థనుండు మందాకినీతీరంబుఁ జేరుసమయంబున. 38

ఉ. నారదుఁ డేగుదెంచి నరనాథున కిట్లను నోమహీశ యీ
వారువ మిట్లు నిన్నుఁ గొనివచ్చుట యొండువిధంబుగాదు
బృంద,దారకులెన్న దివ్యభువనంబుల నన్నిటిఁ జూపి తావకా
గారముఁ జేర్చు నిందు కొక కారణమున్న దినిక్కమింతయున్.

క. అని యనిమిషముని చనుటయుఁ
దనమనమున నున్నభయము దలఁగించి చతు
ర్థనజనపతి మందాకినిఁ
గనుఁగొని కొనిచూడఁ దోఁచెఁ గంభీరోక్తిన్. 40

సీ. ధన్యుఁడై భువనైకమాన్యుఁడై కనుపట్టు
శాంతనవున కిది జన్మభూమి
మునిశాపసంతాపమునఁ గ్రాఁగిపోయిన
సగరుల కిది మోక్షసాధనంబు
బ్రహ్మహత్యాదిపాపప్రపంచమునకు
నెన్నిచూడఁగ నిది యెదురుచుక్క
కృత్తికాషడ్గర్భగేహనిర్గతుఁడైన
కొమరుసామికి నిది గూర్మిదాది

తే. యనఁగఁ బెంపొందు నీనదికబ్జగర్భు
కరకమండలువఁట [1]జనుఃకారణంబు
హరిపదంబఁట తెంకి శంకరునిమౌళి
కేలిగృహమఁట మహిమ యింకేల పొగడ. 41

చ. తెలుపగు నీటిపైఁ బసిమిదేతెడు నల్లదె హేమనీరజం
బుల నడరొందఁ గప్పుకొను పుప్పొడి యొప్పిదమో సురాం
గనా, వలి విహరింపఁగాఁ దలఁచి వచ్చి ముదంబున నీఁదు
లాడఁ జన్నులఁగల కుంకుముల్ గరఁగి నూతనరాగము
మీఁదఁ జూపెనో. 42

ఉ. ఫేనసమూహముల్ రుచులఁ బెంపగు గొజ్జఁగిపువ్వుగుంపులై
కానఁబడంగఁ, దుంపరలు గమ్మని మల్లియలై తనర్పఁ, బెం
పొనిన సుళ్లు మొల్లవిరులై విలసిల్లఁగ, నింపుపుట్టెరో
పూనె హరుండు [2]వేనలినిపొందఁ గడుందగు నిమ్నగానదిన్.

వ. అని మఱియుం దదీయ విశేషంబులు గొనియాడి సంతోష
భరితాంతఃకరణుండై మనంబున నమస్కరించె నంత. 44

చ. అనిశము దానవారి కిరవై యమృతాకృతిఁ బొల్చి యభ్ర
ముక్, దనకు వశంబుగా మెలఁగఁ దా హరిలక్ష్మికి మూల
కారణం, బనఁదగి దుగ్ధవారిధి క్రియం గనుపట్టు సురేభ
మంబుసేచనమున కేగుదేర నృపచంద్రుఁడు గన్గొనెఁ దత్త
టంబునన్. 45

క. తెలిచెలువము వడిబెడఁగుక్
లలితావర్తములఁగల విలాసము ఫేనం

---

1 జన్మకారణంబు. 2 వేనగపుపొంద.

బుల యొప్పుఁగలిగి సురనది
పొలుపునఁ జను దివిజతురగముం గనుఁగొనియెన్. 46

వ. ఇట్లు కనుంగొని యాశ్చర్యహృదయుండై చనిచని ముందట.

సీ. బహువిధమాణిక్యపటలకాంతిచ్ఛటా
రాజితకృతకధరాధరములఁ
గాంచననీరేజకల్హారవాసిత
విమలాంబుదీర్ఘికాసముదయముల
సురతక్రియాసముత్సుకవిలాసివ్రాత
సంచారయోగ్యకుంజస్థలముల
మార్గణయాచనాదౌర్గత్యమోచనా
కల్పవిభ్రాజితకల్పకముల

తే. దేవతాసార్వభౌమకీర్తిప్రతాప
భవ్యబిరుదాంకమాలికాపఠనకేలిఁ
గిన్నరీద్వంద్వశారికాకీరపికము
లను నిరీక్షించి పొంగె నా జనవిభుండు 48

. మఱియు. 49

. అటఁ జనిచని కనుఁగొనియెం
బటుతురగనిరూప్యమాణపథమున నతఁడు
త్కటవినుతదైత్యమానస
పుటభేదనమైన దివిజపుటభేదనమున్. 50

. కనుఁగొని తదుపరిభాగంబునం జనిచని. 51

. కరకరితోడి రిత్త యలుకల్పచరించి మనోజకేళికిం
బురిగొననీక [1]కోపమునఁ బోనడవం గడునల్గి వేలుపుం

1 కాఁకమెయిఁ బోరడవం.

దెలవలతోడఁ బాసి తమదివ్యగృహంబుల కేఁగి శయ్యలం
బొరలెడు దేవతావిటుల పోఁడిమిఁ జూచి హసించె
నెంతయున్. 52

ఉ. శూరులు కొంద ఱుద్ధవిడిఁ జొచ్చి నిలింపవధూగృహం
బులం, జేరిన సోమయాజులను జిందఱవందఱగా నదల్చి
నం, దొరపుఁ గయ్యమైనయెడ దూఱి రసజ్ఞులు కొంద
ఱచ్చుటన్, ధీరత నిల్చి యాతగవుదీర్పఁగఁ జూచె విభుండు
నవ్వుచున్. 53

ఉ. ఒక్కవిటోత్తముండు [1]దనుఁ బొందఁగఁ జూచిన కాంతఁ
జూచి వే, ఱొక్కఁడు గన్నులార్పుటకు నోర్వక కోపము
మీఱి వానితో, నెక్కటిపోరికై తివిరి యింతులు మూఁ
కలుగట్టి చూడఁగా, నిక్కవసాము సేయ నతనిం గని
నవ్వె నరేంద్రుఁ [2]డెగ్గుచేన్. 54

చ. వరుఁ డొకకొంత కాలము ప్రవాసముగాఁ జనివచ్చినంత స
త్వరమతి నాపరాని ప్రమదంబున డగ్గఱి కౌఁగిలించి మో
విరుచుల నానె నొక్కయరవిందదళాయత నేత్ర యంత ని
ర్దయను విచేష్టలై రి వసుధాతలనాథుఁడు చూచి మెచ్చఁగన్

సీ కలలోపలను వియోగము లేక విభులతో
సౌధడోలాకేళి సలుపువారుఁ
గినిసిపోయిననాథులను బుజ్జగింపఁగాఁ
దరుణులతోఁగూడి తనరువారు
సంతతనిధువనశ్రాంతలై పతులపై
రురముపాన్పులపై నిఁ బొరలువారుఁ

---

1 ననుపొందగ. 2 డేగుచోన్.

జందన ప్రసవభూషణముల కాంతులు
శృంగార మొనరింపఁ జెలఁగువారుఁ
తే. బ్రియులయధరామృతంబెల్లఁ బీల్చి సొక్కి
ప్రేమతోడుత నరగన్ను పెట్టువారు
నగుచు విహరించు నచ్చరచిగురుఁబోండ్ల
చేతఁ గన్పట్టువాడ వీక్షించె నతఁడు 56
వ ఇవ్విధంబున వివిధవిలాసంబులుగల దేవతావిలాసినీవాటికం
జూచి యల్లన చనిచని సహస్రమణికుంభప్రభాకిర్మీరిత
వ్యోమతలంబును, గేతనోపకేతనసమూహవిరాజితంబును,
మరకతమణిమయతోరణాలంకృతంబును, బద్మరాగగేహాళీ
సంయుతంబును, నీలమణిబద్ధకుడ్యప్రదేశంబును, సహస్ర
విద్రుమస్తంభసంలక్షితంబును, దివ్యవైడూర్యమణికల్పిత
సోపానవిశేషంబును, బుష్యరాగవేదికోపలక్షితంబును,
మనోజ్ఞకాంతివిరాజమానగోమేధికకృతప్రాంగణస్థలంబును,
వజ్రనిర్మితరంగవల్లీసముదాయాభిరామంబును, నక్షత్ర
విడంబముక్తాఫలవితానమనోహరంబును నై మెఱయు
పురందరసభామందిరంబుఁ గని. 57
ఉ. ఆమహనీయహర్మ్యమున నత్యధికప్రభఁ బొల్చునట్టి చిం
తామణి పీఠికాతలమున న్మణిభూషణపుష్పమాలికా
స్తోమమనోజ్ఞవస్త్రపరిశోభితుఁడై సురసార్వభౌముఁ డు
ద్దామరణస్థలీవిజయదంబగు వజ్రము కేల మీఱఁగన్. 58
సీ. మేనులుగైకొన్న మెఱుఁగుఁ దీఁగెలనంగ
నప్సరోభామిను లలమి కొలువ
గాత్రముల్ పూనిన గానవిద్య లనంగ
గంధర్వకాంతలు గదిసి పాడ

సంగంబుచాల్చిన శృంగారరసమున
మూర్త్యశినటనల నుబుసుపుచ్చు
దేహంబు లెత్తిన తేటవెన్నెలలనఁ
గిన్నరాంగన లూడిగెములు సేయ
తే. నిర్ఝరిపిజ్యమానమాణిక్యకలిత
చామరోద్భవపవమానచలితలలిత
కుటిలకుంతలవికసితనిటలుఁ డగుచు
నిండుగొలువుండఁ గనుఁగొనె నృపవరుండు. 59

వ. కనుంగొని మనంబున ఘనంబగుసంతోషంబునం జెంది తత్ప్రాంతంబుననున్న సిద్ధవిద్యాధరగరుడగంధర్వాదిదివ్య గణంబుల నాలోకింపుచుఁ దురంగగమన నీయమానుండై చనిచని. 60

ఉ. భీష్మపరాక్రమస్ఫురణఁ జేర్చిన పీరులయుజ్జ్వలప్రతా
పోష్మవిజృంభణంబున మహోగ్రవిభావసుపాలనంబునం
గ్రీష్మము దానయయ్యుఁ బ్రజఁ గేవలశైత్యము నందఁ
జేయు నర్చిష్మతి పేర నొప్పెడుపురి న్వెలుఁగొందుచుఁ
జూచె దవ్వులన్. 61

శా. ప్రాకారంబులు రమ్యహర్మ్యమణి కుంభస్తోమముల్ గోపురా
నీకంబుల్ ధనధాన్యరాసులును మాణిక్యావళికల్పితా
నేకశ్రీణిధరంబులుం సరసులుల్ లీలావనవ్రాతముల్
శ్రీకింబట్టగు పౌరసంచయము నర్థిం గాంచి యాముందటన్.

సీ. సంతుష్టమానసస్వాహాస్వధాకాంత
లుభయపార్శ్వంబుల నోలగింప
శృంగచతుష్టయాంచితమస్తకద్వయం
బున రత్నకోటీరములు వెలుంగ

సమిదాజ్యచరుహావిశ్చర్వణోజ్జ్వల ముఖం
బులయందు సప్తజిహ్వాలు చలింప
మూఁడునాలుగుహస్తముల స్రుక్స్రువాదిసా
ధనసముదాయంబు తనరుచుండఁ
తే. జబుకుసాదులు మ్రోలకైజా యొనర్చి
సూటివడవాఁగె బట్టుపొట్టేటితేజిఁ
గూర్చిఁ జూచుచు విబుధులు గొలువనున్న
యనలు నీక్షించి యావిభుం డనియె నిట్లు. 63

సీ. ఈపుణ్యనిధి పార్వతీశ్వరునకుఁ బ్రతా
పసమృద్ధి గావించుఫాలనేత్ర
మీ సర్వభక్షకుం డేచిన వాహినీ
పతిపాం గణంగించు బాడబాగ్ని
యీమహాతేజస్వి భీమవిక్రమశాలి
యగుకుమారునిఁ గన్నయట్టిప్రోడ
యీభవ్యమూర్తి దేవేంద్రముఖ్యులకు భా
మపదార్థరుచిగూర్చు మంజులాస్య
తే. మీజగద్రక్షకుఁడు రేల నినుని తేజ
మెల్లఁ గైకొని వెలుఁగొందు బల్లిదుండు
గాన నిట్టి బృహద్భానుఁ గానఁగల్లు
వాఁడెపో పుణ్యుఁ డనుచు భావమున మ్రొక్కె. 64

వ. ఇట్లు కృతనమస్కారుండై హయగమనవేగంబున నర్చిష్మతీ
నగరంబు గడచి యరిగి యరిగి. 65

ఉ. దారుణపాశతోమరగదాపరిఘాదులఁ బూని లోక సం
హారసమర్థులై కడుభయంకరులై కనుపట్టి కింకరుల్
సారము మీఱఁ గావఁదగుసంయమనీనగరంబుఁ గాంచి య

బ్భారమణేంద్రుఁ డద్భుతముఁ బొందుచు భావములోన
నుబ్బుచున్. 66

సీ. భూరిభుజాదండభూషణంబుగ నొప్పు
దారుణతరగదాదండ మమర
నతిభయానకమూర్తి యగుమృత్యుదేవత
గరములు మోడ్చి ముంగల వసింపఁ
[1]జండకోదండభీషణపాణియై వైరి
దుర్వారవీరజిత్తుఁడు భజింప
నఖిలప్రపంచభయంకరకింకర
శ్రేణులు గ్రందుగాఁ జేరి నిలువఁ
తే. బ్రాణిసంఘాతముల పుణ్యపాతకాయు
రర్థములజాడ వ్రాసి యాయవ్యయముగఁ
జిత్రగుప్తుండు వినిపింపఁ జిత్రలీలఁ
గొలువుకూర్చున్నజముఁనిఁ గన్గొనియెనంత. 67

వ. కని తద్విశేషంబు లిట్లని తలంచె. 68

సీ. పాపపుణ్యములందుఁ బక్షపాతము లేక
వర్తించుటను సమవర్తి యయ్యె
వరుసఁదప్పక ప్రజాపరిపాలనము సేయ
ధర్మరాజఖ్యాతి దాల్చి మించెఁ
బ్రళయకాలమునాఁడు ప్రాణిసంఘాతంబు
నణఁగించుకతనఁ గృతాంతుఁ డయ్యె
సమదారిశిపిరుల సంగరాంగణములఁ
బ్రహరించుటను దండపాణి యయ్యె

---

1 జండకోదండభీషణ ఖడ్గపాణియై దుర్వారలీలఁ జిత్రుఁడు భజింప.

తే. నిమ్మహాత్మునిగరిమంబు నెన్న వశమె
నాలుగైదాఱుమోముల నలినగర్భ
హరకుమారులకైనఁ దథ్యముగ ననుచుఁ
దలఁచి లోపల నమ్మహీధవుఁడు మ్రొక్కె. 69

వ. అయ్యవసరంబున నత్తురంగంబు గగనంబునఁ దన్నుం గొని
చన నరిగి నైరృతీపరిపాలితం బగు పుణ్యావతీపురంబుఁ
గాంచి. 70

తే. కర్బురావాసయోగ్యతకలిమిఁ జేసి
కర్బురావాసమహిమంబుఁ గాంచి మించి
పుణ్యజనములు తనయందుఁ బొల్పుకతనఁ
బుణ్యవతి యను పేర నీపురము దనరె. 71

వ. అని సంతసిల్లునెడ నా హయంబు రయంబున నభ్రపథంబునం
గొనిచనం జనిచని యసురవతీనగరంబు డగ్గఱి యందు. 72

తే త్రిపథగాసూర్యనందనాకృష్ణవేణి
కాదినదులును మిహికాచలాత్మనంద
నాప్రముఖనదులు నతిసౌందర్యమహిమఁ
దాల్చి యిరుమేర నిండి మోదమునఁ గొలువ. 73

క. ప్రియమొందు వరుణుఁ గని వి
స్మయమొందుచు నచటఁ బాయఁజాలకయుండన్
రయమున నేగె నరేంద్రుఁడు
హయరత్నాయత్తుఁ డగుచు నట ముందటికిన్. 74

తే. అతిజవంబున నారీతి నరిగి యరిగి
మంజులోపవనవ్రాతమహితకుసుమ
జాతమకరందసంసిక్తశీతపవన
కలిత యగుగంధవతి వేడ్కఁ గాంచి యందు. 75

డాళసంఘ ప్రభేదంబుల గతులచే
యక్షకామినులు నాట్యంబులాడఁ
గ్రంత లంతంతఁ జక్కటి గాఁగ జడియుచు
వేత్రహస్తులు నిండు వేడ్కనిలువ
నైజప్రతాపగుణంబు లొక్కమ్మడి
వందిమాగధకవివరులు పొగడఁ

తే. జండకోదండశరఖడ్గభిండివాల
శూలకుంతగదాపరిఘాలిఁ బూని
వీరరసమెల్ల రూపులై మీఱినట్లు
యక్షకిన్నరవరులు నెయ్యమునఁ గొలువ. 30

సీ. ఆత్మప్రియావిరహానలజ్వాలచేఁ
గందుట నంగంబు కాంతి చెదర
వేఁడినిట్టూర్పుల వెచ్చవాడినయట్టి
బింబాధరంబున బీట లెగయ
నంతరంగములోని చింతాభరంబున
విమలాననంబు వెల్వెలకఁబాఱ
ననవరతంబు నిద్రాహారములులేమి
బడలిక తొడవులు సడలి రాల

తే. నుబుసుపోకకుఁ దనయొద్దనున్నవారి
తోడఁ బ్రియురాలి మేలిసుద్దులు నుడువుచుఁ
గాంచనాంచితమణిపీఠికాతలమున
నుండి చేరువ నలకూబరుండు గొలువ. 31

తే. పెద్దకొలువున మాణిక్యపీఠియందు
నుచితవైభవ మేర్పడ నున్నయట్టి

కిన్నరేశ్వరుఁ బ్రేమ వీక్షించె నా న
రేశ్వరుఁడు దనమనమున నెనరు మెసఁగ. 82

సీ. సత్ప్రవాళప్రభాసమితి యెల్లెడఁ బర్వి
యధికసంధ్యారాగ మట్లు చెలఁగ
నీలంపుమణులందు జాలువాఱినకాంతి
యొఱపుచీఁకటిగుంపు వెఱపు జూప
నభినవముక్తాఫలానీకములయొప్పు
తారకాదీప్తిచందంబు గెలువ
నిర్మలవజ్రమాణిక్యసౌభాగ్యంబు
పూర్ణిమాచంద్రికాస్ఫురణ నెఱపఁ

తే. బద్మరాగావళిప్రభాపటలమెల్ల
లేఁతయెండల తెఱఁగున భాతిఁ దనర
మీఱిన క్తందివంబు లేమియును బుద్ధి
నెఱుఁగనీనట్టి [1]బాండురనిండ్లఁ జూచె. 83

తే. అంత నారాజు ఘోటకాయత్తుఁ డగుచు
నరిగి యభ్రంకషస్వచ్ఛహర్మ్యశాల
మహితనానామణిప్రభామహితచండ
భానుమండలివైన వైశానిఁ గనియె. 84

క. కని యచ్చటఁ బ్రమథులు మును
లును సిద్ధులు సాధ్యులు సురలున్ రుద్రులుఁ గొ
ల్వున నిల్వ నలరు నీశా
నునిఁ జూచి నమస్కరించి నుతియించె వెసన్. 85

1 రతసంపుటిండ్ల.

క. ఆసైంధవవశగతుఁడై
భాసురగతి నతఁడు చనియెఁ బ్రమథేశ నిజా
వాసమునకు నున్నత కై
లాసమునకు ధవళరుచి విలాసంబునకున్. 86

వ. చని. 87

క. భూకాంతుఁడు తత్తటమున
శ్రీకంఠశిరశ్శశాంక రేఖాకిరణ
వ్యాకులితస్థలనలినీ
లోకంబగు నుపవనంబు లోలతఁ గాంచెన్. 88

వ. ఇట్లు కాంచి. 89

తే. కోరి వెండియు నా వెండికొండ డాయ
నరిగి భక్తియు ముదము నచ్చెరువు నాత్మ
లోన సందడిగొనఁగ నెమ్మేను పొంగ
నాననము వంచి మ్రొక్కి యిట్లని నుతించె. 90

తే. శృంగములబాగుఁ బైచాయ చెలువుఁబాద
వైపులంబును జూడఁ బర్వతవరంబు
నందికేశ్వరుచందంబునం దనర్చె
భాసురంబుగ శంకరావాస మగుట. 91

చ. హరిచరణంబునం బొడమె నంద్రు విధాతృకమండలూదక
స్ఫురణ జనించె నంద్రు మనుజుల్ సురవాహిని నట్లు
గాదు నీ, వెరవునఁ జూచి శారపృథివీధరబంధురకందరం
బునం, దిరవుగఁ బుట్టినట్టి సెలయేఱని యిప్పుడు నిశ్చయిం
చితిన్. 92

చ. హరహర యగ్గిరిస్థలము నందులమింటికి నామలంతలుం
గరముల రుక్మిణీప్రభలు గల్గినపాదము లియ్యకున్న నా
డరుచులకోరనించక యొడంబడి వేడుకతోడ బ్రాలు ప్రో
వరు నెలవంకచుంచుల నవశ్యము గట్టక నవ్వ రెంతయుఁ.
వ. అని వినుతింపుచుం బురోభాగంబున నొక్క మహోత్సేధ
సౌధంబునందు. 94
చ. అనుపమ రాజశేఖరు లనంతవిభూతులు సద్విభూతి వ
ర్ధనులు హరిద్విశేషపరిధాను లుదారులు శంకరుల్ జగ
ద్వినుతపరాక్రమాఢ్యులు పవిత్రులునైన గణంబులెల్ల స
ద్వినయముతోడఁ గొల్వఁగ నవీనరుచుల్ దిలకించు పీఠికన్.
చ. కదలుప రాని తేరు గిరికందరభాగపుటూరు, చుట్టగా
మెదలెడు పేరు సౌఖ్యములుమీఱి యొసంగెడు పేరు
మౌళిపైఁ, బొదలెడు నేఱుఁగల్గు ఫణిభూషణుఁ డింపులు
మీఱ వేడుకన్, ద్రిదశులు కోరి కొల్వఁగ సతీయుతుఁడై
ఘనరాజసంబునన్. 96
సీ. మొలకకెంజడలలో మూఁడుత్రోవలయేఱు
బాలేందురేఖ జంపాల [1]లూఁగఁ
జెఱకువిల్కానికిఁ జాఱుకుచూపినకన్ను
తేట కుంకుమబొట్టు తెలుఁగు దాల్పఁ
గళలచేఁ బ్రొద్దులు గడపనేర్చిన లోచ
నంబులఁ గరుణారసంబు చిల్క
నెకిరింత బెదరించు మెకమువన్నియమించు
చెఱఁగుదుప్పటి కటిసీమ మెఱయ

---

1 లాఁచు.

తే. మొదలిచదువులుపదురులఁ బొదలునట్టి
ప్రోఁతగనుపట్టుబహుముఖంబులఁ దనర్చు
బిరుదమణి నూపురము సవ్యచరణ వారి
జమున వెలుఁగొంద సంతతోత్సాహలీల. 97

సీ. నెలవంకతీరునఁ బొలుపగుదంతంబు
నెమ్మోముమీఁద వెన్నెలలుగాయ
దానవారికి మూఁగి తలరనితేఁటులఁ
గర్ణచామరము లొక్కట హరింప
నడుమఁ దార్కొలిపిన నాగబంధపుముడి
పొంకంబుగల కుండబొజ్జగదలఁ
బసిఁడినిగ్గులుదేరు బాహుదండంబులఁ
బాశాంకుశంబులు బాగుఁజూప

తే. మౌళి శశిరేఖ దిలకింప మదమెలర్ప
నంబ చిఱునవ్వునవ్వ నెయ్యమున నెలుక
పిలుకవార్వంబు నంతంతఁ బేరెమెక్కి
యాడు లంబోదరుఁడు మోద[1]మూమతింప. 98

శా. చాపజ్యాకిణకర్కశంబు లగుహస్తంబుల్ [2]మరుద్భూజశా
ఖా పాణింధమరీతిఁ జెన్ను మెఱయంగా మౌళి మాణి
క్యశ్రీ, భాపుంజంబు దినేంద్రమండలముఁ గప్పం జాప
బాణంబు లా, టోపం బొప్ప ధరించి యచ్చట గుహుం
డున్ బ్రేమతోఁ గొల్వఁగన్. 99

వ. ఇవ్విధంబున గరుడగంధర్వకిన్నరకింపురుషయక్ష రాక్షస
సిద్ధసాధ్యవిద్యాధరామరేంద్రాదిదిక్పాలకులు గొలువం

1 మూవహింప. 2 నమేరుద్రుశాఖా.

పేరోలగంబున్న పన్నగాభరణుం డగుపరమేశ్వరుండు మనంబున మెచ్చునట్లుగా మణికుండలహయగ్రీవులు కుంభీనసరాజకుమారులు నుదంచితస్వయంభూతస్వరామోదను లగు పరివాదినులు ధరించి సమ్మేళనంబుఁ జేసి షడ్జగాంధారమధ్యమనామంబులం బ్రసిద్ధంబు లగు గ్రామత్రయంబులును, స్థాయ్యారోహ్యవరోహి సంచారిభేదంబుల నొనరు నలంకారవిధంబు లఱువది మూఁడును, జనసమ్మోహనకారిణులగుమూర్ఛన లైదువేలున్నలువదియుఁ, దచ్చతుర్గుణితంబులగు శుద్ధంబు లిఱువదివేలున్నూ టఱువదియు ననేకంబు లగుకూటతానంబులును ద్వావింశతి శ్రుతిభేదంబులుం గల షడ్జాదిసప్తస్వరంబులం దనరుసప్తగ్రహవిశేషంబులం జెన్నొందు షాడవౌడవ సంపూర్ణంబు లనంబరఁగు రాగంబులు మున్నూటఱువదినాల్గుఁ దత్తన్మిత్రసంయుక్తంబుగా నప్పరమేశ్వరు ప్రబంధంబులు పాడఁ జిత్రసేనమణిపూరులను గంధర్వనాయకులు తాళంబులు ధరించి త్రుటిక్షణలవకాష్ఠానిమేషకళాచతుర్భాగాను ద్రుత ద్రుతలఘుగురుప్లుతంబు లనుకాలభేదంబులను ధ్రువ చిత్రవార్తిక దక్షిణచిత్రతరంగంబు లగుమార్గచతుష్టయంబులు నావాపనిష్క్రామ విక్షేపప్రవేశకనిశ్శబ్దాదిక్రియాభేదంబులునగు ద్రుత లఘుగురు ప్లుతకృతంబులగు పంచాంగంబులు నతీతానాగతసమంబు లగుగ్రహంబులను జతురశ్రత్ర్యశ్ర మిశ్ర ఖండసంకీర్ణజాతులును ద్రుతమధ్యవిలంబితంబు లగులయలును గోపుచ్ఛ స్రోతోవహాపిపీలికాయవాది భేదంబు లగు యతులును దత్తత్ప్రస్తారంబులు ప్రాణదశకంబునందనరు చంచత్పుట చాచపుట షట్పితాపుత్రక సంపద్వేష్టా

కోద్భట్టాదితాళదర్పంబులు మొదలగునూటొక్కతాళం
బులనొత్త భృంగీశ్వరుండు పతాకాత్రిపతాకార్ధచంద్ర
కటకాముఖ్యాద్యసంయుత హస్తంబు లిటువదినాల్గును
స్వస్తిక గజదంతాది సంయుతహస్తంబులు పదుమూఁ
డునుస్థాయిసంచారివ్యభిచారిభేదంబులందనరు దృష్టులు
ముపద్వితొమ్మిదియుం గుంచితావనతకంపిత సమంబులనం
బొల్చు శిరోభేదంబులను వృశ్చిక[1]ఛిద్రమయూరమండలాది
కరణంబులుం జక్రాదిభ్రమణవిశేషంబులుగలతాండవంబు
బహువిధగతులంజూపిరంత. 100

శా. శుభ్రాంశూజ్జ్వలమౌళి మెచ్చి శిరమస్తోకంబుగా నూఁపె
జూ, టాభ్రద్వీపవతీప్రవాహచలనవ్యాధూతహేమాంబు
జా, దభ్రామోదభరప్రమత్తమధుపద్వంద్వాతిఝంకార
[2]రిం,ఖాభ్రాజచ్చటులోర్విరావములు దిగ్వ్యాప్తంబులై
నిండఁగన్. 101

వ. అయ్యవసరంబున. 102

శా. ఆవిశ్వేశ్వరుఁ జూచి యవ్విభుఁడు జాతానందుఁ డై
"శ్రీమహా. దేవాయ త్రిపురాంతకాయ గిరిజాధీశాయ
కుంభీనస, గ్రైవేయాయ నమో నమోస్తు విమలాకారాయ
తే మేచక, గ్రీవాయ ప్రమథాధిపాయ" యని మ్రొక్కెన్
నిర్వికారాత్ముఁడై. 103

మ. అనఘా, వెండియు నూర్ధ్వమార్గమున నశ్వాధీనుఁడై రాజు
దాఁ, జనియెన్ భూమికి లక్షయోజనముపై చాయ న్విలో
కింప భావనసేయంగ నశక్యమై తనరు దివ్యజ్యోతిరాకార

1 ఛత్ర. 2 శం, కాభ్రాచ్ఛచ్చటులోర్విరావములు.

మై, ఘనమై మించిన భానుమండలము వేడ్కం జూచి
నాశ్చర్యుఁడై. 104

ఉ. సారథి కుంటియై రథచక్ర మొకండె పాముపిండు దు
ర్వారపు రజ్జుసంఘమఁట వాహము లెన్నఁగ బేసియట్టి
సం, బారతలంబు కిత్తయఁట సర్వము పొందుగఁగూర్చి
యెప్పుడుం, మేరువుచుట్టివారునఁట మిత్రచరిత్రము చిత్ర
[1]మెంతయున్. 105

సీ. జలజాలయానాథు చక్కని కుడికన్ను
జగములమించు తేజముల వెన్ను
ద్విజసమూహములు సేవించు మ్రొక్కుల దిన్న
చదువులఁ గొనియాడు మొదలిపన్న
మనఘులబ్జజలోకమున కేగు పెంద్రోవ
సానదీఱిన రత్నచయము చేవ
గాఢాంధకారసంఘమునకు పెఱగొంగ
ధరణీజలంబులఁ బాప్పువొంగ
తే. తెలివిమీఱంగ మింటను దిరుగుదంట
కలువలకుఁగుందు జక్కవ కవలపొందు
మూఁడుమూర్తులు కలరూపు వేఁడిప్రాపు
నగునితనిఁ గంటి భవముల నడఁపఁగంటి. 106

వ. అనునవసరంబున. 107

చ. అనుపమ వేగశాలి యగునశ్వము దన్గొనిపోఁగ రాజు స
య్యనఁ జనిమెం దినేశనిలయంబునకంతను మీఁద లక్ష
యోజనముల మేర నెంతయు విశాలతఁ బొల్పగు చంద్ర

1 మిత్రయిన్.

మండలం, బునికటసీమకుఁ దివిజపుంగవు లద్భుతమంది చూడఁగఁ. 108

క. చని యాజననాథుఁడు దన
మనమున సంతసము సంభ్రమంబు న్వెలుఁగుఁ
బెనఁగొనఁగ వనజవైరిం
గని యీగతిఁ బొగడె నాగకన్యాతనయా. 109

సీ. సురవరు లమృతంబు వరుసఁ గ్రోలెడుకోర
కాముకశ్రేణికి ఖడ్గధార
శివునియాఁదలమీఁది చిన్ని క్రొవ్విరిమొగ్గ
మిసిమిమించిన సుధారసముబుగ్గ
కలుములనిచ్చు చక్కనికాంత సైదోడు
తోయజబాంధవుతోడిజోడు
నిఖిలలోకంబుల నిక్కుచీఁకటిమిత్తి
విలసిల్లు షోడశకళలగుత్తి
తే. నిండుచెలువంపుఁబ్రోవు వెన్నెలలతావు
కలువలకు విందు తామరగములకుందు
దీధితులసీమ రోహిణీదేవిప్రేమ
లోకహితకారి యీచక్రవాకవైరి. 110

సీ. అనుచు నబ్జారాతిఁ గొనియాడు యాచతు
ర్థనుఁడు హాయంబు తన్గొని చనంగఁ
దారకా కవిసౌమ్యధరణిజగురుసౌరి
సప్తర్షిమండలస్థలులు గడచి
ధ్రువుని నాలోకించి మ్రొక్కి తదూర్ధ్వలో
కంబులు దాఁటి తేజంబులకును

నిత్యాలయంబగు సత్యలోకముఁ జేర
    నరిగి నేత్రానంద మావహిల్లఁ

తే. జాతమాణిక్యకీలితసౌధయూథ
వారిజోత్పలరుచిరకాసారవార
సతతఫలభారనతపారిజాతజాత
భూషితంబగు నాకమహాపురవరంబు    111

క. వీక్షించి యందు నృపమా
త్యక్షుం డైందవశిలామయంబును మణిసం
లక్షితవేదీయుతమ
ధ్యక్షోణియు నైనయొక్కహర్మ్యములోనన్.    112

సీ. ఎల్లదివ్యులకు మునీంద్రసంఘములకు
    మొదలై చెలంగెడు మూలదుంప
పాలుసీరను నేరుపఁ బుపనేర్చినయట్టి
    యంచతేజీనెక్కి యాడురౌతు
పనిలేనిపనికై నఁబాటి కైలాటకం
    బులు సేయుమునిఁగన్న ప్రోడవేల్పు
దోడ్డకొంచెములేక తుదినెట్టివరమైన
    జనవున నిచ్చు జన్యాళికాఁడు

తే. వెలఁది తన తలవాకిలి వెడలనీక
పలుకులోపల నడపించుపాటి జాణ
బొడ్డుతామరపువ్వునఁ బొడమినట్టి
[1]ముద్దుపాపఁడు నాలుగుమోములాఁడు.    113

1 ముదుకలాగుల.

తే. సకలయోగీంద్రవరులును సంయములును
గరుడగంధర్వయక్షకింపురుషసిద్ధ
సాధ్యసురనాగకిన్నరసముదయంబు
వినయసంభ్రమరీతి సేవింపుచుండ. 114

సీ. ఏ రాజవదనకు హేమగర్భానన
కమలముల్ భవ్యశృంగాటకంబు
లేకంబుకంఠికి నిందురేఖదలంపఁ
గొప్పుపైఁ జెలువొందు కుసుమకళిక
యేపద్మనేత్రకు నిందిరాపార్వతీ
కంజాతముఖులు సంగడపుఁ జెలువ
లేనీలవేణికి నానావిధామ్నాయ
[1]పఠన యాదృచ్ఛికభాషణంబు

తే. లేజగజ్జననికి నంచ యెక్కిరింత
యే లతాకోమలాంగికి నీ సరోజ
సంభవాండంబులోనున్న సకలభువన
ములును జిన్నారిపొన్నారి బొమ్మరిండ్లు. 115

తే. అట్టివాగ్దేవి మాతృక లలమికొలువఁ
గమలపీఠికఁ దనయంతికంబునందుఁ
గదిసి కూర్చుండఁ బేరోలగమునయున్న
నలినగర్భునిఁ జూచి వందనమొనర్చి. 116

వ. ఇవ్విధంబున సమస్తముని యోగిదేవతాసమేతుండును, భారతీసమన్వితుండును నగునప్పయోరుహగర్భునకు రత్నగర్భావల్లభుండు వినయపూర్వకంబుగా నమస్కరించియున్న

1 పటలి.

యవసరంబున నయ్యుత్తమాశ్వంబు సత్యలోకంబుననుండి
తిరిగితుల్యమునిశాపార్ణవంబునకుఁ దరియనంబోని చక్ర
వాళపర్వతంబునకు డిగ్గుటయునన్నగంబుఁ జూచి యతండు
సంతోషభరితాంతఃకరణుండై యిట్లని తలంచె. 117

సీ. అనిశంబుఁ బగగొన్నయట్టి తేజస్తమం
బులకును బొలిమేరఁ దెలుపునిక్క
సర్వంసహాకాంత సవరించు హేమ నా
నారత్నరచితశృంగారరచన
పుండరీకాదిదిక్కుండాలసంఘంబు
దండమై విహరించు తానకంబు
గ్రహతారకాదు లొక్కట నహర్నిశమును
సరవితోఁ దిరుగు విశ్రామభూమి

తే. పాడవులకునెల్లఁ బోడవు వేల్పులు చరించు
నెలవు దివ్యౌషధంబులు గలపొలంబు
గండభేరుండశరభసంఘాతములకు
మనికిపట్టును నయ్యె నీక్ష్మాధరంబు. 118

వ. అని పొగడునవసరంబున నాహయంబు దన్నుంగొని చన
నతివిశాలంబగుహేమ[1]భూమీధరంబు గడచి శుద్ధోదక
సముద్రోత్తరతీరంబు చేరునెడ. 119

క. పాపాంధకారపటలీ
దీపము సనకాదిసకలదివ్యమునీంద్రా
టోపము భాస్వచ్ఛ్వేత
ద్వీపము[2]ను జతుర్థనాఖ్యవిభుఁ డీక్షించెన్. 120

---

1 భూమిగడచి. 2 సతురంగుఁడైనవిభుఁ.

వ. అది మఱియు ననంతచంద్రప్రభాపాండురంబును, నగణిత కల్పపాదపసమాకీర్ణంబును గనకకమలకల్హార గంధబంధురంబును నై కనుపట్టెఁ దన్మధ్యంబున. 121

క. అమరావతియను నొక్కపు
రము శంకరధరకనకధరాధరశృంగో
పమ రమ్యహర్మ్యమహామల
విమలప్రాకారములను విలసిల్లుఁ గడున్. 122

ఆ. బహువితానవితానవిభ్రాజితములు
భూరిఘంటాసహస్రవిభూషితములు
చిత్రరత్నమయూఖభాసితములు నగు
పుష్పకంబులు మెలఁగు నప్పురవరమున. 123

సీ. ఱెక్కతేజీలపై నెక్కి మిన్నులుముట్ట
నందందు వడిఁదోలి యాడువారి
ఘనభుజాసత్వంబు గనుపట్ట సంగడం
బులుచేసి శైలముల్ మోచువారి
విపులబాహామధ్యవీథిఁ గాంతులు నిండఁ
గెంపులు దార్చి సుఖించువారిఁ
బ్రేమాతిశయముల భామల నురమున
డించక యేప్రొద్దు నుంచువారి

తే. [1]వేయి తలగడలనుగల వెల్లపాన్పు
లందుఁ బవళించి యానందమొందువారిఁ
గన్నుసన్నల ప్రొద్దులఁ గడపువారిఁ
గని నృపాలుండు బుద్ధి నిట్లని తలంచె. 124

---

1 వేయుదలలతలగడల.

మ. నరపాలత్వము దోషహేతువు మహేంద్రత్వంబు నీక్షింప
న, స్థిర మంభోరుహాసంభవత్వము మదిం జింతింప లోలంబు
నీ, నిరతిం జెందఁగ నేల యంచు నెఱపూన్కిన్ వైష్ణ
వుల్ దేవతాం, తరమంత్రాంతరసాధనాంతరములన్ వర్జించి
శుద్ధాత్ములై. 125

మ. గురుఁ డేకైవడి విష్ణుపూజనము దక్షుండై కృపం జెప్పె నా
తెరవొప్పన్ గమలాధినాథు [1]దమహృద్వీధిన్ మహాభక్తి
సు, స్థిరుఁ గావించి సమస్తకర్మములుఁ దత్ప్రీత్యర్థమై చేయు
చున్, హరిచిహ్నంబులు మేనఁ దాల్చి నిరపాయంబైన
యిచ్చోటునన్. 126

క. ఉన్నారు విష్ణుభక్తిన్
మన్నారు సమస్తలోకమహిమల నెల్లన్
గన్నారు హరిచరిత్రలు
విన్నారు మహాత్ము లీపవిత్రులు దలఁపన్. 127

తే. అనుచు నావిష్ణుభక్తుల కతిముదమున
మ్రొక్కి యజ్ఞనాథుఁ డంభోజగర్భ
సదృశు[2]లయినట్టి సన్మునీశ్వరుల కెల్ల
వినయపూర్వకముగను వందనముఁ జేసి. 128

సీ. విమలరహస్యమంత్రముల నెమ్మదిఁ బూని
తంత్రంబు లెల్ల [3]మోదమున నడిపి
సకలాంగముల నెల్లఁ బ్రకటంబు గావించి
షడ్గుణైశ్వర్య విశ్రాంతిఁ జెంది

1 నిజహృద్వీథిన్. 2 లై తగుసన్మునీశ్వరుల కెల్ల. 3. మోదమునఁ జల్పి.

యరిసమూహమ్ములఁ బోరిఁబోరి నణఁగించి
కడుదోరమైన దుర్గములనిల్పి
సతతసర్వాంసహాసంపత్తిఁ జెలువొంది
సంతోషబుద్ధి నిచ్చలునుబొదలి
తే. యవ్యయతపోధనంబు లత్యంతనియతిఁ
గూర్చి శ్రేయఃపదప్రాప్తిఁ గొమరుమిగిలి
రాజులన రూఢికెక్కినరాజయోగి
రాజులను జూచి మ్రొక్క నారాజవిభుఁడు. 129

వ. అయ్యవసరంబున ఘోటకంబు దన్నుం గొనిచనఁ జనిచని తత్పురలక్ష్మీ తిలకాయమానం బగుశతకోటి బాలార్క ప్రభాబ్జరాగ రౌప్యహేమమయంబై చందనాగరుధూప వాసనావాసితంబై దివ్యకాంతాసహస్రసేవితంబై యనవరతపఠత్కీరశారికాసామగానమనోహరంబై యొప్పు నప్పురంబున. 130

తే. బాలభానున కెనయైన భవ్యదివ్య
నవ్యమాణిక్యసింహాసనంబుమీఁద
నాత్మవక్షస్థ్సలీకౌస్తుభాయతప్ర
భాసమూహంబు దిక్కులఁ బరిఢవిల్ల 131

చ. కనకమహీధరాగ్రమునఁ గానఁగవచ్చు నినేంద్రమండలం
బన మకుటంబు చెన్నుమెఱయంగ మెఱుంగిడినట్టి పైఁడి
కమ్మి నగెడుమేన వెన్నె లలమించులు చూపెడి వెల్లపట్టు
[1]చేలల నెఱులు వాఱఁగట్టి కమలాహృదయేశ్వరుఁ డేపు
మీఱఁగన్. 132

---

1 చీ, ర.

సీ. కౌస్తుభమాణిక్యకలితమై విలసిల్లు
నురమున ముత్యాలసరులు మెఱయ
నతులితవజ్రకీలితదివ్యకుండలం
బుల కాంతి మెఱుఁగుఁజెక్కుల నటింప
భర్మాచలోభయపార్శ్వస్థ శశిచండ
కరులునా శంఖచక్రములు దనరఁ
గమలాలయాంఘ్రిలాక్షాలాంఛనం బన
నొసలఁ గుంకుముబొట్టు పసలుచూపఁ
తే. గలువలకుఁ దమ్ములకు నవ్వుఁగఱపు లోచ
నంబుల ననూన కరుణారసంబు చిలుక
నఖిల మోహనాకారుఁడై యా జనార్ద
నుండు గొలువుండెఁ గన్నులపండువుగను. 133
సీ. తనపాదలాక్ష భూధరసుతాది నిలింప
భామినీసిందూరపటలిగాఁగఁ
దనయపాంగము జగద్దారిద్ర్యతిమిరౌఘ
పరిపూర్ణచంద్రాతపంబుగాఁగఁ
దనవినోదక్రీడకును బ్రహ్మసంభవాం
డంబులు చిన్ని [1]పన్నళ్లుగాఁగఁ
దనదృష్టికిని విరించనముఖ్యదేవనా
యకులెల్ల సాలభంజికలుగాఁగఁ
తే. దనరు నేయింతి యట్టిపద్మావధూటి
కమలవసుపాత్ర మాతులుంగ ముకురములు
నాల్గుచేతుల నలర నానలిననేత్రు
నంకపీఠికనుండె నయ్యవసరమున. 134

---

1 పసంట్లుగాఁగఁ; పన్నార్లుగాఁగఁ.

వ. ఆ చతుర్థనజననాయకుం డద్దేవదేవుసభామంటపంబున సన
కసనందనాదులం గనుంగొని వినమితశిరస్కుండై పురో
భాగంబున. 135

తే. శ్రీహరికి నాత్మభోగ మర్పించి శాంత
మూర్తియై పెక్కుభంగుల మొనసి సేవ
సేయు పన్నగరాజు నీక్షించి యమ్మ
హీవరుఁడు నాతనికి నమస్కృతులు చేసి. 136

వ. తదనంతరంబ. 137

సీ. తనతల్లి దాస్యంబు దప్పింప హరినోర్చి
యమృతంబుఁ దెచ్చిన యధికుఁ డితఁడు
క్ష్మాధరంబులఁబోలు గజకచ్ఛపంబులఁ
గబళించి మ్రింగిన ఘనుఁ డితండు
బ్రహ్మాండసంఘధురంధరుం డగు విష్ణు
నవలీలఁదాల్చు మహాత్ముఁ డితఁడు
సకలవేదములు శాస్త్రములు నంగములుగా
జనన మొందిన పుణ్యచరితుఁ డితఁడు

తే. పాపరాయని మదిలోని భయముమాన
శాంతిఁ ద్రిమ్మరు పాపభంజనుఁ డితండు
అనుచు నారాజశేఖరుఁ డహివిరోధిఁ
గని నుతుల్ చేసె క్షేమంబు గడలుకొనఁగ. 138

శా. విష్వద్ర్యఙ్మహనీయకీర్తిఁ ద్రిజగద్విఖ్యాతచారిత్రు ది
వ్యైష్వాసోజ్జ్వలహస్తు సర్వరిపువాహిన్యంధకారార్కునిన్
విష్వక్సేనపదాంబుజార్చన విధావిజ్ఞానపారీణు న
వ్విష్వక్సేనునిఁ జూచి మ్రొక్కె నిఖిలోర్వీభర్త సంప్రీతితోన్.

వ ఇట్లు మ్రొక్కి యనంతరంబ జయవిజయులకుం బ్రణమిల్లి యష్టమహాశక్తుల కభివందనంబుచేసి. 140

తే. తమ్మిలోఁ బరితుష్టైన కొమ్మలెల్ల
నెమ్మి నుడిగమ్ము లొనరింప సమ్మదమునఁ
బొదలు కలశాబ్ధికన్యకుఁ బుండరీక
నయనునకుఁ బ్రేమనెఱఁగి యన్నరవరుండు. 141

వ. తదనంతరంబున నిట్లని తలంచె. 142

చ. అనిశము నేమునీంద్రులు మహానియమంబున నే జగత్ప
తిం, గనుఁగొనఁ గోరి పుత్త్రధనకాంతల నాదిగ నుజ్జగించి
కా, వనములుచేరి ధీరత ననారతముం దపమొప్పఁజేసి రా
ఘనులు నెఱుంగలేని హరిఁగంటిఁ బురాకృతపుణ్య మెట్టిదో!

క. అని తలఁచుచు నజ్జనపతి
మనమున సంతసముఁ బ్రేమ మూర్కొన నొందం
[1]టినిదరుమ హర్ష పులకిత
తనుఁడై వినుతించె బహువిధంబులభక్తిన్. 144

వ. అని శుకయోగీంద్రుం డిలావంతునకుఁ జెప్పినవిధం బెఱిం
గించిన విని యటమీఁదివృత్తాంతం బేమని యడుగుట
యును. 145

శా. శ్రీలక్ష్మీశ్వరపాదభక్తినిరతా చిత్తాబుజానమా
పాలాగ్రేసర సత్కృపాకలిత దీవ్యద్వేటికా పేటికాం
దోళీఛత్త్రకళాచికామణిగణానూనాంక చేతోభవ
ప్రాలేయాంశు జయంతరూప రిపువీరవ్రాతసంహారకా.

---

1 టను బరమహర్ష పులకిత.

క. సతతాన్నదానసువ్రత
శతమఖవిభవాఢ్యదీనజనదౌర్గత్య
క్షితిధరశతకోటిమహా
వితరణగుణభూషసుజనవినుతచరిత్రా. 147

తోదకము.—

భావజమూర్తి నృపస్తుతకీర్తి
పావనశీల కృపారసలోలా
రావణవైరి పరాక్రమహారీ
యావతనేత్రవరాంబుజమిత్రా. 148

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మనామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణసుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్రభారతం బనుపురాణకథయందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు.

# చిత్రభారతము

## పంచమాశ్వాసము.



మన్మాణిక్య లస
చ్ఛామీకర కటకరుచిరశయ వాసోధరి
స్తోమపరితోషితాబ్ధి
స్సోమండలకల్పభూజ మాదయపెద్దా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని జాతుండగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదులగుశౌనకాదులకు నిట్లనియె నట్లు తృతీయవ్యూహాధిపతియగు జనార్దనదేవుం గని నమస్కరించి తనకు గోచరించినచందంబున వినుతించి తత్పురంగాయత్తుండై చని ముందట. 2

మహాస్రగ్ధర—

కనియెన్ భూపాలుఁ డత్యుగ్ర మకర కమఠ గ్రాహ పాఠీన
సంఘ,ధ్వనభంగాభంగఘోషక్షుభిత నిఖిలదిక్చక్రకుంభీంద్ర
నిద్రన్, వినుతాత్మద్వీపమధ్యావిరతపటు సభావేశ్మ నిద్రా
వశశ్రీ, వనితాకాంతాల్పభోగీశ్వర భరమణిదుర్వర్ణ
భద్రున్ సముద్రున్. 3

---

1 ధుని.

వ. కని యిట్లని తలంచె. 4

సీ. పద్మపత్రాక్షుండు పవళించు సౌధంబు
పుష్పబాణునితల్లి పుట్టినిల్లు
రాజశేఖరుని గారాబంపుఁ బూఁదోఁట
విపులామహాదేవి వెల్లచేల
యప్సరాంగనల నెయ్యంపుఁగేళాకూళి
యబ్జోదయస్థితి నమరు సరసి
కల్పవృక్షంబులు ఘనత మొల్చినకోన
పాకశాసను నడబాలగృహము
తే. మంచి సురధేను వుదయించు మందపట్టు
దివ్యరత్నంబు పొడమిన తెంకి శివుని
యువిఁ<sub></sub>సైదోడు భయమందియున్న గొంది
యఖిలసౌభాగ్యరాశి యీయంబురాశి. 5

వ. మఱియును. 6

ఉ. ఆ పురుహూతుఁ జూడి భయమంది సమస్తసువస్తురాజిచేఁ
జూపడు శైలముల్ జలముఁ జొచ్చి సురేంద్రుని రాక
చూడఁగా, నేపున నిక్కెనో యన ననేకవిశేషములం
బొసంగి యీ, ద్వీపము లెల్లెడన్ వననిధిం గనుపట్టె మహో
న్నతాకృతిన్. 7

మ. వలమానోరగరాజరజ్జువలయవ్యాపారవన్మందరా
చల మీసింధువునందు నిల్పి సుమనస్సంఘాతముల్ దాన
వా, వలియున్ ద్రచ్చినఁ జూచి నిర్భరమహావర్తంబులం
బొల్చె నీ, జలముల్ పద్ధరణీధరభ్రమణమోజ న్నేర్చు చం
దంబునన్. 8

వ. అని కొనియాడుచు సప్తమార్ణవంబు సరిగడచి చనునెడఁ దన్మధ్యంబున. 9

సీ. కొండయల్లుని మేనఁ గొమరారుసిరిమించి
చదువుతొయ్యలి మేనిచాయఁ దెగడి
నిండువెన్నెలమించు తండముల్లసమాడి
విరిమల్లెపువ్వులఁ బరిఢవిల్లి
వేలుపుఁజెట్లపై వింతకొమ్మలు చూపి
నింగిపెన్నేటి బెడంగుమీఱి
చలిగొండవెలిగట్టు చాయలగిలుమూడి
కొండెంపుఁదపసిఁ గైకొనక చెలఁగి

తే. చుక్కలమెఱుంగు లన్నియుఁ జూఱలాడి
పాలమున్నీటితరగల పసలనేలి
దెసలపైఁ దన వెలుఁగుల మిసిమి నెఱయఁ
బాపరాయఁడు [1]గడలిలో నేపునొందె. 10

వ. తదుపరిభాగంబున. 11

సీ. కమనీయ తపనీయ కౌశేయ మొసపరి
బాగుగా రింగులువాఱఁ గట్టి
మృగనాభికర్పూరమిళితచందనచర్చ
నీలదేహంబున గీలుకొలిపి
యనుపమదివ్యరత్నాంచితభూషణం
బులు మెఱుంగులనీనఁ బొసఁగఁ దాల్చి
శంఖకౌమోదకీ చక్ర[2]పద్మంబులు
కరచతుష్టయమున గరిమఁ బూని

---

1 నెగడె నీప్రాంతమందు. 2 ఖడ్గంబులు.

తే. పారిజాతనవీనపుష్పములతోడఁ
గుంతలంబుల నీటుగాఁ గొప్పుదీర్చి
సతత యౌవనశాలియు సకలలోక
పాలకుఁడునై ముదంబునఁ బవ్వళింప. 12

క. సరసిజభవాదిదివిష
ద్వరులు దనుజబాధఁ దెలుప వారల మనవుల్
సరవిని నాకర్ణింపుచు
నిరుపమగతినున్న దేవు నృపుఁ డీక్షించెన్. 13

వ. ఈక్షించి యిట్లని తలంచె. 14

సీ. శ్రీసర్వదేవతాసేవితపదపద్మ
పద్మాలయామనోబ్జాతమిత్ర
మిత్రకోటిప్రభామేయతేజోమూర్తి
మూర్తిమద్భృతమహాముఖ్యవిభవ
భవశిరోవాహినీప్రభవాంచితచరణ
రణవిదారితదైత్యరాజచక్ర
చక్రనీరజగదాశంఖభూషితశయ
శయనీకృతోరగస్వామిదేహ

తే. దేహభృన్మానసాబ్జవర్ధితవిహార
హార[1]హారిపుండరీకాబ్జ హీరతార
తారకాభ్రనగేంద్రగంధర్వశర్వ
శర్వరీశ్వర సమకీర్తి సర్వవిజయ. 15

వ. అని యివ్విధంబునఁ జతుర్థవ్యూహాధిపతి యగు శేషశాయి
నతిభక్తి నూహించునవసరంబున నాగంధర్వుంబు విచిత్ర

1 నీహారపుండరీకాబ్జతార.

గమనంబునఁ దన్నుం గొని చన దధిఘృతసురేక్షురసలవణ సముద్రంబులు గడచి కింపురుషాదివర్షంబులు దాఁటి భరత ఖండోర్ధ్వభాగంబునఁ గుండినగరంబున కేఁగునవసరంబున. 16

క. అనఘా, కృష్ణుఁడు నారద
మునితోఁ జెలికాండ్రతో యమునలో జలకే
ళి నెఱపి యొకపులినస్థల
మున భానునిఁగూర్చి యర్ఘ్యము నొసఁగెడుతఱిన్. 17

క. వినువీథిఁ జనెడు హారియా
నన ఫేనకణము సమీరణవశంబున న
వ్వనజాక్షు జలాంజలియం
దునఁనే పడె దైవఘటనను గిరీటిసుతా! 18

క. ఆనురువుఁ జూచి కృష్ణుం
డానఁగ రానట్టి కినుక నతఁడవ్వయి కెం
పూన మదంజలిలోపలి
కేనెపమున వచ్చె నిట్టి యెంగిలి సలఁపన్. 19

చ. అని తలయెత్తి మింటఁ జనుసాళ్వనరేంద్రునిఁ జూచి వీనిమ, త్కనదిషువహ్ని నేని నిశితం బగుచక్రముచేత నేని యే, ననితలబ్రహ్మ కాచినరయంబున ముప్పదినాళ్లలోపలన్ దునిమెద నాదువాక్యము వినుండు చరాచరభూతజాలముల్. 20

ఆ. అని ప్రతిజ్ఞఁజేసి యనిమిషమానియు
సకల యాదవులును సంభ్రమమునఁ

గొలువఁ గృష్ణుఁ డలఘు గుణశాలి నిజధామ
మైనద్వారవతికి నరిగె నంత. 21

వ. ఇట్లు కృష్ణుండు ప్రతిజ్ఞఁజేసి చనిన యనంతరంబ యిచటఁ జతుర్థనుం డవ్విధంబేమియు నెఱుంగఁడు గావున నధిక సంతోషంబున నానాలోకాంతరస్థంబు లగుకల్పవృక్షకామ ధేనుచింతామణులను గరుడగంధర్వకిన్నర కింపురుషయక్షరాక్షసదిక్పాలబ్రహ్మలను దృతీయచతుర్థవ్యూహాధిపతు లగుజనార్దన శేషశాయులను దర్శించితిఁ గృతార్థుండ నైతి నని తలంచునంతలో నవ్వారువంబు యథేచ్ఛం దిరిగి నిజ నివాసంబుఁ జేరు వారువంబుచందంబున నధికవేగంబునఁ గుండిననగరంబుఁ జేరి క్రమంబున నగరిమొగసాలఁ గదిసి నిలిచిన. 22

ఉ. ఆనరనాయకాగ్రణి హయం బనురాగముఁ జెందునట్లుగా
నాననమల్ల దువ్వి వినయంబునఁ గంధర నప్పళించి లో
నూనినవేడ్కఁ దాని డిగి యొయ్యన లోనికి నేగెఁ దేజి
యుం, దోనరుదేర మంత్రులు గనుంగొని సంభ్రమ మొప్ప
మ్రొక్కఁగాఁ. 23

వ. అట్లేగి. 24

తే. చంద్రకాంత శిలానద్ధసౌధమధ్య
వేదికాపద్మరాగనవీనభద్ర
పీఠికాసీనుఁడై రాజబృందభృత్య
జనముఁ గన్గొని తగినమన్ననల నొసఁగె. 25

వ. అయ్యవసరంబున మంత్రులు గరంబులు మోడ్చి యిట్లని విన్న
వించిరి. 26

సీ. చంద్రహీనంబైన క్షణదాముఖముఁబోలె
జారచోరానందకారి యగుచు
ఘనమండలచ్ఛన్న దినము తెఱంగున
మానిత తేజోవిహీన మగుచు
మాధవరహితమా మధువనంబునుబోలె
సిరిఁబాసి పాదటి చెన్నుదొఱఁగి
యధిపతిలేనిసైన్యంబు చందంబున
నత్యంతదైన్యంబు నావహించి
తే. దేవ నీలేమిఁ జేసి ధాత్రీతలంబు
చిన్నపోయెను విగతలక్ష్మీవిహార
మగుచు నీపురి పతిలేనియతివఁ బోలి
కడునమంగళమై వింత బెడఁగు నిగిడి. 27
మ. అవరోధాంబుజపత్రలోచనలు దేవా నీవియోగంబుచే
నవరోధంబునఁ బొంది వాడిన శరీరాంగంబులన్ భూషణా
దివిశేషంబుల నుజ్జగించి సలిలార్ద్రీభూతనేత్రాబ్జలై
దివసంబెన్న మహాయుగంబులుగ నార్తిం జెంది రత్యంతమున్
క. మాపాలి భాగ్యవశమున
భూపాలక, నీవు మగుడఁ బుట్టితి విఁక ధా
త్రీపాలనంబు సేయుము
శ్రీ పెంపు దలిర్పఁ శుభము చేకూఱంగన్. 29
వ. అనునవసరంబున మెఱుంగు మెఱసినచందంబునఁ జూచు
వారలకు నతివిచిత్రంబుగ. 30
సీ. చివురాకుఁ జేసినఁ జేసెఁగా కజుఁ డందుఁ
డాఁటేటి నేసూటిఁ దారుకొలిపెఁ

జిలుదొనల్ చేసినc జేసెcగా కజుc డందుc
 ననcటుల నేరీతి నలవరించె
సింగంబుcజేసినc జేసెcగా కజుc డందుc
 గుంభికుంభము లెట్లు కుదురుపఱిచె
శీతాంశుcజేసినc జేసెcగా కజుc డందుc
 దిమిరంబు నెట్టిచందమున నిలిపె
తే. ననుచు జనులెల్ల నచ్చెరువందc బాద
ములును మీcగాళ్లు జంఘ లూరు లవలగ్న
మును గుచంబులు మోముc గొప్పును మెఱయcగ
నామహాశ్వంబు నీరజాతాక్షి యయ్యె. 31
వ. ఇత్తెఱంగున నత్తురంగంబు నత్తుల్యమునీశ్వరుశాపార్ణ
వంబుc గడచి విచిత్రంబుగాc గామినియై దివ్యవిమానా
రూఢయై మేఘమధ్యవిరాజమానశంపాలతకైవడి నొప్ప
నప్పు డాచతుర్థనుండు విస్మితాత్ముండై యయ్యిందువదన
నీక్షించి యిట్లనియె. 32
ఉ. పువ్విలుకాని గారవపుcబోటివొ శైలవిరోధిభామవో
యెవ్వతె వీవు నీరజదళేక్షణ మున్ను తురంగరూపమై
యివ్వగcబొంద నేమి నెప మెచ్చట నుండుదు నామ మెద్ది నీ
కెవ్వcడు నాథుcడివ్విధము లెల్లయథార్థముగాcగc జెప్పుమా
తే. అనిన నా పువ్వుcబోcడి నెయ్యమునc బలికెc
జిలుకకైవడి గండుcగోయిలవిధమున
వీణెబాగునc జెవులకు విందుగాcగ
నెట్టనంబునc దేనియ లుట్టిపడcగ. 34
తే. ప్రాభవోపేంద్ర నాపేరు రంభ నాని
వాసదేశంబు స్వర్గంబు వాసవుండు

నిచ్చుఁ గ్రొత్తగ మన్నింప నెగడుదాన
నప్సరోభామినులలోన నధికురాల. 35

చ. అతిమతి లోకజాలము భయంబునఁ జెంద హరింగుఱించి ని
ష్ఠురతప మాచరించెను వసుంధరఁ దుల్యుఁ డనంగ నమ్మునీ
శ్వరుఁడొకఁడాతపంబు నెఱవాదితనంబున మాన్పమంచు స్వ
ర్గరమణుఁ డంపె నన్ను నధికంబుగ మన్ననఁ జేసి భూవరా!

ఉ. ఆదివిజాధినాయకుని యానతి యాదల మోచి నేను ని
మ్మేదిని కేఁగుదెంచి మునిమీఁద ననేకవికారలీలలం
జాదుకొనంగఁ జేసినఁ గషాయితమానసుఁడై యతండు వ్యా
ఖ్యేద మెలర్ప నన్నుఁ దమకించి శపించెను వారువంబుగాన్.

తే. అంతనే నమ్మునీంద్రు పాదాంబుజాత
ములకు నెఱఁగిన నాతండు కలఁక యుడిగి
కరుణమీఱంగ శాపమోక్షక్రమంబుఁ
జెప్పె నిట్లని నరనాథ. చిత్తగింపు. 38

ఉ. నీకు సమస్తలోకములు నిండిన వేడుకఁ జూపి తెచ్చి ల
క్ష్మీకరమైన యిప్పురముఁ జేర్చిన యాక్షణమంద నీవు పూ
ర్వాకృతిఁ బొందఁజాలుదని యమ్ముని చెప్పిన నట్ల యేను లో
కైకశరణ్య నిన్ను భువనావలిఁ జూడఁగఁ జేసి తెచ్చితిన్.

తే. అనఘ నీదేహ మంటిన యట్టిపుణ్య
వశముమై నాకు సురలోకవాసమహిమ
దివ్యదేహంబు శాపంబు దీఱఁగడయుఁ
గలిగెఁ బ్రత్యుపకృతి నీకు నెలమిఁ జేతు 40

వ. అని సకలజనవశీకరణంబును సర్వదేవతాకర్షణంబును నిఖిల
జగన్మోహనంబును నిత్యలక్ష్మీకరంబును మోక్షప్రదంబును

నగునారాయణమంత్రరాజంబు నీకు నిచ్చెదనని యన్నరేం
ద్రునిం గృతస్నానుం గావించి హస్తమస్తకసంయోగంబుఁ
జేసి దక్షిణకర్ణంబునం బ్రణవపూర్వకంబుగా నుపదేశంబుఁ
జేసి మంత్రసిద్ధియయ్యెడుమని దీవించి యారంభ దననివా
సం బగునాకలోకంబున కరిగె. నిచ్చట నచ్చతుర్ధనజననాయ
కుండును దదుక్తప్రకారంబున మంత్రానుష్ఠానంబు జరుపు
చుండెనంత. 41

శా. ఆరాజేశ్వరుఁ డొక్కనాఁడు నిజహర్మ్యాగ్రంబునన్ మంత్రు
లుం, జారవ్రాతము గొల్వఁ దాఁ గనిన నానాలోకవృత్తాం
తముల్, గారాబంబునఁ జెప్పునత్తఱి వియద్గంగానిశానాథ
దు, గ్ధారాజాచలకాంతులం గెలుచు నంగస్ఫూర్తిఁ
జెన్నొందఁగన్. 42

సీ. భర్గాద్రిశృంగస్థ పద్మరాగములన
శిరమునఁ గెంజడలొరపుచూప
శశిలోనఁ దనరు లాంఛనము చందంబునఁ
గృష్ణాజినము మేనఁ గీలుకొనఁగఁ
గాలకూటాశివక్షఃఫణీంద్రునిఁబోలి
ధవళయజ్ఞోపవీతంబు దనరఁ
బ్రాలేయ భూధరప్రాంతసంధ్యారాగ
వైఖరిఁ గటిసీమవల్కమమర

తే నాల్కపై నువ్వగింజైన నాననట్టి
యారివేరంపుఁదపసి కయ్యంబుగడుపుఁ
గూడుగాఁజేసి మెలఁగెడు కోడిగీఁడు
ముదురుచదువులబాపనిముద్దుపట్టి. 43

ఉ. నారదుఁ డేగుదెంచి నరనాథునిముంగట నిల్చి వేడుకల్
దేఱఁగ గాడ్పుచేత మహతీవరతంత్రులు విష్ణు కృష్ణ నీ
రేరుహనేత్ర భూమిధర శ్రీధర యచ్యుత రుక్మిణీమనో
హార ముకుంద కేశవజనార్దనయంచుఁ జెలంగి మ్రోయఁగన్.

వ. ఇవ్విధంబున సకలవిద్యావిశారదుండును నిజతనుప్రభావిజితశారదనీరదుండును నగునారదుండు వచ్చిన నాచతుర్థనుండు నిజపరిజనసహితంబుగాఁ బ్రత్యుత్థానంబుఁ జేసి తనకిరీటం బతని పాదాగ్రంబులు మోవ సాష్టాంగం బెఱఁగి యమ్మహాత్ముని పాదరేఖలు దనమందిరం బలంకరింప నడపించి సుఖాసీనుం గావించి యాతిథ్యం బొనరించి కృతాంజలియై యిట్లనియె. 45

చ. మునివర, యెల్లకాలమును మ్రొక్కులచే నినుఁ బూజ
సేయునా, యనిమిషనాథు నింటికి నొకప్పుడు పండువు రీతి
వట్టి నీవ ననుఁ గృతార్థుఁ జేసి విభవంబులు నాకొనఁగూర్చు
కారణంబునఁ జనుదెంచి తిచ్చటికిఁ బుణ్యుఁడ నైతిఁ గదా
జగంబునన్. 46

వ. అనిన నమ్మహీధవునకుం గలహాభోజనుం డిట్లనియె. 47

తే. భద్రమే నీకు రాజేంద్ర, ప్రజలకెల్లఁ
గుశలమే నీవు పాలించుక్షోణితలము
సత్యసంపదచేతఁ బ్రశస్తమగునె
పరిజనంబులకెల్ల శోభనమె చెపుమ. 48

క. పరికించి పనులవారలఁ
దరబడి పదములను నిల్పు వానికి రాజ్య
స్ఫురణదగ మేన సకలా
భరణంబులరీతి వీడుపడకుండ నృపా. 49

వ. అని యడిగిన నాచతుర్థనుండు మునీంద్రా, నానేర్పుచందం
బునఁ బుడమిఁ బరిపాలింపుచున్న వాఁడ, నన్నుఁ గరుణా
కటాక్షంబునం జూచి ధరణీపాలనవిధానం బానతీయ
వలయు నని యడిగిన నమ్మునీంద్రుం డతని కిట్లనియె. 50

క. పరులకును జింతసేయం
బరికింప నశక్యముగను బ్రజలం గనిపె
ట్టి రమణమీఱఁగ ధరణీ
నరనాథుం డేలవలయు నాతుకఁబోలెన్. 51

క. అరిఁ గోరుఁ గొనెడు తఱి భూ
వరుఁడు ప్రజలమనసు నలఁపవలవదు దలఁపఁ
ధరణి గుసుమములఁ గలిగిన
పరిమళములుగొనెడు తేఁటిబాగున నధిపా. 52

క. హితవరియై వెరవరియై
మతిమంతుఁ డనంగఁ దనరి మంత్రవిధాన
ప్రతిభాన్వితుఁ డగు నిత్యో
చిత వితరణశాలి మంత్రిఁ జేయఁగవలయున్. 53

క. ధరణిశరీరము జీవుఁడు
నరపతి జనులంగములును నయనయుగము మం
త్రిరమణుఁడుగావున సచి
వరహితుఁ డరయంగఁ జీకువడువున మెలఁగున్. 54

క. శూరుల విశ్వాసముగల
వారల ధీరులను హితుల వదలక దయ చే
కూఱఁగ నేలఁగవలయును
భూగమణులకెల్ల నిక్కముగ మనుజేంద్రా! 55

చ. అనవుడు నమ్మహీపతి సురాధిపమౌనివరేణ్యుతోడ ని
ట్లనియె భవత్ప్రసాదమున నత్యధికం బగునీతి రీతియె
ల్లను వినఁగల్గె నింక సఫలత్వమునొందె మదీయవర్తనం
బనఘవరేణ్య, నాకు భవదాగమనం బెఱిఁగింపఁగాఁదగున్.

వ. అనుడు నమ్మునీంద్రుం డమ్మనుజేంద్రున కిట్లనియె. 57

క. నినుఁజూడ దుఃఖమయ్యెడు
ననఘా నీయట్టివాని కా యాపద వ
చ్చిన కారణ మిదియని చె
ప్పిన నీనెమ్మనము మిగుల బెగ్గిలునేమో. 58

తే. అయిన నీకొక యతిరహస్యంపుఁబలుకుఁ
దెలియఁజెప్పంగఁబూని యే తెంచినాఁడ
నిచటికాంతల సచివులనెల్ల ననుపు
మంత్రభిన్నంబు గాకుండ మానవేంద్ర. 59

వ. అనిన నమ్మునీంద్రునివాక్యంబున వారల నంపిన నమ్మహీ
పతికి నాతం డిట్లనియె. 60

క. అనఘా మాయాతురగం
బునెక్కి నీ వుపరిలోకముల కేగి రయం
బున నీకుండినపురమున
కనిమిషమార్గమున రాఁగ యమునానదిలోన్. 61

ఆ. నీహయోత్తమంబు నెమ్మొగంబునఁ బుట్టి
ఫేనఖండ మనిలవేగవశము
నం దదంబు తర్పణము సేయుకృష్ణుని
హస్తయుగళజలములందుఁ బడియె. 62

మ. అది వీక్షించి బలానుజుండు పటురోషాయత్తుఁడై యుగ్ర
తం, బెదవల్లాడఁగఁ గన్నుదోయి యరుణస్ఫీతాకృతిన్
మీఱ నున్మదుఁడై యెవ్వని ఘోటకాననజఫేనం బీగతిన్
వచ్చె వాని దివౌకస్పతిగాచినం దునుముదున్వే మాస
మాత్రంబునన్. 63

ఆ. అని ప్రతిజ్ఞఁ జేసి యనుపమసంతోష
భరితుఁడగుచు నాత్మపురికి నేఁగి
యున్న వాఁడు భుజములున్న తాకృతిఁబొంద
ననఘ దేహరక్ష యరసికొనుము. 64

వ. ఇవ్విధంబున నాకైలాటకంబు దపసి వేఁడినారసంబులు గర్ణం
బులఁ జొనిపిన చందంబున నమ్ముకుంద ప్రతిజ్ఞాప్రకా
రంబు వినిపించి యథేచ్ఛం జనియె నిటఁ జతుర్ధనుండును
భయాక్రాంతుండై తనలో నిట్లని చింతించె. 65

ఉ. ఏటికి వేఁటఁబోయి తఁట నేటికి మాయపుఁ దేజిఁ గంటి? నే
నేటికి దానిఁ బట్టికొన నేటికి నెక్కితి నిత్తెఱంగు నా
కేటికి వచ్చె నివ్విధికి నెవ్వనిపాదము పట్టికొందు నీ
వేఁటయు నన్నుఁ బొందుపృథివీపతిభంగిఁ గలంచె దైవమా.

సీ. అని వెచ్చనూర్చి ధైర్యంబూఁతగాఁగ న
మ్మనుజాధినాథుఁ డిట్లని తలంచె
నత్యంతచంచలం బైన ప్రాణముతీపిఁ
గులశీలధర్మముల్ గుందుపఱచి
సరియైన మేదినీశ్వరులు నవ్వఁగ బాంధ
వులు సిగ్గుపెంపునఁ దలలు వంపఁ
గులహీను గుణహీను గోపాలు మాయి కృ
తప్రతిజ్ఞుని నెవ్విధమున శరణు

తే. చొత్తు సామంత్ర రాజవిస్ఫురణచేత
దేవతాకర్షణముఁ జేసి తెగువ మెఱసి
సంగరస్థలి నెదిరించి శౌర్య మెసఁగఁ
జత్తుఁ జంపుదు లోకముల్ సన్నుతింప. 67

వ. అని నిశ్చయించి శుచియై త్రైలోక్యనాయకుండైన జంభారాతిం గుఱించి రంభాదత్తమంత్రానుష్ఠానంబు విధ్యుక్తప్రకారంబున నాచరించి యాకర్షించిన. 68

సీ. శిరమునదోఁపిన సురమహీరుహపుష్ప
ములతావి దిక్కులఁ గలయఁ బొలయ
ననవిలుకానిబాణముఁలఘాతము లనఁ
దనవేయికన్నులు దళుకుఁ జూప
వైరిగోత్రములఁ గ్రొవ్వారఁజేసిన వజ్ర
కాంతులు రోచసి గప్పుకొనఁగ
దివ్యమాణిక్యసందీపితభూషణం
బులు మేనిచెలువంబు నెలమి గొలుప

తే. గరుడగంధర్వదేవకింపురుషవరులు
గొలువ నైరావతము నెక్కి కుంభినీంద్రుఁ
డతులమంత్రంబు జపియించు నాక్షణంబ
యమరగణనాయకుండు ప్రత్యక్షమయ్యె. 69

వ. ఇవ్విధంబున నాదేవతాసార్వభౌముండు ప్రత్యక్షంబై నిలిచిన నతండు సంతోషభరితాంతరంగకరణుండై సాష్టాంగదండప్రణామం బాచరించిన నతం డిట్లను రాజేంద్రా, నీవు నావలనం గోరు నభీష్టం బెయ్యది చెప్పుమనిన. 70

క. ఆరాజు ముకుళితకరాం
భోరుహుఁడై నేత్రయుగ్మమున హర్షాశ్రుల్

జారఁగ నెంతయు నతనికిఁ
గారుణ్యము పొడమునట్లుగా నిట్లనియెన్. 71

ఉ. నన్ను నకారణంబ యల నందకుమారకుఁ డుగ్రవృత్తి మీ
ఱన్నిఖిలం బెఱుంగ సమరంబునఁ జంపఁగఁ బూనినందు కే
నిన్ను గుఱించి యీజపము నిష్ఠ నొనర్చితిఁ జిత్తగింపు వే
గన్నులవేల్ప, సత్కరుణఁ గాచి భయంబుఁ[1]దలంగఁ జేయవే.

వ అనవుడు దేవతావల్లభుం డాకుండినవల్లభున కిట్లనియె. 73

మ. వనజాతోద్భవదత్తచండవరగర్వస్ఫూర్తి లోకమ్ము లె
ల్లను జీకాకుపడంగఁ జేసి భయదోల్లాసంబున న్మీఱు దై
త్యనికాయంబులమాటమాత్రమునఁ జక్రాగ్రంబునం ద్రుం
చు కృష్ణుని నోర్వంగలవాఁడవే కలన నేనుం గూడినన్
భూవరా! 74

మ. తనకాంతామణి సత్యభామకు వినోదక్రీడకై దేవలో
కనివాసం బగుపారిజాతము సురౌఘం బెల్లఁ గాపున్న చోఁ
గొని కృష్ణుం డరుగంగ నేఁ దొడరి తద్ఘోరాజి బెండొంది వీఁ
గినవాఁడ న్వినుమా నరేంద్ర, నిను రక్షింపంగ శక్తుండనే.

వ. అనిన నాచతుర్ధనుండు దేవా, దేవకీతనయుం డగుకృష్ణుండు
సురలోకంబునకు నేతెంచి పారిజాతం బేవిధంబునఁ దెచ్చె?
నయ్యవసరంబున నీకు నతనికి నేకై వడిఁ గయ్యం బయ్యె
నానతీయవలయుననిన నతని కమరేంద్రుం డిట్లనియె. 76

ఉ. ద్వారకలోనఁ గృష్ణుఁడు ముదంబున రాజ్యము సేయుచు
న్మనో, హారిణియైన రుక్మిణి గృహంబున నొక్కదినంబునందు
శృంగారరసంపుఁ గుప్పలనఁగాఁ దగు చంద్రముఖీసహస్ర

---

1 దొఱంగఁజేయవే.

ముల్, గోరిక గొల్వఁ దారకలలోని శశాంకునిఁ బోలియుం
డఁగన్. 77

వ. అయ్యవసరంబున బదరికాశ్రమవాసు లగుభరద్వాజకణ్వ
కశ్యపవసిష్ఠవామదేవాది మునీంద్రులు చనుదెంచి మొగ
సాలగడచి నిలిచి దౌవారికులచేతఁ దమరాక యవ్విభున
కెఱింగించి తదనుజ్ఞాపూర్వకంబుగా నాస్థానంబుఁ బ్రవే
శించి యమ్ముకుందునిచేత నుచితసత్కారంబులఁ బడసిసుఖా
సీనులై యుండ నద్దేవదేవుం డాగమనప్రయోజనం బడిగిన
నమ్మును లిట్లనిరి దేవా, నరకాసురుం డను దానవేంద్రుండు
ధరణీమండలంబునఁ గల రాజకన్యకలం గొనిచని కారా
గారంబున నిడి తక్కిన భువనంబులం గలంచుచున్నవాఁడు
గావున నతనిం బరిమార్చి సమస్తజనుల రక్షింపుము. 78

తే. అనిని దానవకోటి నుక్కడఁచి సాధు
జనులఁ గరుణదలిర్ప రక్షణ మొనర్చు
నీవ యక్కజను నరకు నేలఁగూల్చి
భువనములనెల్ల దయతోడఁ బ్రోవవలదె. 79

వ. అని విన్నవించిన యమ్మునిముఖ్యులపలుకు లంగీకరించి యని
పిన వారు నిజనివాసంబుల కరిగిరంత నరకాసురవధార్థంబు
ప్రయాణోన్ముఖుండై సత్యభామకు నెఱింగించి యయ్యం
గనాసమేతుండై గరుడారోహణంబు గావించి ప్రాగ్జ్యో
తిషపురంబు దఱియం జని. 80

ఉ. ఆపురరక్షకాసురుల నందఱఁ జక్రమునన్ హరించి యా
టోపముతో మురాసురుఁ గఠోరకరాసి నడంచి చాపవి
ద్యాపరుఁడై మదాంధునరకాసురుతోడ రణాంగణంబులో
నేపుదలిర్పఁబోరియొకయించుకకృష్ణుఁడుడస్సియున్నచోన్.

తే. సత్యభామ విరోధి యాశ్చర్యమందఁ
బోర నంతటఁ దెలిసి యప్పుండరీక
నయనుఁ డుద్దండచక్రంబున సురవైరి
శిరము ఖండించె దివిజులు చెంగలింప. 82

క. తదనంతరంబ తత్సం
పదతోడుత నతనియాఁక మగువగముల నిం
పొదవఁ గొని కుండలంబుల
నదితికి నీయంగఁ జనియె నమరావతికిన్. 83

తే వచ్చి సతితోడ నదితికి వందనంబుఁ
జేసి కుండలయుగళమిచ్చిన యనంత
రంబు నేనిల్ప నాకపురంబులోన
మూఁడుదినములు నిల్చె నమ్మురహరుండు. 84

తె. అంత నొకనాఁడు పౌలోమి యరిగి సత్య
భామఁ దోడ్తెచ్చి భూషణాంబరము లొసఁగి
మచ్చికలతోడఁ దేనియపిచ్చిలంగ
నుచిత సంభాషణము లాడుచున్న వేళ. 85

క. బృందారకుఁ డొక్కఁడు దా
నందనవనపారిజాతనవ్యకుసుమరా
జిం దెచ్చి మద్వ్యధూటికి
నందిచ్చిన సత్యభామ కందొకటయినన్. 86

తే. ఇడక యాలేమప్రేమ నుపేక్షసేయఁ
దానె కబరీభరంబునఁ దాల్చె దివ్య
గంధలుబ్ధ భ్రమద్భృంగగణవిచిత్ర
ఝంకృతులు దిక్కులను బ్రతిస్వనములీన. 87

వ. ఇట్లు ధరించి. 88

ఆ. మనుజకామినులకు విను దేవతాయోగ్య
వస్తువితతి యొసఁగ వలను గాదు
సత్యభామ, పారిజాతపుష్పంబులు
నీకు నీయరాదు నిక్కువంబు. 89

వ. అని పులోమజ శ్రీకృష్ణుప్రభావం బెఱుంగనిదై నోనాడిన
నాహరిప్రియ యచట నిల్వక తన విడిదికి నరిగి. 90

ఉ. ఈసును గోపము న్మదివహించి పులోమజ వేఁడిమాటకై
గాసిలి మేనసొమ్ముడిపి కన్నులఁ గ్రమ్మెడునీటఁ జందనం
బోసరిలంగఁజేసి శిరమొయ్యన వంచి కపోలపాళిపైఁ
జేసమకొల్పి యొక్కయెడఁ జింతిలుచుండెడునంతలోపలన్.

మ. హరియబ్బామినిఁ జేరవచ్చియను నీ వానందశూన్యాత్మవై
పరితాపంబునఁ బొంద నేమినెప మాపౌలోమి [1]కల్పించెఁ?
బెద్దఱికం బేమియుఁజేయదో యచటికాంతల్ నిన్ను నెగ్గా
డిరో?,హరిఁగన్నమ్మయు గారవింపదొకో నెయ్యం బొప్పఁగా
మానినీ! 92

చ. నరకునితోడఁ బోరునెడ నాకొక యించుక కేలుడస్సినన్
సుర లరుదంది నీవిధముఁ జూడ శరావలిచేత వైరితో
దుర మొనరించు సాహసము[2]దూఁకొని పైకొని కన్యకావళిం
బరిణయమాటకై పురికిఁ బంపినయందుకుఁ గోపగించితో.

ఉ. ఏమిటి కింతవంత తరళేక్షణ! చెప్పుమటన్న లేచి య
బ్భామిని చన్నుదోయిపయిఁ బయ్యెదకొంగు దలంగి జాఱ
నెమ్మో మరవాల్చి యూరుపుల ముంగరముత్యము గంద

1 గర్వించిపె. 2 తో విడిపించినకన్యకావళిం.

నేడి చెకాఁ,గోమల నూతనస్వరముఁగ్రోలుచు కోయిలపిల్లయో
యనన్. 94

తే. ఏడ్చి యాసత్య హరితోడ నింద్రుదేవి
పారిజాతమహీజపుష్పములనీయ
దయ్యె మానవకాంత నీవనుచు నన్ను
నేవగింపుచుఁ దానే వహించెననిన. 95

ఉ. ఆరమణీశిరోమణిఁ బ్రియంబునఁ గౌఁగిటఁజేర్చి కంటినీ
రారిచి చిక్కువడ్డకురు లల్లన కొప్పునదోపి యక్కునం
బేరులు చక్కదిద్ది వలిపెంబు చనుంగవఁ గేలఁగొల్పి యం
భోరుహపత్రలోచనుఁడు మోము గరంబున నెత్తి యిట్లనున్.

క. మానవసతివని నిన్నవ
మానముగావించి శచి సుమము లీదయ్యెం
గా నీకుఁ? బారిజాతం
బే నీయుద్యానవీథిఁ బెట్టెద ననుచున్. 97

చ. హరి పెకలించితెచ్చి విహగాధిపుపై నిడియె న్మదంబునన్
స్మరహరమౌళిచంద్రసహజాతము బంధురగంధలుబ్ధ ష
ట్చరణపరీతమున్ సతతసత్ఫలపోషితదేవజాతమున్
దరుణపలాశపుష్పసముదాయసమేతముఁ బారిజాతమున్.

వ. ఇట్లు పారిజాతం బపహరించి సత్యభామాసమేతుండై గరుడ
గరు దుద్ధూతవాతపరాభూతమేఘవ్రాతుండై చనునెడ.

శా. నావారందఱుఁ గూడి యొక్కమొగమై నానాస్త్రసంతాన
ముల్, వైవన్ వారల లెక్కఁబెట్టక ప్రభావస్ఫూర్తి శో
భిల్లఁగా, వేవేగంబున శంఖ మొత్తిన భయావిద్ధాత్ములై

పాఱి రే,నా వజ్రప్రతిమానబాణతతి నేయఁగ వ్యర్థమయ్యెం
దుదిన్. 100

క. ఏనలిగి మఱియు నేసితి
నా నగధరుమీఁద బంధురావని ధరసం
తానపత్త్రసమూహా త
మో నిర్వారణోగ్ర హేళి మును దంభోళిన్. 101

వ. అదియును విఫలంబైన నేనును నిజావాసంబునకుం జనితిం
గావున నమ్మహాత్మువలన నిన్ను రక్షింప శక్తుండఁ గానని
యంతర్ధానంబునొందిన నా చతుర్థనుండు. 102

సీ. కడు వేఁడినిట్టూర్పు లడరించి కొండొక
చింతించి చిత్తంబు చిక్కఁబట్టి
తనమంత్రమున బృహద్భాను భానుతనూజ
రాక్ష సాంబుప వాయు యక్ష ఫాల
నయనుల నాకర్షణం బొనరించి కృ
ష్ణప్రతిజ్ఞావిధానంబుఁ జెప్పి
తనుఁ గావుఁడంచు మోమున దైన్యమడరంగ
మ్రొక్క నీక్షించి వారును ముకుంద

తే. మహిమ మెఱిఁగినవారలై మానవేంద్రుఁ
గావలేమని చనిన నాతఁడమ పార్వ
తీమనోనాథు శివు మిహికామయూఖ
ఖండధరు శూలపాణి శంకరుఁ దలంప. 103

సీ. కటినమర్చినచేలఁ గన్గొన నీక్షించి
నెమ్మి భీతిలి వాహనమ్ము బెదర
వేయు మొగంబుల వింతఁజూపెడు తల
చుట్టుపై నెలవంక చుంగుగదల

నురము నిండిన పాపసరము పైఁ దలకొన్న
తోరంపుఁబునుకల పేరు లోరయ
మలఁచి పెట్టిన రత్నములఁ బోల్చు మేలి వీ
నులమించు కుండలంబులు చలింప

తే. నపుడు పొడచూప మ్రొక్కి పాదాంబుజములు
ఫాలమునఁ గీలుకొల్పి భూపాలకుండు
నన్నుఁ గృష్ణుండు చంపెద నన్న వాఁడు
గావుమన్న నాతనికి శంకరుఁడు పలికె. 104

క. క్షోణీశ్వర, వినుమే నీ
ప్రాణంబులు గావనోప హరివలనం; ద
ద్బాణసమిద్ధవిలాసము
బాణసమిద్ధరణిఁ గానఁబడినకతమునన్. 105

వ. అనిన దేవా యవ్వసుదేవనందనునకును మీకును గయ్యం
బైన తెఱం గెఱింగింపవే యనిన నా రాజశేఖరునకు నా
రాజశేఖరుం డిట్లని యానతిచ్చె. 106

తే. బాణుఁ డను బలిసుతుఁడు మద్భక్తవరుఁడు
దనకరంబులు సాహస్రతను జెలంగ
నసమవిక్రమశాలియై యతిశయిల్లి
శోణనగరంబు నేలు నక్షీణమహిమ. 107

వ. ఆ రక్కసులఱేఁ డొక్కకన్యం గని యుషయను పేరిడి
ప్రియంబునం బెనుప బాలచంద్రరేఖయుంబోలి దినదిన
ప్రవర్ధమానయై తల్లిదండ్రులకు నుల్లంబున నుల్లాసంబు
వెల్లిగొలుపుచుండె నంత. 108

శా. ఆరామామణి యొక్కనాఁడు దనహర్మ్యాగ్రంబునన్ హేమ
పీఠో,త్కారమ్యస్థలిఁ బువ్వుఁబానుపున బాల ల్పాదపద్మంబు
లొ,య్యారం బొప్పఁగ నొత్త మే నలఁతవాయ న్నిద్దురం
జెంది నా,నారాగంబులఁ గామినీజనము విన్నాణంబుగాఁ
బాడఁగన్. 109

తే. ఎన్నఁడును జూచి వినియును నెఱుఁగనట్టి
సూనసాయకుముద్దులసూనుఁడైన
ఘనునిఁ బెంపునఁ గలలోనఁ గాంచి సిగ్గు
లేల రతిసౌఖ్యమునఁ దేలి మేలుకాంచి. 110

చ. కలయనియంటినేని మదిగాసిలునే నిజమేని నాథుతోఁ
గలయిక లేకయుండునె జగన్నుతవీరుఁడు మారుఁ డీగతిన్
గలఁచఁ దలంచి మాయ యొడికంబుగఁ జేసెనొ కాక యీ
గతిన్, గలయును నిక్కముం గలసి కానఁగవచ్చునె ముజ్జ
గంబులన్. 111

చ. కనుఁగవ నీరు నించుఁ గరకంజము లల్లనమోడ్చి మ్రొక్కు
ముద్దునకును మోవిసాచుఁ జనుదోయి బయల్పడఁ గౌఁగి
లించుఁ బ్రక్కనఁ గరుణింపవే యను నొకానొకయప్పుడు
నవ్వు నేవి స,య్యన విడఁబాఱు మేనుగరుపాఱఁగ సీత్కృతి
నేయు నెంతయున్. 112

ఉ. ఏమిటి కింతయల్క? నిను నేమనిదూఱితిఁ బ్రాణనాథ? నీ
సామెయి దాననైతి మనసుదున నొండొక యడ్డపా టదే
లా మొగమిచ్చిచూచి మనసందలి నెవ్వ యడంచి నన్ను నీ
కాముని బారికప్పనముగా నొనరింపక బ్రాణమెత్తవే! 113

చ. అలయికఁ జెంది కన్నుఁగవ యల్లన మోడ్చిన నన్నుఁ జూచి నీ
వలరఁగ బుజ్జగింపఁగఁ బ్రియంబులఁ జెప్పక నవ్వె దేలమో
దలఁచితి కా చెలంగ జనితంబగు వెన్నెలచేత నా కనుం
గలువల మోడ్పు మాన్పు; మన కా పగ? కైరవబాంధ
వాననా! 114

చ. [2]తనువును జింతఁ గొల్పెడిని దర్పకుఁడుం దయమాలి నొంచఁ
గో, రెను [3]నిలుపోప కేమి యొనరింతును మిమ్మును నేను
గూడఁగాఁ, గొనకొని కప్పురంబు నొక గ్రుక్కెడు గొందు
నో? వేఁడి వెన్నెల, న్మునుఁగుదునో? ప్రసూనములముంచిన
పాన్పునఁ బవ్వళింతునో? 115

చ. అను బయలాలకించు హృదయంబునఁ బాయని నాథుఁ
జూడఁగాఁ, గనుఁగవమూయ మ్రోలఁ బొడగానఁగ
వచ్చినయట్టులైనఁ గ్ర,క్కునఁ జని పట్టఁ జూచుఁ బొడగానక
కన్నుల నీరునించు లో, ననిచిన యట్టికూరిమి ఘనంబగు
మారునిబారి కగ్గమై. 116

ఉ. హారము భారమై మణిగణాకరబంధురసౌధరంగసం
చారము దూరమై తనువు సంగతినొప్పెడు చందనాదిశృం
గారము క్రూరమై చెలియకై వడి నెమ్మియొనర్చునట్టి రా
కీరము వైరమై నిగిడెఁ గేసరిమధ్యకు నొక్కపెట్టునన్. 117

వ. ఇవ్విధంబున నవ్విలాసిని [4]యవ్వలరాచవారిపువ్వులవింటి
నారి కగ్గమై. 118

---

1 అలుకబు. 2 తనువున వింతఁ గొల్పెడిని. 3 నిలనోప నేమి యొన
రింతును. 4 యవ్వలరాజు పువ్వులవింటినారి.

చ. శిర మొకయింత వంచి వెతఁజెంది కపోలమునందు హస్త
పంకరుహంబుఁ జేర్చి యూరుపులకాఁకల చేతఁ గరంగునట్టి
ముం,గరఁ గనుదోయి నీట నొడికంబుగ నార్చుచుఁ గొప్పు
జాఱఁగాఁ, జరణసరోరుహంబున రసాస్థలి వ్రాయుచు
నూరకుండినన్. 119

వ. అయ్యవసరంబున నలికజితశీతమయూఖరేఖ యగుచిత్ర
రేఖ యనుతత్ప్రియసఖి పంచబాణదోదూయమాన మానస
యగునమ్మానినిఁ జేరం జని యిట్లనియె. 120

తే. నీమనంబునఁ దగిలిన నెవ్వయొల్లఁ
బలుకు నాతోడ నాతోడు పద్మనేత్ర!
దాఁచనేటికి నెనరుగాదా, భవన్మ
నంబు సంతసపెట్టెద నమ్ము మబల! 121

తే. మఱియు నొక్కవిధంబు రామా! యెఱుంగఁ
జెప్పెద విరహవేదనఁ జెందువారిఁ
గావఁజుండో యటంచు నాకాయజుండు
దిరుగుచున్నాఁడు వలపులదిమ్మె కాఁడు. 122

వ. అని చెప్పిన నప్పయోజముఖి యక్కప్పురగంది కిట్లనియె.

క. సుకుమారతనుఁడు నభినవ
మకరాంకుఁడు చంద్రసముఁడు మానవతీరం
జకుఁడగు నొక్కఁడు ననుఁ గలఁ
జికురంబుల దిద్ది కళలచేఁ గరఁగించెన్. 124

క. ఆ రాకొమరుని నన్నుం
గూరిచినఁ బ్రతుకుదానఁ గువలయనేత్రా!

నారీతిగొల్లఁ జెప్పితిఁ
బోరామి దలంచి నీకు బొంకక యనినన్. 125

వ. ఆ చిత్రరేఖ యిట్లనియె. 126

ఆ. గణనకెక్కిన మూఁడులోకములవారిఁ
జిత్రపటమున వ్రాసి రాజీవపత్ర
నేత్ర, నీమ్రోలనిడుదు నానేర్పుమెఱయ
నందు నీపతిఁ జూపు నే నతనిఁ దెత్తు. 127

వ. అని తదనుమతి నొక్కయేకాంతస్థలమున కరిగి యా కాంతా
మణి ముల్లోకంబులయందుం బేరుగల రాకుమారుల వ్రాసి
తెచ్చి యమ్ముద్దియముందటం బెట్టి. 128

తే. స్వర్గలోకంబు దేవతావరులఁ జూపి
యురగలోకంబు పన్నగేశ్వరులఁ జూపి
మధ్యలోకంబు భూపాలమండలంబుఁ
జూపుచోఁ గృష్ణపౌత్త్రునిఁ జూపె నంత. 129

తే. సిగ్గుతోఁగూడఁ బులకలు చెంగలించె
నవ్వుతోఁగూడఁ జెమట యాననము నిండె
సంతసముతోడ గద్గదస్వరము నిగిడెఁ
గామినీమణి యాతనిఁ గాంచినపుడ. 130

క. ఆసన్న యెఱిఁగి బాణాసు
తాసఖి యాకృష్ణపౌత్త్రుఁ దననేర్పున సం
తోసంబు దనర మృదువా
చాసంపద నిట్టులనియె జగతీనాథా! 131

క. వనితా, యీతఁడు కృష్ణుని
మనుమఁడు ప్రద్యుమ్నునికిఁ గుమారుఁడు నామం

బున ననిరుద్ధుఁడు సంగర
మున ననిరుద్ధుండు రూపమున గుహుఁ డీతఁడే. 132

వ. అని చెప్పిన. 133

తె. కలకలను నవ్వి యా కలకంఠి కలర
వమునఁ దన ప్రాణసఖి గారవమునఁ బలికెఁ
బలుకుపలుకునఁ గపురంపుఁ బలుకులొలుకఁ
దేనియలుచిల్క మానంబులోనఁ దేలఁగ. 134

తే. అంబుజానన యెంతగయ్యాళి వాఁడె
చేయి నన్నింత చేసి కూరిమిఁ ఘటించి
పెక్కుభంగుల నాతోడఁ బెనఁగి యిప్పు
డూరకున్నాఁడు ముగ్ధుఁడో కో యనంగ. 135

వ. కావునఁ జెలియా నామీఁది మక్కువంబు నీమనంబునం
గలిగెనేని నన్ను మారుని బారికి నొప్పనంబుచేయక యప్పం
చబాణునికుమారునింగూర్చి కూర్చినతనంబున వీఁడుమని
చెప్పిన నప్పొలంతుక యనుమతి నప్పుడ యప్పడంతుక
మనోవేగంబునం ద్వారకానగరంబున కరిగి నిజరమ్య
హర్మ్యమధ్యకాంచనప్రేంఖోళికాకుసుమశయ్యాతలంబునఁ
బ్రియారతిశ్రమసుఖనిద్రాముకుళితనయనుండగు ననిరుద్ధుం
దనమాయాబలంబు పెంపున మేలుకొనకయుండఁ దెచ్చి
నెచ్చెలియగు నయ్యుషాతల్పంబునఁ బెట్టిన. 136

ఆ. ఆ సరసిజనేత్ర యధికసంభ్రమమునఁ
జిత్రరేఖఁ దన విచిత్రవాక్య
ఫణితి వినుతిచేసి ప్రాణవల్లభు నని
రుద్ధుఁ జూచెఁ జంద్రరుచిరముఖుని. 137

వ. అయ్యవసరంబున ననిరుద్ధుండు మేలుకాంచి వింతలై తోఁచు కాంతాజనహర్మ్యశయ్యాతలంబులఁ జూచి కలయో యథార్థంబో యని చింతించి ముందటనున్న చిత్రరేఖం గనుంగొని. 138

క. తరుణీ, నీవెవ్వతె వి
ప్పురి యేరిది? నన్నుఁ దెచ్చువూనికి యేమి
త్తటి నన నాతనికి సవి
స్తరతఁ దెలిపి యేలుమని యుషాసతిఁ జూపెన్. 139

చ. కురులు మొగంబునన్ జెదరఁ గ్రొమ్ముడి యించుకవీడఁ జెక్కు
లన్,జిఱునగవుల్ దొలంక మృదుచేలము జాఱఁగఁ గన్ను
దోయి గ్రొ,మ్మెఱుఁగులుచింద నెచ్చెలియమేను గరంబున
నూఁది నిక్కి త,త్తఱమును వేడ్కయుం [1]బెనఁగఁ దన్నను
కామినిఁ జూచె నత్తఱిన్. 140

క. తరుణీతరుణులు దా రొం
డొరుల మొఱఁగి చూచుచూపు లోనరె న్మరుఁ డి
ద్దఱపై నిగిడించు మనో
హరకువలయమల్లికామహాశుగములనన్. 141

ఆ. చిత్రరేఖ యర్ధశీతాంశురేఖాల
లాట కన్నె తెంగి బోటిపిండుఁ
దోడుకొనుచు నేగె మేడవెల్వడి వారి
తలఁపుతోడఁ దలుపు దారుకొలిపి. 142

వ. అంత. 143

1 బెనఁగ దండను గామినిఁ జూచె నత్తఱిన్.

క. అందంపుఁ బోడిమ తేపకము
ముందటికిం బిగువ సిగ్గు మునుకొని నిలుపం
డెంద మురియాడ నిలిచిన
సుందరమణిఁ జూచి మారికుమారసుతుండున్. 144

చ. తలఁపునఁ దత్తఱంబొదవఁ దత్కరపద్మము కేలనంటినన్
గులికి నవవధూటి కంకణపుమోజ్ఞవినాదముమీఱ వెండియున్
వలపులఁ జేనిక్కి సగువా తగవాయన నూరకుండె నా
కలికి సరోరుహాక్షి చిఱునవ్వులు చెప్పల నప్పళింపుచున్.

తే. అంగుళీయకసౌభాగ్య మరసిమాను
వానికై వడిఁ గరపల్లవంబు కేల
నంటి యల్లన నాకుసుమాస్త్రతనయుఁ
డా వధూమణిఁ జేర్చె శయ్యాతలంబు. 146

వ. తదనంతరంబ. 147

సీ. క్రొవ్విరుల్ బాగుగాఁ గొప్పునఁ జెరివెదు
నెడమునఁ దలపైని నెరులు ముడిచి
కస్తూరిపత్త్రభంగములు దీరుచులీలఁ
గరుపాఱ గండయుగ్మంబు పుణికి
పేరులు చక్కఁగాఁ బెట్టెడుమిషమునఁ
జిన్నిగుబ్బలు గోరఁ జివుకఁ జేసి
చేరంగఁ దిగిచి మచ్చికమాటలాడువై
ఖరి గళరవము చొక్కముగఁ జిల్క

తే. కప్పురవుఁబల్కుఁ గోఱికించుకపటమునను
దక్కకుండంద యధరామృతంబు [1]పీల్చి

1 గ్రోలి.

పాకవశ్యంబు నొందించి వారిజాక్షి
కేళి రతిసౌఖ్యజలధిలో నోలలార్చె. 148

వ. ఇత్తెఱంగున నత్యంతసంతోషంబున నుద్యానవనవిహారంబు
లను జలక్రీడావినోదంబులం గపటద్యూతంబులఁ బ్రొద్దు
గడుపుచునుండె నంతట. 149

చ. కలసతతోడఁ గాను ఘనమయ్యెఁ దనూపహ రాజితోడఁ
జన్నులు నలువెక్కెఁ జొక్కపుఁ గనుంగవతోడుత నంత
నంతఁ జెక్కులు తెలుపొందె నిక్కముగఁ గోరిక లిరిక లెత్తె
మట్టితోఁ, బులుసుపయిం బ్రియం బొదవె బోటికి గర్భము
నిల్చె నంతటన్. 150

వ. ఇవ్విధంబున నయ్యుశాకన్యక గర్భంబువాల్పుట మెఱింగి
యమ్ముద్దియముదుసళ్లు విచారించి మాళ్ళుర్యంబు నొంది
వందురి తద్దయు భయంబునం జెంది రయంబున బాణుని
యొద్దకు నేతెంచి యేకాంతంబున నిట్లనిరి. 151

క. బానునికరములకుఁ హిమ
భానునికరములకు మందపవనునకుఁ జొరఁ
రానిభవద్గృహమున ర
క్షోనాయక యుషకు నిపుడు చూలేర్పడియెన్. 152

తే. అని యెఱింగించి రంత నత్యంతరోష
కలుషితమనస్కుఁడై యాత్మకరసహస్ర
శస్త్రములు మంట లుమియఁ దక్షణము బాణుఁ
డాయుషాభర్త్స్యహర్మ్యంబు డాయ నరిగి. 153

చ. అలసతతోడ నెన్నొసలనంటిన లత్తుకబొట్టుతోడఁ జె
క్కులఁ గనుపట్టు క్రొన్నెలల గుంపులతోఁ బొలయల్క

కాఁకలం, దులదుల రాలుచందనముతోడ నొయ్యారపురీతి
నిడ్డ కుంతలములతోడ నింపెసఁగు దర్పకసంపదనుఁ జూచె
నత్తఱిన్. 154

మ. కని భీమంబుగ బెట్టదల్చి చటులోగ్రస్ఫూర్తితో నార్చి య
ద్దనుజేంద్రుం డరుదేరఁ జూచి కుసుమాస్త్రప్రోద్భవుండు
న్వడిన్, ఘనబాణాసనపాణియై యెదిరి రక్షస్సార్వభౌముఁ గా
మహా, శనికల్పాశుగకోటినేసి పటురోషం బెచ్చఁగా
నార్చినన్. 155

వ. అయ్యవసరంబున నా రాక్షసేశ్వరుండు నక్కుసుమసాయక
సంభవుం డగు ననిరుద్ధుం డేసినయాశుగంబులు నడుమన
ఖండంబులై పుడమిం బడునట్లుగా నొనరించె నంత నొం
డొరులు దమయిచ్చల విచ్చలవిడిఁ బెచ్చు పెరుఁగుమచ్చ
రంబునం బోరుచుండి రందు. 156

ఉ. ఆదనుజాధినాథుఁడు భయంకరై ఖరిఁ జేరిపోరి బా
ణాదిసమస్తసాధనవిహారము సల్పుచు బాలికామనః
ఖేదము దైత్యమోదమును గీడ్పడఁ బన్నగపాశరాజిచే
రోదసి ప్రేలనార్చి యనిరుద్ధుని బద్ధునిఁ జేసె నుద్ధతిన్. 157

వ. తదనంతరంబ. 158

క. ఈవార్త నారదుఁడు చని
యావిష్ణుని కెఱుఁగఁజెప్ప నతఁడును ఘనసై
న్యావళులతోడ నగ్రజు
తో వేగముతోడ వచ్చె దుర్వారగతిన్. 159

వ. ఇట్లు వచ్చిన. 160

ఉ. సూదపురెల్లఁ గబ్బుమెఱయన్ బలినందనుపట్టణంబు ప్రా
సాదములెల్లఁ గూల్చి వనసంఘము నుగ్గుగఁ జేసి గోపుర
క్షోద మొనర్చి యున్నతపుఁగోటలు ద్రొబ్బి సమస్తదేవతా
హ్లాదముగాఁగ దోర్బలవిలాసముఁ జూపిరి దైత్యనాథుఁడున్.

క. తనబలముతోడఁ గూడన్
నను సన్నుతిఁ జేసిపిల్చిన న్వచ్చితి నే
నును నాగణములతోఁ గృ
ష్ణునిరణపాండిత్యమహిమఁ జూడ నరేంద్రా. 162

ఉ. మారుఁ డుమాకుమారుఁడును మాధవుఁ డేనును సీర
పాణియున్, ధీరుఁడు రూపకర్ణుఁడు శినిప్రవరుండు గజా
స్యుఁడున్ రణోద్ధారబలుల్ప్రమాతులుఁ బ్రమాతులుఁ దల్పడి
యొండొరుల్ మహాశూరత నప్డు పోరితిమి చోద్యము
నొంది సురల్ గనుంగొనన్. 163

వ. అప్పుడు. 164

క. హరిబలముచేత బలముం
హరిచే మద్బాహుసత్త్వ మడఁగియు బాణా
సురుఁడు గడుభక్తిఁ దగుటన్
బోరిఁబోరిఁ బోరితిమి కోపమున మనుజేంద్రా. 165

వ. తదనంతరంబు బాణుం డక్షీణబలుండై సాక్షాద్విష్ణుం డగు
కృష్ణునితోఁ దలపడిన సంగ్రామంబు భీమంబయ్యె నంత
నా కృష్ణుండు దన చక్రధారచే విచిత్రంబుగ నబ్బాణుని
బాహుశాఖలు వేయియు మొదలంట నఱికి మోడువఱ
చిన నస్మత్పూజార్థంబు కరంబరుదుగా రెండుకరంబు లిప్పిం
చితి నంత నబ్బలితనయు సంభావించి యుషాసమేతుం డగు
ననిరుద్ధుం దోడుకొని సకలబలంబులు గొలువ ద్వారకానగ

రంబున కరిగెం గావునఁ గృష్ణునివలన నిన్ను రక్షింపరాదని యప్పరమేశ్వరుండు ప్రమథగణంబులు గొలువఁ గైలాసంబునకుం జనిన. 166

ఆ. ఆచతుర్థనుండు నత్యంత భయవిహ్వ
లాత్ముఁ డగుచుఁ జేయునదియు లేక
యతివిచారబుద్ధి నాహారనిద్రావి
హారసౌఖ్యములకు దూరుఁ డగుచు. 167

వ. కొండొకచింతించి కమలగర్భు నారాధించిన. 168

సీ. పాలునీరును నేరుపఱుపఁజాలినయట్టి
పులుఁగుబాబా మింటఁ బుటము ¹గులుకఁ
బసిఁడివన్నియమించు పైమించుతళుకులు
బాలాతపప్రభ గేలిబెట్ట
ముఖసీరజమున సమ్మోదమ్ముతో నిల్చి
పలుకులబోటి విభ్రమము నెఱప
సకలలోకములకు జననకారణమైన
తనదుచిత్తము గృప నసఁగి పెనఁగ

తే. సర్వదివిజులు దిక్పతుల్ సన్మునులును
గొలువఁ దన్మంత్రమహిమంబుఁ దలఁప నరిది
గాఁగ నాకంజగర్భుండు కడురయమున
వచ్చి యానరనాయకువద్ద నిలిచె. 169

వ. ఇవ్విధంబునఁ బ్రత్యక్షంబైన యవ్వేలుపుపెద్దం గనుంగొని యతండు ప్రణామంబాచరించి యంజలిపుటంబు ఘటించి యిట్లని విన్నవించె. 170

1 లులుక.

చ. జలరుహగర్భ నన్ను మురశాసనుఁ డూరక వైరమెత్తి క
ట్టలుక హరింపఁ బూనె నది యమ్ముపిధంబున నెష్మనంబులో
పల మెఱుఁగంగ నీచరణపద్మములక్ శరణంబుఁ జొచ్చితిక్
గలఁక యణంచి కావుము జగన్నుతకీర్తులుమిన్నుముట్టఁగన్.
వ. అనిన వాణీవల్లభుండు శ్రీవాణీవల్లభున కిట్లనియె. 172
సీ. పురుడువెళ్లకమున్న పూతనవిషదిగ్ధ
కుచదుగ్ధములనెల్లఁ గ్రోలి చంపెఁ
బసిబాలుఁ డగునాఁడ బండిరూపము దైత్య
వీరునిఁ గసులకు విఱుగఁదన్నె
నేఁడాదిప్రాయంబువాఁడై రయంబున
నెరయఁ దృణావర్తు నెలమిఁగూల్చె
నడిచి యాడెడునాఁడ కడునద్భుతంబుగా
లీలమై మద్దుల నేలఁ గలిపె
తే. బకునిఁ జెండాడె [1]వత్సకు బారి సమరెఁ
జిలువ యైయున్న దానవుఁ బిలుకుమార్చె
[2]బాలవత్సాపహారు నన్ను భంగపఱచె
మనుజమాత్రుండె కృష్ణుండు మానవేంద్ర. 173
క. అనవుడు నమ్మనుజేంద్రుఁడు
వనజాసనుతోడ ననియె వాణీశ, నినుం
గను బ్రాహ్మనతఁడు చాలెనె
యనవుడు నాతనికిఁ దెలియ నతఁ డిట్లనియెన్. 174
సీ. ధరణీశ, యొక్కనాఁ డరుదుగాఁ గృష్ణుండు
దనతోడి గోపనందనులఁ గూడి

1 వత్సునిఁ. 2 బాలవత్సాపహరుఁడయి.

బృందావనంబునఁ గ్రేపుల మేపుచు
నాఁకొని చల్ది జలాశయంబు
దరిఁ [1]జేరి వాండ్రతోఁ దా నారగింపఁగ
నేగఁ దన్మహిమంబు నే నెఱుంగఁ
దలఁచి బాలురవత్సములఁ దలఁగింప నా
కృష్ణుఁ డవ్విధము నెఱిఁగియుఁ దాన

తే. కొమరులును లేఁగలును నయి గొల్లగుబ్బె
తలకు నాలకు ముద్దుగాఁ దనర నొక్క
వత్సరం బగునంత నే వచ్చినం జ
తుర్భుజాకృతితో నాకుఁ దోఁచె మఱియు. 175

తే. బాలవత్సకములయందుఁ బార్థివేంద్ర
శంఖకౌమోదకీచక్రశార్ఙ్గకరుఁడు
కౌస్తుభోరస్కుఁడును నీలకాంతితనుఁడు
నగుచుఁ బొడకట్టె నేనంత నమ్మహాత్ము. 176

క. చరణమ్ముల కెరఁగితి మ
చ్ఛిరములు దద్రేణుపటలిచేఁ బూతములై
పరగఁగ నానందాశ్రులు
గురియఁగ నాదేవుకడ ముకుళితకరుఁడనై. 177

మ. శివ సర్వాత్మక వాసుదేవ హరి రాజీవాక్ష గోవింద మా
ధవ దామోదర యజ్ఞభోక్త జగదాధారా ప్రపంచాత్మ
దా,నవ సంహారక చక్రపాణి మునివంద్యా బ్రహ్మ వైకుంఠ
కృ,ష్ణ విరాజధ్వజ యాదవేంద్ర సుగుణా నారాయణా
భూధరా 178

1 జెలిశా.

క. అని సన్నుతించి కృష్ణున
కును నే దొంగిలిన బాలకులఁ గ్రేపులఁ గ్ర
క్కున నిచ్చితి నది గావున
ననఘా నినుఁ గావనోపనని యజుఁ డరిగెన్. 179

వ. తదనంతరంబ. 180

తే. నిఖలరాజ్యంబు పాలించు నేర్పులుడిగి
దొరల నుపలాలనము సేయు వెరవుమాని
యంబుజాక్షులతోడి సయ్యాటమెడలి
యానృపాలుండు భీతి నిట్లని తలంచె. 181

ఆ హరి ప్రతిజ్ఞఁజేసె శరములచేనొండెఁ
జక్రధారనొండె సంగరమున
నొక్కమాసమున మహోద్ధతి ననుఁ జంప
నందుఁ గొన్ని దినము లరిగె నిపుడు. 182

వ. అని బహుప్రకారంబులఁ బరితాపంబునం బొరలు చతుర్దను
సమ్ముఖంబున నొక్కభిల్లుం డరుదెంచి కేలుమొగిడ్చి. 183

క. జనవర మన పొలముల క
ర్జునుఁడు మృగయసమితితో నరుగుదెంచినవాఁ
డని విన్నవింప సంతస
మునఁ జెంది యతఁడును జిత్తమున నిట్లనియెన్. 184

క. కాయమునకుఁ బ్రాణములకు
నేయక్కఱ యట్టిచెలిమి యే నరునకుఁ బ
ద్మాయతలోచనునకు నే
నేయనువున మొఱఁగి యతని కిది యొఱఁగింతున్. 185

వ. అని కొంతదడవు చింతించి శౌరిపేరు నుడువక శరణు
వేఁడెద నని తలంచి చంచు నిరూపితమార్గంబున నరిగి. 186

క. కనుఁగొనియె నా చతుర్ధన
మనుజాధీశ్వరుఁడు శూరు మందరధీరున్
ఘనతరకీర్తివిహారున్
వననిధిగంభీరు జంభవైరికుమారున్. 187

తే. కని మనంబున భయభక్తు లనఁగి పెనఁగఁ
గానుకలు ప్రోలఁ జాలుపుగా నమర్చి
చక్కఁ జాగిలి మ్రొక్కి హస్తములు మొగిచి
వినయమున వాని కిట్లని విన్నవించె. 188

క. మిన్నక బలియుఁ డొకఁడు నను
మన్నిగొనంబూని మెఱయ మన మెరియఁగ నా
పన్నశరణ్యుఁడవని నీ
మన్ననఁగన వచ్చినాఁడ మనుపుము నన్నున్. 189

తే. అనుచుఁ గ్రమ్మఱ మ్రొక్కి యజ్జనవిభుండు
లేవకుండిన హస్తరాజీవమున న
తనిఁ బ్రియమ్మున నెత్తి యర్జునుఁడు పలికె
నినుఁ బ్రియంబునఁ గాచెద ననుచు మఱియు. 190

మ. మనుజాధీశులఁ జెప్ప నేల సకలామర్త్యుల్ దగన్ రేఁచి వ
చ్చిన శ్రీకృష్ణునిపాదమాన నిను రక్షింతున్ భయం బెద్ది
న్నమ్ము నరేంద్రా విను మత్ప్రతిజ్ఞ భువనంబుల్ సాక్షిగాఁ
గావకుం,డిన మన్మార్గ్గము నాదు నిష్ఠురకృపాణిం ద్రెంచు
కొందున్వడిన్. 191

వ. అని యాచతుర్థనుమనంబున నమ్మిక లొదవ బ్రసన్నుఁగా ఘోర
ప్రతిజ్ఞఁ జేసి యనంతరంబ కృష్ణుం దోడరి యతండును
దానును ననేకాక్షౌహిణీబలంబులతోడ రణంబుఁ జేసి
యతని చక్రధారచే ధర్మనందనుం డొక్కరుండునుం
దక్క నందఱు సమసి క్రమ్మఱఁ దత్కరుణాకటాక్షంబున
బ్రతికితిమని కలగాంచి యదరిపడి లేచి యప్పార్థుం డప్పాత్రి
వున కిట్లనియె. 192

సీ. ఎవ్వఁడు నీకు వైరి కత మెయ్యది నీమీఁద వైరమెత్తి నీ
కెవ్విధి భీతిపుట్టె నెవమేమి సమస్తము చెప్పుమన్న వాఁ
డవ్విధమెల్లఁ దెల్పుటకునై కిరయుగ్మము మోడ్చినక్తై నా
కవ్వడితోడుతం దన మొగంబున దీనత యంకురింపఁగన్.

తే. కాననంబున నేఁ దురంగంబుఁ గాంచి
దానినెక్కిన నతివిచిత్రంబుగాఁగ
దివ్యలోకంబులకు నేగి తీవ్ర మెసఁగ
మగిడి ఫల్గున, యాకాశమార్గమునను. 194

తే. యమునమీఁద వెడలి యరుదేర నత్తురం
గాస్య ఫేన మంబుజాతుహస్త
జలములోనఁ బడిన నలిగి యాతఁడు నన్నుఁ
జంపఁబూనె నెలకుఁ జక్రమునను. 195

క. అది కారణమున భీతిం
గదిసిన డెందంబుతోడఁ గమలోద్భవ రు
ద్ర దిగీశులఁ గావుఁ డనిన
నది దమచేఁ గాదటంచు నరిగిరి యంతన్. 196

వ. దురంతచింతాక్రాంతస్వాంతుండనై యుండి మద్భాగ్యవశం
బునఁ జింతాసముద్రంబు నీకరుణాకటాక్షంబను నావచేఁ
దరింపఁగంటి మంటినని విన్నవించిన. 197

ఉ. ఆనరనాథువాక్యము భయంకరమై తనవీనులందు ను
గ్రానలకీల సోఁకిన క్రియం బరితాపము నొందఁజేయఁ గ
న్గోనల నశ్రు లుప్పతిల గుండెలు జల్లన వెచ్చనూర్చుచు
న్మానసవీథిఁ జింతిలుచు మ్రాన్పడియుండె నరుండు దుఃఖియై.

వ. ఇవ్విధంబునం గొంతదడవు చింతించి తనలో నిట్లని విత
ర్కించె. 199

ఆ. ఏమి చేయువాఁడ నిట్టి దుస్సంధికి
నేటి కేగుదెంచి తీ పొలమున
కేడనుండి వచ్చె నీనృపుఁ డిచటికి
వీనిఁ గావ నేల పూని తిపుడు. 200

మ. మునుపే యాతఁడు కృష్ణుపేర్మి డివినఁ మోసంబునుం
జెంద కే,మనుదుం దద్విభుతో రణాంగణమునఁ మార్కొలుఁ
గల్పించె నే, మనుదుఁ దైవము మాకు నెల్లఁ దనువుఁ
ప్రాణంబులుఁ రక్షకుం,డును నెయ్యుండును దేశికుండు
నలకృష్ణుండే కదా చూచినన్. 201

తే. అట్టి పరమాత్ముతోడ నే ననియొనర్చు
టెట్లు దేహంబుతోఁడఁ జయించుటెట్టు
లీ ధరాధిపుఁ గాపాడుటెట్లు దీని
కేమిచేయుదు నిందఱ కేది గతియొ. 202

సీ. [1]బ్రహ్మదేవునియంత వాఁడును వనభూమి
మాయ సేయఁగఁబోయి మాయఁబడియె
వామదేవునియంతవాఁడును నిజభక్తుఁ
గాపాడఁబోయి దా గాసిఁబడియె
వరుణునియంతటివాఁడును నిజభటా
నీతార్భకు నొసంగి నిలిచి పొగడె
వాసవు నంతటివాఁడును సంగర
స్థలమున నెదిరించి [2]చాలఁ దూలె
తే. మఱియుఁ దక్కటి రిపువీరమండలంబు,
పిలుకుమారె సరోజాక్షు పెంపుచేత
నరుఁడ నాకథ యెంత భండనమునందు
నిలువఁగలనే, యటంచు వెండియు నతండు. 203

వ. తనమనంబున నిట్లని వితర్కించె. 204

క. తనతనువు నిలుపుకంటెన్
దనమాట నిజంబుఁ జేయఁదగు ధీరులకున్

1 వనరుహోద్భవునంతవాఁడు బాలకవత్స
ముల దాఁచి తనయంత మోసపోయె;
వాసవునంతటివాఁడును సంగర
స్థలమున నెదిరించి ధరణిఁగూలె;
వేఁడిచూపఱియంతవాఁడు బాణాసుర
యుద్ధంబులోపల నోసరిల్లె;
వసుధాసుతునియంతవాఁడును సంగర
స్థలమున నెదిరించి ధరణిఁగూలె.

2 ధరణిఁ దూలె.

దనపలుకు నిలిపి సురలకుఁ
దనువొసఁగి దధీచి కీర్తిధన్యుఁడు గాఁడే. 205

క. శరణాగతుఁ డగువానిఁ
గరుణం దనువైన నిచ్చి కావఁగఁ దగుభూ
వరునకుఁ బక్షికినై తన
శరీరమాంసంబు శిబి యొసంగఁడె కరుణన్. 206

క. జీమూతవాహనుం డొక
పామునకై విహగపతికిఁ బ్రాణములీఁడే
యామాట సూర్యచంద్రులు
భూమియుఁ గలకాలమును విబుధులుఁ బొగడఁగన్. 207

క. శరణా[1]తు గాచిన భూ
వరుఁడు తురగమేధయాగవర్గముఁ బుణ్యం
బరుదుగఁ జేకొనలేడా
నరకమునం[2]గూలి వేదనలఁబడు నెపుడున్. 208

క. కావున శరణాగతునిఁ
భూవరుఁ గాచెదను సమరభూమిని హరిచేఁ
జావైన లెస్స యటుగా
దా విజయంబైన మిగుల ధన్యతగాదే. 209

క. తాతకును ధర్మసూతికి
నీతెఱఁ గెఱుఁగంగఁ జెప్పి యేనును వారిం
జేతనగుకొలఁదిఁ బెనఁగెద
మాతల [3]మటి దైవ మున్నదని యాతనితోన్. 210

---

1 శరక్షకు. 2 గూడి. 3 నున్నాఁడు దైవ మని యాతనితోఁ.

క. అనఘా యిప్పుడు నీపుర
మునకు నరిగి నీదుసైన్యములఁగూడి రయం
బున రమ్మని పంపి సురేం
ద్రనందనుం డపుడు తనపురమ్మున కరిగెన్. 211

వ. ఇట్లర్జునుం డరిగినయనంతరంబ యాచతుర్థనజననాయకుండు మనంబున సంతోషంబునొంది నిజరాజధాని యైనకుండిన నగరంబున కరుగుదెంచి కతిపయదినంబులుండి చతురంగ బలసమేతుండై యమరావతీపురంబునుంబోలిన యింద్రప్రస్థపురంబునకుఁ జనుదెంచి యందు. 212

చ. అనిలతనూభవుండు దివిజాధిపనందనుఁడుం గవల్ ముదం
బునఁ గొలువన్ మణిప్రకరభూషితసౌధమునందుఁ గామినీ
జనమృదుహస్తసంకలితచామరవీజనజాతవాతపో
తనికరలోలకుంతలుని ధర్మతనూజునిఁ గాంచె వేడుకన్.

ఆ. కని యుపాయనంబుగా మత్తకరులు మ
ణులు మృగేక్షణామణులుఁ దురంగ
రత్నములు సువర్ణరాసులుఁ బ్రేమ స
మర్పణంబుచేయ నతఁడు మెచ్చి. 214

క. ఆనరనాయకునకు స
న్మానం బొనరించి నవ్యమణిపీఠిక నా
సీనుం జేసి సురేశ్వర
సూనుని దెసఁ జూచి ధర్మజుఁడు గనుసన్నన్. 215

తే. ఈతఁ డేభూవిభుండు పేరేమి యిటకు
రాఁ బ్రయోజనమేమిది క్రమము తోడఁ
దెలియఁజెప్పుమటన్న నా దేవరాజ
తనయుఁ డిట్లని పల్కె హస్తములు మొగిచి. 216

చ. అనఘ వరేణ్య కుండినపురాధిపుఁ డీతఁడు పేరిటన్ జతు
ష్టనుఁ దమనాతఁ డేను మృగరాజి వనంబునఁ గ వేఁటఁబోయి
యుం,డ నదటికేఁగుదెంచి కకటంబునఁ బల్కెను సర్వరోధి
రొ,క్కఁడు నృపుఁడు చండుఁ డాయెఁ దగఁ గావు మటంచు మహాత్మ
తోడుతన్. 217

తే. శరణుఁ జొచ్చినవారి రక్షణము సేయ
వలయు శిష్టులకని మదిఁ దలఁచి కావఁ
బ్రతిన సేసితిఁ దదనంతరంబ శౌరి
వైరి యని చెప్ప నీతండు వసుమతీశ. 218

క. శ్రీవిభునితోడి వైరము
భూవర ప్రాణంబు గాచు పూనికయును నా
కేవరపునఁ గూడెదునని
దేవర రక్షింప నరుగుదెంచితి భీతిన్. 219

తే. నా ప్రతిజ్ఞయు నితని ప్రాణములుఁ గావ
నేఁడె తెరవు గనుట్టి దూహించు మనుచుఁ
బాదములమీఁద వ్రాలు నప్పార్థుఁ జేరఁ
బిగిచి యెత్తని పల్కె యుధిష్ఠిరుండు. 220

మ. సకలోపాయవిశారదుండు నయశాస్త్రప్రౌఢుఁ డాయోధ
నో,త్సుకుఁ డుద్దండవిరోధిసంహరణదక్షుం డుగ్రశస్త్రాస్త్ర
జా,లకళావేది గిరీంద్రధీరుఁడు సదోల్లాసాత్ము పంకేరుహాం
దకలంకుం డగుకృష్ణుఁ డోర్వ నజదుర్గాధీశులున్ శక్తులే.

క. పోసి శరణాగతికై
మేనులు హరి కోసఁగి కీర్తిమించి సురేంద్ర
శ్రీ నెగడెద మిది విడిచిన
హీనపుబ్రతుకేల రాజ్య మేటికి మనకున్. 222

తే. వాసవాత్మజ మును నీవు చేసినట్టి
ప్రతినయే మత్ప్రతిజ్ఞ యీరాజుఁ గాతు
ననుచుఁ దమ్ముని నూఱార్చి యమ్మహీశు
భయము మాన్పియు సంతోషభరితుఁ జేసె. 223

వ. ఇవ్విధంబున నమ్మహీపతియగుచతుర్ధను భయం బుడిపి యయ్యుజాతశత్రుం డంతఁగపురంబున కరిగె నని శుక యోగీంద్రుం డిలావంతునకుఁ జెప్పినవిధం బెఱింగించిన నటమీఁది వృత్తాంతం బేమని యడుగుటయు. 224

మ. అసికృత్తారినికాయ కాయజబుధాధ్యక్షాత్తసంజాత శ్రీ
మసఖోద్భూతసమాన మానవ ధరా మందార,మందార ము
ఖ్యసమ స్తగ్రహదత్తరాజ్య బలభోగ శ్రీయశో నిత్య,ని
త్యసమభ్యర్చితకృష్ణ!కృష్ణమకుమారా! మారజిత్ప్రాభవా.

క. ఉర్వీదేవసమూహా,శీర్వాదస మేధమానసింధురతుర గా
ఖర్వశ్రీసంతానా,గర్వితరిపుహారణకరణ కౌక్షేయక రా.226

తోటకవృత్తము.—
కరుణాకరమానస కమ్రయశః
పరిపూరితనిర్మలపద్మభవాం
డ రమారమణీమణినాథపదాం
బురుహద్వయపూజనపుణ్యనిధీ. 227

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మ నామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్ర భారతం బనుపురాణకథయందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# చి త్ర భా ర త ము

## షష్ఠాశ్వాసము.



యువతీకరుణాపీ
యూయతసంపద్విశేష హరి భూరుహ రా
ధేయ శశిదాన హరశో
భా యొస్సులపల్లి మాదయప్రభు పెద్దా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని జాతుం డగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదు లగుశౌనకాదులకు నిట్లనియె నయ్యజాతశత్రుం డభ్యంతరమందిరంబునకుం జని యంత వృత్తాంతంబును గుంతీద్రౌపదులకెఱింగించి భీమార్జున నకులసహదేవచతుర్ధనసమేతుండై నిజబలంబక్షౌహిణీద్వితయంబునుం గొలువఁ గరినగరంబున కరిగి తమతాత యగుభీష్మునాలికిఁ జని యతనికిం బ్రణామం బాచరించి తదనుజ్ఞాపూర్వకంబుగా నుచితపీఠంబునం గూర్చున్న యంత సహజసంభాషణంబులాడుచు నాదేవవ్రతుం డాధర్మనందనున కిట్లనియె 2

తే. పాండవాగ్రజ యేమినెపంబు గలిగెఁ
దమ్ములును నీవు నధిక వేగమ్ము తోడ

నిచటి కేతేర నీమాన వేశుఁ డెవ్వఁ
డీవిధంబంతయును నాకు నెఱుఁగఁజెపుమ. 3

సీ. అనవుడు ధర్మనందనుఁడు గేలుమొగిడ్చి
యమ్మహాత్మునితోడ నర్జునుండు
వేఁటఁబోయినయట్టివిధమును గుండినా
ధీశుండు వచ్చి ప్రార్థించుటయును
నతనిఁ గావఁగఁబూని యనిమిషేశ్వరసూతి
ప్రతినగావించిన పద్ధతియును
దమ్మునిమాట యుద్ధతిమీఱఁ జెల్లింపఁ
నొడఁబడ్డచందంబు నుచితభంగిఁ

తే. దెలియఁజెప్పిన నాతండు కలఁకనొంది
వేఁడినిట్టూర్పు నిగిడించి విషమకార్య
మయ్యెఁ గృష్ణునితోడఁ గయ్యంబుకలిమి
ననుచుఁ జింతించి యిట్లను నతనితోడ. 4

శా. భద్రేభాయుతసత్త్వశాలి సమరప్రౌఢప్రతాపాఢ్యుఁ డ
చ్ఛిద్రప్రాభవుఁ డుగ్రవైరి దనుజశ్రేణీ తమస్సూర్యకో
షోద్రేకుండు గుణౌఘభూషణుఁడు దానోపాయదక్షుండు
నిర్నిద్రుం డాఢ్యుఁడునైన శౌరియనిలో నిల్వన్ హరుం
డోపునే. 5

క. ఎక్కడి చతుర్ధనుం డిటు
త్రెక్కొని యేతెంచెఁ బుండరీకాక్షునితో
నెక్కడి పోరాటము మన
కక్కట సమకూడె దైవమా యని మఱియున్. 6

క. ఇలఁ దనదు మేలుఁగీడును
నలఘుమతిస్ఫురణఁ గరతలామలకముగాఁ
దెలియక [1]వెంగలితనమునఁ
బలికినఁ గీడొందు నెట్టి బలియునికైనన్. 7

మ. వనజాక్షుఁ బలి వేఁడఁ జేసె నలదేవజ్యేష్ఠుశీర్షంబుఁ బో
నొనరించెన్ మఱు రూపుమాపె నమరవ్రాతేశు నొంచెం
దపో,ధను లెల్లం బ్రతివాసరంబును మదిం "దస్మై నమః
కర్మణే", యనుచున్ మ్రొక్కఁగ దాని గెల్వ మనశక్యంబా
విచారించినన్. 8

క. కావలసిన యర్థంబులు
దైవప్రేరణము కతనఁ [2]దటిఁ దామె యగున్
గావున నర్జును దూఱం
గా వల దీ రాజుఁ గావఁగాఁదగు మనకున్. 9

క. అని యాగంగానందనుఁ
డనిపిన ధర్మజుఁడు వేడ్క నవనీనాథుం
డునుఁ దమ్ములుఁ దోఁ జను దే
ర నరిగె ధృతరాష్ట్రమందిరమునకు ననఘా. 10

వ. అదియు శరచ్చంద్రచంద్రికానూనప్రభాపటలచటులహీర
వారస్థగితహేమకుంభవిరాజితంబును, బాలభానుభాను
విజృంభమాణమాణిక్యబద్ధసమిద్ధభిత్తిమనోహరంబును శుద్ధ
స్ఫటికఘటితప్రాంగణప్రదేశంబును నానావిధవిచిత్ర
వితానసంతానసముల్లసితోపరిభాగంబును ముక్తాఫలవల్లరీ
ప్రభాఝల్లరీతోరణాలంకృతంబును వివిధమణిగణరంగ

1 గబ్బితనంబున. 2 దముఁదామె.

పద్మవిలసితంబును నై సరోవరంబునుంబోలె రాజహంస
ధార్తరాష్ట్రనివాసంబై, ఘనాఘనాగమంబునుం బోలెఁ
గర్జానందకరంబై, రాజసుకృత్యంబునుంబోలె సుఖాసన
కారకంబై చండభానూదయంబునుంబోలెఁ బోషితపద్మినీ
మండలంబై యొప్పు నందు. 11

సీ. అంగ వంగ కళింగ బంగాళ నేపాళ
చోళ బర్బర సింధు మాళవాంధ్ర
భోట పానాట కాంభోజ మహారాష్ట్ర
సౌవీర ఘూర్జర సాల్వ మత్స్య
లాట కర్ణాట మాళవ కుంతల మగధ
సామంత యామున యవన మద్ర
కొంకణ కేకయ టెంకణ హూణ కు
ళింద సౌరాష్ట్ర పుళింద పాండ్య
తే. కాశి కాశ్మీర నాట త్రిగర్తఘోట
భోట మలయాళ కోసల పుష్పితాది
భూపతులు దొరల్ మంత్రులు బుధులుఁగొలువ
నోలగంబున ధృతరాష్ట్రుఁ డుండె వేడ్క. 12

తే. నిఖిల రాజన్యమౌళిమాణిక్యవిమల
కిరణ నీరాజితాంఘ్రిపంకేరుహుండు
నిరుపమానంతసంతోషభరితుఁ డగుచు
నిండుగొలువున దుర్యోధనుండు నుండె. 13

వ. అంత నయ్యజాతశత్రుండును భీమాద్యనుజచతుష్టయం
బును జతుర్ధనుండును దోడరా దౌవారికులవలన నవసరం
బెఱింగినవాఁడై కొలువుకూటంబునకుం జని యయ్యాంబి

ఆ. ధర్మతనయ నీకుఁ దగునె తేలవ్రుఁబోలె
వాఁడిఁజేసి యిట్లు నేఁడు పలుక
యాదవేంద్రు, సత్యమంతయు మనమెఱుఁ
గుదుముగాదె [1]గెలువఁ గూడుననిన. 21

వ. కర్ణుం డిట్లనియె. 22

ఉ. అర్జుననంతవాఁ డితని నాదరణంబునఁ గావఁబూనె నా
నిర్జరులెల్ల వచ్చి ధరణీవరకోటులఁ గూడి విక్రమ
స్ఫూర్జితమూర్తులై యనికిఁ జొచ్చిన వీని వధింప శక్తులే
కర్జమునం దలంప నల కంజదళాక్షునిఁ జెప్పనేటికిన్. 23

వ. అనిన దుర్యోధనుం డిట్లనియె. 24

మ. వనజాక్షుండన నెంత చాపగురుఁ డశ్వత్థామయుక్ గాత
ముం,డును మీ రేవ్వరు నేను బాహ్లికుఁడుఁ గర్ణుండుక్ మదీ
యానుజాల్, ఘనులీరాజులు భీమజాద్యసురులుక్ గంగా
సుతుం డాదిగా, మనసైన్యంబులు గూడి పోల్చిన రణక్ష్మా
మండలి న్నిల్చునే. 25

వ. అని మఱియు వీరాలాపంబులాడి శరణాగతుండగు నీ
చతుర్థనుం గావంబూనిన యర్జును ప్రతిజ్ఞ[2]తోన నడరు
నని నిశ్చయంబుగాఁ బల్కిన యనంతరంబ దుశ్శాసనుం
డిట్లనియె. 26

చ. మనము సమస్తభూవరసమాజము సేనలతోడఁగూడి రాఁ
బనుపుద మంత నా ధరణిపాలురు వచ్చిన సైన్యరాజితోఁ
గినుకదలిర్ప ద్వారవతికిం జని వేడెలు వెట్టి యా చతు

1 మేలుగూడుననిన. 2 నెగడెడునని.

ర్ధనునిభయంబుఁ బాపుదము దానవసంహారుఁ బాఱఁ
దోలుచున్. 27

వ. నావుడు నాదుష్టచతుష్టయంబు నాలోకించి యుధిష్ఠిరుం డిట్లనియె మనము సకలరాజన్యుల రావించి శ్రీకృష్ణుని తలఁపుఁ దెలియ నొక్కదూతం బంపి యక్కార్యంబుఁ దెలిసి చేయవలయు చందంబునఁ జేయుదము గాంగేయుం డిట్లంగీ నిశ్చయించుననినఁ దక్కినవారలెల్ల నట్లకాకయని రంత నంతవృత్తాంతంబు విని యశేషరాజన్యలోకంబును నిజ సైన్యసమేతంబుగా రాఁబనిచి పాండవేయుల నిజనివాసం బున కనిచి చతుర్ధనున కొక్కహర్మ్యంబు [1]విడిది యొసంగ నియమించి దుర్యోధనాదులను దక్కిన భృత్యామాత్య వర్గంబును వీడుకొలిపి కొలువు చాలించి యయ్యాంబి కేయుండు సంజయుకరం బూఁతగాఁ గొని విదురుండును దోడరా నభ్యంతరమందిరంబున కరిగె నంత నానాదేశా ధీశులు తమతమ చతురంగబలంబులతో హాస్తిపురికి రాఁ దొడంగి రందు. 28

ఉ. భండన భీమవిక్రముఁడు బాణకళానిపుణుండు మత్తవే
దండఘటాతురంగమరథప్రకరంబులతోడ మత్స్యభూ
మండలనాథుఁడైన యరిమానవిభంజనశాలి యావిరా
టుం డరుదెంచె సంగరపటుత్వమునం గురురాజువీటికిన్.

ఉ. సింధురబంధురాశ్వరథసేవితుఁడై చనుదెంచె సన్నభ
స్సింధురమానుజాత సురసింధురపాండురకీర్తి వేడుకన్

1 విడియ నొసంగ.

సింధువిభుండు సైంధవుఁ డసిప్రముఖాయుధదీక్షితుండు ద
ర్పాంధుఁడు యుద్ధరంగనిహతాహితవీరుఁ డుదారమూర్తియై

క. విందానువిందు లఖిలా
రిందము లుగ్రాహవసుపరిశ్రమసేనా
బృందముతో వచ్చిరి యా
నందం బెసఁగంగ హస్తినాపురమునకున్. 31

క. మత్తగజదానధారా
యత్తభ్రమరీవితానహారిస్వనముల్
చిత్తమున మెచ్చుచుఁ భగ
దత్తుం డేతెంచె గబ్బితన మేర్పడఁగన్. 32

క. క్ష్వేడాకంపితకూర్మ
క్రోడదిశాకుంభిగోత్ర గోత్రమహద్భ
గ్రాడంబుధిరై సమర
క్రీడారతిమీఱ ధృష్టకేతుఁడు వచ్చెన్. 33

తే. దర్పితారాతి రాజకాంతాకుచాగ్ర
హారిహారగుళుచ్ఛసంహారణచణకృ
పాణభూషితనిష్ఠురపాణియగుచు
సేనతోఁగూడ నా సుదక్షిణుఁడు వచ్చె. 34

క. నిజకరిహరిరథసుభట
వ్రజపాదోద్ధూతభూపరాగపిహిత నీ
రజహితులై కేకయు ల
క్కజముగఁ జనుదెంచి రపుడు గరిపురమునకున్. 35

క. అక్షీణనిజమహాశుగ
లక్షీకృతవైరి నృపకలాపశరీరుం

దక్షౌహిణితోఁ బాంచా
లక్షోణీశ్వరుఁడు సుతులలమిరా వచ్చెన్. 36

శా. చండామోఘనకల్పుఁ డున్నతభుజాచంచద్గదాదండమా
ర్తాండప్రోద్భవతుల్యుఁ డుగ్రరిపువీరస్వాంతశల్యుండు శ
ల్యుం డక్షౌహిణి తన్నుఁ గొల్వఁగ జయోద్యోగంబుతో
వచ్చె నుద్దండప్రక్రియ మించ నచ్చటికిఁ బాతాళతమా
ధీశ్వరా. 37

శా. రక్షోనాథకిరాతతాపసము సమగ్రప్రాభవుం డుగ్రయు
ద్ధక్షోణీతలభీష్మమూర్తి రిపుకాంతాకంఠసూత్రచ్ఛిదా
దక్షాక్షుద్రకఠారహస్తుఁడు సముద్యత్క్రోధధూమధ్వ
జుం డక్షీణోద్ధతి వచ్చె భీమజుఁడు దా నక్షౌహిణీయుక్తుఁడై

శా. అంగాధీశుఁడు చోళవల్లభుఁడు పాండ్యక్ష్మాతలేంద్రుండు
కాళింగుం డాంధ్రవసుంధరాధిపతి పౌళిందుండు నేపా
ళుఁడుఁ, బంగాళేశుఁడు మాళవక్షితిపుఁడుఁ బానాట
నాథుండు నవ్యాంగక్షోణివిభుండు నాదిగ జగద్వంద్యుల్
నృపుల్ వేడ్కతోన్. 39

వ. అరుగుదెంచిరి మఱియు మాహిష్మతీపతి యగు నీలుండును విదర్భాధీశ్వరుం డగు రుక్మియును మొదలుగాఁ గల నానా దేశాగత రాజన్యులు పదునాలుగక్షౌహిణులతోడం గూడి చనుదెంచిన ధృతరాష్ట్రానుమతంబున దుశ్శాసనాదిధార్త రాష్ట్రులు తమతమమూలబలంబు[1] రెండక్షౌహిణులు గొలువ రథాధిరూఢులై యెదురుచని యా రాజసమూహంబుఁ దోడ్కొని హస్తిపురంబునకు వచ్చి యయ్యైరావుల విడియ

1 లేడక్షౌహిణులు.

నియమించిన వారలకు సత్కారంబునుం దన పాండ్యావస ప్రాంగణప్రదేశంబునుఁ బట్టుచాలక క్రిక్కిఱిసి యుండె నంత. 40

తే. పాండవులుఁ గౌరవులు సర్వపార్థివులును
హస్తిపురమునఁ గూడుట యాప్తచరులు
దనకు వినిపింపఁ గృష్ణుఁ డుద్ధవునిఁ బిలువ
నంపి యాతనితోడ నిట్లనుచుఁ బలికె. 41

క. కలియును నూనెయు బలెను
గలయక క్షీరోదకముల కరణిం గాంతే
యులుఁ గౌరవు లెపు డెనసి స
కలనృపులను గూర్చినారు కలనగరమునన్. 42

వ. అంత. 43

తే. పాండవులు నాకు నొక్కింత పనియుఁ జెప్పి
కాని చేయరు నేఁ డిట్టికార్యమెత్తి
యెఱుఁగ వినిపింప రిందుల కేనెపంబొ
చిత్రమయ్యెడి బుద్ధి నీక్షించి చెపుమ 44

వ. అనవుడుఁ గృష్ణున కుద్ధవుం డిట్లనియె 45

తే మనము బంధుల మీా ధరామండలమునఁ
గలుగు నృపులును వారినే కలిసినారు
రిపుఁ డొకండును లేఁడు తరిక్కించి చూడ
నింక నొకమాట వినుమని యిట్టులనియె. 46

సీ. ఈధృతరాష్ట్రుపై నా ధృతరాష్ట్రుండు
వచ్చెనో పన్నగశ్రేణిఁ గూడి

---

1 వరులఁ.

యీ రాజరాజుపై నారాజరాజెత్తి
యరుదెంచెనో యతుం లలమికోలువ
నీ ధర్మరాజుపై నా ధర్మరాజెత్తి
వచ్చెనో కింకరావళులఁ గూడి
యీ ధనంజయునిపై నా ధనంజయుఁ డెత్తి
వచ్చెనో ధర వడవడ వడంక

తే. నాత్మఁ బెనగొన్న సామ్యపుటలుక గలుగు
కతనఁ గాకున్న వీర లీకరణి గూడఁ
గారణం బేమి యచటి కొక్కరునిఁ బంచి
తెలియఁగాఁదగు నిది వసుదేవతనయ. 47

వ. అనిన నయ్యాదవోత్తముండు త్రికాలవేది యయ్యును
రాజధర్మం బవలంబించి యక్రూరునిం బిలిపించి యతనితో
నిట్లని యానతిచ్చె. 48

క. పాండవులుఁ గౌరవులు వే
దండపురమ్మున సమస్తధరణీశుల ను
ద్దండతఁ గూరిచిరఁట యా
దండునకుం బోయి ధర్మతనయాదులతోన్. 49

క. మనసేమముఁ జెప్పి నయం
బున వారివిధంబు [1]సర్వముం దెలిసి రయం
బున రమ్మని యనుప నతఁడు
చనియె రథారూఢుఁడై గజపురమ్మునకున్. 50

వ. చని యతఁడు తత్పురోపవనప్రాంగణప్రదేశంబునఁ గ్రందు
కొనియున్న సకలసైన్యంబుల నున్నతప్రాకారగోపురాట్టా

1 త్త్వముం.

లక ప్రాసాదంబులం గనుంగొనుచు నరిగి యరిగి రాజమం దిరద్వారంబున రథావతరణంబుఁ జేసి దౌవారికుల చేతఁ దనరాక యాంబికేయున కెఱింగించి తదనుజ్ఞాతుండై సభా మంటపంబునకుం బోయి యచ్చట గాంగేయ బాహ్లీకసోమ దత్తాదిజ్ఞాతులును, ద్రోణకృపాశ్వత్థామాది మహావీరు లును, యుధిష్ఠిరాదిపాండవేయులును, సుయోధనాది కుమారవర్గంబును ద్రుపదసౌబలసైంధవాదిబంధువులును మత్స్య మద్ర మగధ మాళవ నేపాళ చోళ కొంకణ కొంకణ కోసల కుకుర కురు కరూశాది నానాదేశా గత రాజవరులును విదురసంజయులుం గొలువ ననర్ఘ్య మణిమయసింహాసనాసీనుండై పేరోలగంబున్న వైచిత్ర వీర్యునకుఁ బ్రణామం బాచరించి గాంగేయద్రోణాదులకు నమస్కరించి తనకు నభివందనం బాచరించిన కౌంతేయ గాంధారేయాదుల నాలింగనంబు గావించి తక్కినవారల చేత సంభావితుండై యంతకమున్న యొక్కయింతిచేతఁ దనకని పెట్టించినకనకపీఠంబునఁ గూర్చుండి కుశలపూర్వ కంబుగాఁ దత్తదుచితప్రకారంబున వినోదాలాపంబు లాడు చున్న యక్రూరునకు నజాతశత్రుం డిట్లనియె. 51

క. క్రూరుఁడవుగాని నెపమున
సారససంభవుఁడు నీకు సార్థకముగన
క్రూరుండని పేరొసఁగెను
శ్రీరమణపదాంబుజాతచింతనహృదయా. 52

మ. హరికిన్ సేమమె సీరికిన్ముదమె సాత్యక్యాదితత్సోదరుల్
పరిణామంబున నున్నవారె శుకుఁడున్ బ్రద్యుమ్నుఁడున్
సాంబుఁడున్, దరుఁడున్ మోదముతోఁ జెలంగుదురె

యోధశ్రేణికిఁ బెన్నయే, తరుణీసంఘము సంతసంబొదవ
నిత్యశ్రీల వర్తిల్లునే. 53

క. అనఘా నీవనిశంబును
వనజాక్షుని సేవఁ జేయువాఁడవు నెయ్యం
బున నొక్కవేళను దలం
చునె మమ్ముం గృష్ణుఁడు దయసొంపున ననుడున్. 54

తే. ఆయుధిష్ఠిరుతోడ నిట్లనియె గాంది
నీతనూజుండు తన నేర్పు నెగడఁ గృష్ణు
నకును మీకును భేద మున్నదె యతండు
మిమ్ము నేప్రొద్దుఁ దలఁచు నర్మిలి దలిర్ప. 55

వ. అనవుడు నయ్యజాతశత్రుండు సంతసంబునంబొంది మహాత్మా
భవదాగమనంబునకుం గారణం బెయ్యది యనిన నక్రూరుం
డిట్లనియె. 56

ఉ. మీరును ధార్తరాష్ట్రులును మించినవైరముదక్కి క్షీర
ముఁ, నీరముఁబోలె నేకముగ నెమ్మిఁ జరించుట రాజ
వాహినీ, వారముతోడ నిచ్చటికివచ్చుటయుం దనుజాంత
కుండు దాఁ,జూచులచే నెఱింగి కడుసంతసమొందెఁ బృథా
సుతాగ్రణీ. 52

వ. ఇత్తెఱంగున మీ వృత్తాంతంబు విన్నవాఁడై యావెన్నుండు
నన్నుం బిలిపించి యిట్లని యానతిచ్చె. 53

క. నీవచటి కరిగి యేమిటి
కై వచ్చిరో వారిజూడ లరసి వియద్గం
గావరనందనుఁ బోడఁగని
యా వాసవిఁ జూచి యడుగుమని సన్ననిచెన్. 59

వ. ఏ నమ్మహానుభావుని యానతి శిరంబున నిడుకొని యరుగు
దెంచితి మీర లపారసేనాసమేతుల రయి యిప్పట్టణంబున
నెట్టకేలకుంగూడఁ గతం బెయ్యదియని యడుగ నందు
లకు నయ్యుధిష్ఠిరుండును దక్కినవారలును మిన్నకయున్న
యంతన గాందినేయునకుం గాంధారేయాగ్రజుం డిట్ల
నియె. 60

సీ. అనఘాత్ముఁ డీ చతుర్ధనుఁడు దివ్యహయంబు
నెక్కి యాకసమున నేగుదేర
నా ఘోటకాస్యంబునం దుద్భవించిన
నురువు మారుతముచేఁ దొరిఁగి యమున
లోనున్న తనదుకేల్దోయిలోఁ బడఁగ నా
కృష్ణుండు నెలకు హరింతు ననుడు
విని భయంబునఁ దన వెన్నుఁజొచ్చిన వీని
గాండీవి కరుణతోఁ గావఁబూనెఁ
తే. గాన శరణొందువానిరక్షణముకొఱకు
నేము సేనలతోఁ గూడి యిచట నుంట
నెపము లేని ప్రతిజ్ఞ మాన్పించుటొండెఁ
చేజ మొప్పంగ నితని సాధించుటొండె. 61

క. పని యిదియె మాకు నిప్పుడు
విను మయ్యాదవుఁడు ప్రతినవిడిచి యతనిఁ దా
మనుచుట మంచిది లేదా
తనబలిమియు మాబలంబుఁ దానే యెఱుఁగున్. 62

శా. ద్రోణాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడుఁ గర్ణుం డర్జునుండుర్
జగ,త్ప్రాణాత్మోద్భవధర్మజుల్ గవలు నాహైడింబుఁడుఁ

ద్రౌణియుఁ, క్షోణీనాథులుఁ బోరనిల్వఁగ బిడౌజుండో
యజుండో [1]కదుఁ, వేణుధ్వానముఁ జేసి [2]గొల్లసతులఁ
వేఁగూడుటో కయ్యముల్. 63

వ. కావున బహుశాస్త్రజ్ఞుండవగు నీవు మాకృష్ణునకు బుద్ధిఁ
జెప్పి యా చతుర్ధనుఁ జంపెదనన్న ప్రతిన మాన్పించు
మనవుడు నక్రూరుం డతని కిట్లనియె. 64

తే. రాజ్యగర్వంబు పెంపున రాజరాజ
మీఁదు గానక యాడితి మిన్న కీవు
సత్యసంకల్పుఁడైన యాచక్రపాణి
ప్రతిన మాన్పెదనని పూన బ్రహ్మతరమె. 65

చ. సురల జయించి దేవపురి చూఱలుపట్టి సమస్తలోకముల్
పోరిఁబోరి నేర్చు నయ్యసురపుంగవకోటుల మాటమాత్ర
లో, శరములపాలుచేసి దివిషద్వరులెల్ల నుతింపఁబోల్చు నా
హరికిని మాకు హస్తిమశకాంతర మారసిచూడ నెమ్మెయిన్.

వ. మఱియును. 67

సీ. కల్పాంతశిఖికల్ప [3]కాళియఫణములఁ
జిదమిదగా మట్టి మదమడంచె
సత్వనిర్జితదిశాసామజశ్రేష్ఠంబుఁ
గువలయాపీడంబు నవనిఁ గూల్చె
విశ్వలోకాప్రతివీరుఁ జాణూరుని
బాహుయుద్ధంబునఁ బట్టి చంపె
బంధురబలు జరాసంధుఁ బద్నెనిమిది
మాఱులు రణభూమిఁ బాఱఁదోలె

1 కదా. 2 గొల్లెతలలో వేయాడుటే. 3 కాళియుఁబదములు.

తే. నరకమురదైత్యనాథుల నఱికి వైచెఁ
బారిజాతంబుఁ గొని యింద్రు భంగపఱచె
బలితనయుతోడఁ బురహరుఁ గలన నోర్చె
నడ్డ మెవ్వాఁడు గలిగె బ్రహ్మాండమునను. 68

క. పగ యా విభుతోఁ [1]గైకొనఁ
దగదని తెలుపంగ ననికిఁ దార్కొనితిర యేఁ
దగరు గిరిఁ బూని తనతల
పగులఁగఁ దాఁకుటయొ గాదె పరికింపంగన్. 69

క. కావున మీరందఱు నీ
భూవల్లభుఁ దోడుకొని ప్రభుత్వముతో మా
శ్రీవనితాధిపపదరా
జీవంబులు శరణుఁజొరుఁడు చేకొను మిమ్మున్. 70

వ. అనుడు నా సుయోధనుండు కోపోద్దీపితమానసుండై
యక్రూరున కిట్లనియె. 71

శా. ఏమేమీ హరిశూరుఁడంటి నిజమా నే యా జరాసంధుఁడు
ద్దామప్రక్రియఁ జుట్టికొన్నఁ బురముం దర్పంబు డించెం
సముత్తీర్ణం దాయవనుండు ద్రోల గుహఁ జొచ్చెం జూ
డఁగా నిన్నఁ గాదా ముంజేతుల కంకణంబులకు నద్దం
బేల యక్రూరకా. 72

వ. అనవుడు నతండా సుయోధను నలక్ష్యంబుఁ జేసి యుత్తరం
బియ్యక భీష్ము నుద్దేశించి మహానుభావా యితండు మదాం
ధుండు గావున నవ్వీరాగ్రేసరు ప్రభావంబెఱుంగక యా
డెడు శతానందశతంబును సక్రందన సహస్రంబును నైన నా

1 దలకొన.

నందకధరుండు క్రుద్ధుండై చూచిన యుద్ధంబున నిలువ
సమర్థంబులే కావున మీరెఱుంగని యర్థంబులే దా హరి
తోడి యాయోధనంబు మాని శరణాగతులై మనుం
డనవుడు మాఱుత్తరంబియ్యం డయ్యె నంత నక్రూరుం
డకౌంతేయుల నుపలక్షించి యిట్లనియె. 73

ఉ. నూనియతోడి కప్పురపునుగ్గు తెఱంగున ధార్తరాష్ట్ర సం
తానముఁ గూడి మీరు విబుధస్తవనీయచరిత్రులయ్యు స
న్మానవిహీనులై దురభిమానముఁ జెంది చరింపనేల మీ
మానసవీథిఁ జూడుఁడిది మంచిదొ కృష్ణునిపొందుమంచిదో.

క. హరి మీకుఁ బ్రాణబంధువు
గురువుఁగా సచివుండు రక్షకుండునై మిమ్మే
పురఁ గూర్మి నెల్ల వేళల
నరయుచు రక్షించినందుకా యిది దలఁపన్. 75

వ. ధార్తరాష్ట్రులు సహజశాత్రవులయ్యు మిత్రభేదంబుకొఱకు
మిమ్ముఁ బోదిసినా రింతియె కాని నిక్కంబగు మక్కువఁ
గాదు కృష్ణుండు మీమీఁద దయదప్పి సప్పు డఖిలరాజ్యం
బునుం జేకొనందలంచినారు గావున నీ నృపకీటకంబుఁ
జేపట్టి శార్ఙ్గితోఁ గపటంబు సేయుట కర్జంబు గాదని యర్జు
నున కిట్లనియె. 76

క. [1]విరసింపఁ దాతతనయునిఁ
బొరిగొను కృష్ణునకు నితరుఁ బొరిగొను టరుదా
మఱది యనుచునవు మానుము
హరి శరణముఁ జొరుము భద్రమయ్యెడుఁ బార్థా. 77

1 విరసించినచోఁ దనయుని.

వ. అనిన నయ్యక్రూరునకు నతం డిట్లనియెఁ గృహీతపరిత్యాగంబు సేయరాదు నెఱుంగవే సర్వభూతాంతర్యామి యగు నప్పరమేశ్వరుం డేమి సేసినఁ జేయుంగాత మనియెఁ దదనంతరంబ యుధిష్ఠిరాదు లతనితో మా విన్నపంబుగా రమావల్లభునకు నెఱిఁగింపుమని యథోచితవచనంబులు కొన్ని వల్కి యే మతని సమ్ముఖంబునకు నొక బుద్ధిమంతు నంపి సర్వంబు విన్నపంబుఁ జేయించిన యటమీఁదఁ గావలసిన యర్థంబయ్యెడునని వినయపూర్వకంబుగా ననిపిన నయ్యక్రూరుండు రథారోహణంబుఁ జేసి రయంబున ద్వారకానగరంబునకుం జని. 78

క. తనరాక యొక్క వేత్రధ
రునిచేఁ [1]జెప్పంప విని యరుగుదేరంబం
చినఁ జని సోదరులును నం
దనులుఁ గొలువనున్న మురమథనుఁగని మ్రొక్కెన్. 79

వ. ఇట్లమ్మురాంతకునకు నమస్కరించి యతని యనుమతి నొక్క సువర్ణపీఠంబునం గూర్చున్న యవసరంబున నవ్విభుం డచ్చటి వృత్తాంతం బేమని యడిగిన నతం డిట్లను దేవా, భవదనుజ్ఞాతుండనై కరినగరంబున కరిగి యచ్చట నాంబికేయు పేరోలగంబునకుం జని యాతని యాదరణంబున నొక్క పీఠిక నాసీనుండనై యుచితాలాపంబు లాడుచున్న యంత నయ్యజాతశత్రుం డిచ్చటి యోగక్షేమంబడిగిన నేనందుల కుత్తరంబిచ్చి వారిపరిణామం బడిగి వాకణపురంబున మాతంగశతాంగవీరభటసంఘంబులతో నానారాజవరులు కూడియున్న కారణం బెయ్యదియన నయ్యక్షై

1 జెప్పింప విని యరుగుదే నియమిం, చిన.

ష్ఠిరుం డూరకున్న సదంపడి దుర్యోధనుండు శరణాగతుం డైన యీ చతుర్ధనుం గాచెదనని మావిజయుండు పలికిన నేము వీరలతోడం గూడియున్నవారము కృష్ణుం డీ చతుర్ధనజననాయకుం జంపెదనన్న ప్రతినమాటు ట [1]మేలు లేదా యటమీఁదఁ దానే యెఱుంగునని యివి యాడ గాఁగల యనుచితవచనంబులు పల్కినం దగిన యుత్తరం బిచ్చి యతని లక్ష్యంబుసేయక భీష్మాదులతోఁ దత్తత్ప్రకారంబుల వెన్నుమాపి కొన్నిమాటలాడి యాప్రజ్ఞాచక్షునకుం జెప్పి యే నరుగుదెంచునవసరంబున ధర్మజభీమార్జునులు దమమాటలుగా భవత్సన్నిధానంబున విన్నపంబు సేయుమని నాతో ననిన తెఱం గెఱింగించెద నవధరింపు మందు ధర్మజుం డిట్లనియె. ౩౦

చ. కమలదళాక్ష, మీజనకు గాదిలిసోదరి మాకుఁ దల్లి భా
వమునఁ దలంచినన్ నెనరువారము వెండియు దేవరందుఁ
గూరిమిగలయట్టిభక్తులము ప్రీతిమెయిం గరుణింపు సర్వ
భూరమణులలోన నెయ్యపుచుట్టమందికి నీచనవియ్యఁ జెల్లదే,

చ. వలపరిమూపుగా దివిజవల్లభునిం దెగఁజూచి వైరులన్
గెలువఁగఁ జేసి శుభ్రతరకీర్తి దిశావళి నించి యింతగా
మెలపితి వీవ యిప్పుడొక మేదినితేనికినై విరోధివై
వలఁచిన నవ్వరే సురగణంబులు మానవనాథకోటులున్.

వ. అనుడు భీముం డిట్లనియె. 33

చ. తెఱపున ధర్మనందనుఁడు [2]విన్నపమాడుటగాదు బాంధవం
బరిగెడునో యటంచుఁ దెగనాడకయుండుటగాని యర్జు

1 గడునుచితంబు. 2 విన్నన చెప్పుటగాదు.

నుం, డఱిముఱిఁ గాచినట్టి మనుజాధిపుఁ బైకొని బ్రహ్మ రుద్రు లే, ద్దెఱఁ జనుదెంచిరేనియు వధింపఁగనోపుదురే తలంపఁగన్. 84

క. కావున నీ కుండినపతిఁ
గావు నయంబెసఁగ నట్లు గాదా నన్నుఁ
దేవేంద్రనందనుని వసు
దేవతనయ! చూచి యెఱుఁగుదే కద యనుమీ. 85

వ. అనిన యనంతరం బర్జునుం డిట్లనినె. 86

చ. విను మనఘాత్మ నన్ను నరవిందదళేక్షణుఁ డింతవానిఁగాఁ
బెనిచె నశైన నీనృపతి భీతిలి చేరినఁ గాచినాఁడ నీ
తనికయి చచ్చుటొండె రణధారుణిలో గెలుపొండె మేలుగా
కని వినిపింపుమీ కొలువునందు బలాదు లెఱుంగునట్లుగన్.

వ. అని పలికె నంత భీష్మాదులెల్లను దేవరసమ్ముఖంబునకు నొక బుద్ధిమంతు నంపెదమని నన్నంపిన నేనుం జనుదెంచితినని విన్నవించిన నయ్యరవిందనయనుండు గించి దరుణితలోచ నుండై కొలువుగలయం గనుంగొని. 88

చ. వినఁ గడుఁ జోద్యమయ్యెఁ బృథివీవరకోటులతోడఁ గూడి నేఁ, గినిసిన కుండినేశ్వరునిఁ గ్రీడియె కావఁగఁ [1]బూనె నట్టె యే, మనఁగలవారమన్న ముసలాయుధుఁ డాలము నేయఁబూనెఁ జే,వనిగుడ మార సాంబకృతవర్ములు నవ్వి రిఁ గేలిఁ బెట్టుచున్. 89

వ. మఱియుఁ దక్కినవారెల్లను వీరాలాపంబు లాడుచుండి రంత నిక్కడ ధృతరాష్ట్రుండు విదురసంజయులతోఁ గూడఁ

---

[1] బూనెనంట.

గర్జంబు దప్పెనని కటకటంపడి కొండొక చింతించి కుంతీ
తనయాగ్రజు నుద్దేశించి యిట్లనియె. 90

శా. అక్రూరుం డరుదెంచి యీశ్వరులలో నత్యంతవాక్ప్రౌఢి
నా,చక్రిన్ సంగరకేళి గెల్వంగ సరోజాతోద్భవుల్ నూర్వు
రున్, శక్రుల్ వేవురునైన నోపరనె నాచందంబు నిక్కంబు
య్యు,ద్ధక్రీడన్మనమెంత నీకు నయశాస్త్రప్రక్రియం జెప్పెదన్.

చ. వినయవివేకభూషణుఁ బ్రవీణుఁ గులీనుఁ బరేంగితజ్ఞు స
త్యనిరతు బుద్ధిమంతు నుచితప్రదుఁ గార్యధురంధరున్
గృపా,త్ము నతిగుణాకరున్ బతిహితున్ జననాథుఁడు రాయ
బారిఁ జే,సిన నతఁ డెట్టులైన ఫలసిద్ధిగఁ జేయు సమస్తకృత్య
ముల్. 92

వ. కావున నిట్టిగుణంబులుగలవాని నయ్యాదవవల్లభుపాలికిం
బెట్టి పంపుదమనుడు వల్లెయని కౌంతేయాగ్రజుండు తనతో
విచారింప శంతనుతనయుం డిట్లనియె. 93

క. దేవా జేయుఁడు బలమున
దేవాచార్యుండు నీతి ధీరత్వమునన్
దేవాచలంబు మన సహ
దేవుండని బుద్ధిఁ దెలిసితేన్ ధర్మసుతా. 94

క. అని యొఱఁగించిన యమనం
వనుఁ డప్పుడు పిలిచి నకులుతమ్ముని నాశాం
తనవుని ముందఱ [1]నిడ నా
తనితో [2]నతఁ డిట్టులనె నుదారప్రౌఢిన్. 95

1 నిడియా. 2 నిట్లనియెఁడా.

తే. వత్స! నీనేర్పుమీఱ నవ్వాసుదేవు
నకును నెఱిఁగింపుమని వచనములు గొన్ని
చెప్ప నవియును గురు యుధిష్ఠిర వృకోద
రార్జునాదులమాటల నాత్మ నిలిపి. 96

వ అందఱచేత ననుజ్ఞాతుండై యరుగ ధర్మజుండు తెఱగం
బిలిపించి యిట్లనియె. 97

క. సహదేవ! నీవచనముల
కు హలాయుధకృష్ణసాత్యకులుఁ బ్రద్యుమ్నా
దిహరికుమారులు నతికుపి
తహృదయులై పల్కినను బెదరకుము తాల్మిన్. 98

వ. అని బుద్ధి చెప్పి యనిపిన రథారూఢుండై మితపరిజనం
బులు గొలువ ద్వారవతీపురంబునకుం బోయి రాజమార్గం
బునఁ దత్తద్విశేషంబు లీక్షించుచుఁ జనిచని పెనుమొగ
సాలఁ దఱిసి రథంబు డిగ్గి ద్వారపాలకులచేతఁ దనరాక
విన్నపంబు సేయించి తదనుజ్ఞాపూర్వకంబుగా నాస్థాన
మంటపంబునకుం జని. 99

సీ. కనియెఁ బద్మదళాక్షుఁ గౌస్తుభమణివక్షు
శ్యామలదేహు నాజానుబాహుఁ
గాంచనకౌశేయుఁ గాంతావిధేయు గం
ధర్వకోటివిలాసు నవ్యహాసు
బ్రహ్మాండధౌరేయు బ్రహ్మానుసంధేయు
దనుజారిశరణు దేవనుతచరణు
జలజాప్తనుతతేజు సకలయాదవరాజు
భక్తమందారు శోభనవిహారు

తే. సకలదైవతమౌళిరత్నకిరణప్ర
చయవిభూషితపదసరోజాతు భువన
రాజిజనిహేతు నభ్రగరాజకేతు
శ్రీవధూటీమనస్సంచరిష్ణుఁ గృష్ణు. 100

వ. కని కృతప్రణాముండై నిలిచిన యతని నుచితప్రకారం
బున సంభావించి భద్రాసనాసీనుం గావించి యిట్లని యాన
తిచ్చె. 101

మ. ముదమే యత్తకు ధర్మరాజునకు సమ్మోదంబె భీముండు
స్వమదలీల న్విహరించునే కుశలమే మత్ప్రాణమైపొల్చు
నా, త్రిదశాధీశ్వరసూతికిన్ నకులుఁడుం బ్రీతాత్ముఁడే
సౌఖ్య సంపదఁ బాంచాలి మెలంగునే పరిజనుల్ భవ్యా
త్ములే యెప్పుడున్. 102

చ. అనవుడు మాద్రిపట్టి వినయంబున నిట్లని పల్కె దేవకీ
తనయ! భవత్కృపామహిమ తల్లివిధంబునఁ బ్రోవఁగా
ముదంబ నెగడుఁగాక మాకును విపన్నత గల్గునె కుంతి
దేవియు, న్వినుతచరిత్ర ద్రౌపదియు నిండిన వేడ్కఁ జరింతు
రెంతయున్. 103

వ. నావుడుఁ గృష్ణుండు సంతసిల్లి సహదేవునిం జూచి ప్రొద్దు
గ్రుంకుచున్నయది రేపకడ సహాసంభాషణం బయ్యెడుఁ
బథశ్రాంతి దీఱ విశ్రమింపుమని యొక్క ధర్మప్రాసాదంబున
విడియ నియమించి వీడుకొలిపి యప్పుడు గొలువు సాలించి
తాను నభ్యంతరమందిరంబున కరిగెనంత. 104

క. కమలినిఁ బుష్పిణిఁ గరముల
నిమురుటకున్మరియు వారుణీపరిచయదో

షమునకు రవి ప్రాయశ్చి
త్త మొనర్చుకొనెనన నపరధరముచరిఁ బడెన్. 105

తే. ఎన్నఁడును బగలును వేఁడి యొడలనట్టి
భానుఁ గని బ్రహ్మ కోపించి వానినీకుఁ
గువలయాప్తున కీయఁ జిగురునఁ ద్రోర
ణ మొనరిచె నన సాంధ్యరాగము దనర్చె. 106

క. నగపాలు సాంధ్యరాగము
నిగిడినఁ గెంజాయఁ దనరి నెఱచీఁకటిచే
నగపాలు నలుపునొందుచు
గగనము గురివెందగింజకైవడిఁ బొల్చెన్. 107

తే చలివెలుంగులతేఁడు రేచామ నిపుడు
పెండ్లియాడెడునంచు సంప్రీతి వేల్పు
ముద్దియలువెట్టు ముత్యాలముగ్గులనఁగ
గగనతలమున నిండి చుక్కలు వెలిఁగె. 108

సీ. సంధ్యాంగనామనోజ్ఞవినీలవేణికా
భారప్రభాకదంబం బనంగ
గగనభాగశరావకంజాతహితదీప
సంజాతసాంద్రకజ్జల మనంగఁ
బరధనాహరణతత్పరపశ్యతోహార
గణనియుక్తాదృశ్యకరణి యనఁగ
నఖిలనిర్మలపదార్థావబోధక్రియా
విజ్ఞానపరిపంథ్యవిద్య యనఁగ

తే. శ్యామలంబయి మేదురం బగుచుఁ గన్నుఁ
బ్రామి వెలియును లోను నేర్పడఁగనీక

భూమిపైఁ, గలయఁ జరించెనో యనఁగఁ గప్పె జగం
బులఁ బండువెన్నెలల్. 115

చ. గిరులు సితాద్రులై తనరెఁ గేసరులయ్యె మృగంబు లెల్ల
సుం,దరులును భారతీమహిమ దాల్చిరి మానవులెల్లఁ జూడ
శం,[1]కరులనుఁ బోలి రాపగలు గంగలునాఁ గడు నొప్పెఁ
బక్షు లం,చరుచుల మీఁతెఁ జంద్రకరజాలము సోఁకినఁ
జిత్రవైఖరిన్. 116

వ. అంతకుమున్న యమ్మురాంతకుండు సాయంకాలసంధ్యా క్రియలు నిర్వర్తించి సహదేవునిం బిలిపించి యతండును దాను సత్యభామామందిరంబున మరకతపాత్రంబుల షడ్రసోపేతరుచిరాన్నంబులు భుజించి హస్తప్రక్షాళనం బొనరించి కర్పూరతాంబూలం బొసంగి యతని విడిదికిం బోనియమించి తాను బాహాంతపర్యంత ముక్తాహారంబు ధరియించి పన్నీర పరిపూరితగలంతికాప్రభాగౌరవంబును జతురశీతిప్రభేదబంధచిత్రితకుడ్యవిరాజితంబును మనోజ్ఞ పద్మరాగమణిదర్పణమండితంబును నీలకీలితకాంచనపాదుకాయుగళకలితపర్యంకాధఃప్రదేశంబును శ్రుతిసమ్మిళితవిపంచికాంచితంబును నలినపూగనాగవల్లీమౌక్తికచూర్ణకర్పూర పూర్ణరత్నస్థాపితహాటకపేటికారాజితంబును మంజుల ప్రవాళకృతమంచాలంబిత హంసతూలికాతల్పడోలావిలాసంబును మంజులమణిదీపసహస్రతేజోమయంబును ద్రాక్షా శర్కరాకదళీఖర్జూరగోక్షీరాదినవ్యద్రవ్య యుక్తంబును, సంకుమదకుంకుమకస్తూరీఘనసారసమ్మిళితహృద్య గంధసార

1. కరులనఁ బొల్చిరాపగలు.

సీ. తన మనోహరదీప్తితతి దిశాకామినీ
సిందూరరేఖలఁ జెన్నుగొలుపఁ
దనవింత చెలువంబు దళదబ్జరాగసం
పదల నంతంతకుఁ బసలు గొలుపఁ
దనమేలిరంగు లుద్యద్ధాతురాగరం
జితధరంబులు క్రొత్తసిరులు గొలుపఁ
దనమెఱుంగులు ధరాతలముపై నిండంగఁ
గుంకుము నెఱపిన కొమరుఁ గొలుపఁ
తే. దన బెడంగుల విలసిల్లు వనములకును
సురుచిరంబుగఁ బల్లవస్ఫూర్తి గొలుపఁ
గెంపుఁజాయల గిరికొను ముంపు మెఱసి
బాలభానుండు మింటిపైఁ బరిఢవిల్లె. 123

వ. ఇవ్విధంబున సూర్యోదయంబగుటయు నంతకుమున్న వైణిక వాంశిక వైతాళిక మధురగానంబులచేత నన్వనజనాభుండు మేల్కని కాల్యకరణీయంబులు దీర్చి మనోహరవస్త్రగంధ మాల్యాభరణభూషితుం డై యుద్ధవాక్రూరబలభద్ర సాత్యకిప్రద్యుమ్నానిరుద్ధాదులం బిలిపించి వారలుం దానునుం గొలువుకూటంబున కరుగుదెంచి తత్తదుచితాసనాసీనులై యుండిరంత. 124

తే. వనజనాభునియానతిగొని రయమున
వేత్రహస్తుండు పాండవవీరవరునిఁ
బిలువ నాతండు భూషణమ్ములు ధరించి
యింపుతోడుత వారికడ కేగుదెంచె. 125

వ. ఇట్లు వచ్చిన సహదేవునిం గూర్చుండ నియోగించి మృదు మధురసరససల్లాపంబులఁ బ్రొద్దుపుచ్చుచున్నంత నీ రాకకుఁ

కారణం బేమని యడిగిన నతం డయ్యాదవనాయకున కిట్ల
నియె. 126

సీ. ధరణిఁ గుండినపురీభవ్యుఁడు చతుర్థనుఁ
డను నొక్కరాజు మాయామహాయంబు
నెక్కి యాకసవీధి నేతెంచునప్పుడు
యమునలో మీఁద దేవాళిఁ గూర్చి
తర్పణం బొసరింపఁ దద్ధరిముఖఫేన
ఖండంబు దైవసంఘటనకతనఁ
దమహస్తయుగళిలోన మహాద్భుతంబుగాఁ
బడుటఁ జిత్తమునఁ గోపంబు పొడమి

తే. యంబుజోద్భవ రుద్రాదు లడ్డపడిన
నీహయముమీఁద నున్న నరేంద్రుశిరము
చక్రమున నొండె నిష్ఠురాస్త్రముల నొండెఁ
ద్రుంతు మాసంబులో నని తొడరి తనఘ ! 127

వ. అంతటఁ గ నతండు భయంబొంది ధనంజయుండు వేఁటఁ బోవఁ దెలిసి యాచోప్పున నవ్విజయుకడకు వచ్చి భవన్నామధేయం బుగ్గడింపకయ పెరవున శరణంబు వేఁడిన నవ్వీరుం డతనిం గావఁ బ్రతిజ్ఞఁ జేసి పదంపడి నీకు భీతిదుం డెవ్వం డట్టివాని నామధేయం బేమని యడిగిన మీఁరని చెప్ప నర్జునుండు మీతోడ శత్రుభావంబు భజింపఁబడె నని విచారించి మగిడి పురంబున కేగుదెంచి తద్వృత్తాంతం బంతయు యుధిష్ఠిరున కెఱింగించిన నతండును గరినగరంబున కేగుదెంచి భీష్మాదికురువృద్ధులతో విచారించి నన్ను భవత్సన్నిధానంబునకుఁ బుత్తెంచునప్పుడు దమమూబ

లుగా మీకు విన్నపంబు సేయుమని యందఱుం జెప్పినది
గాక ధర్మతనయుండు నాతో నిట్లనియె. 128

ఉ. నీకరుణావిశేషమున నీరజలోచన సవ్యసాచి నీ
లోకులు చూచి యేమనక లోఁగుచు నుండుదు రిట్టిచోట
నీ,వె కినుక న్నరుం బరిభవించినఁ బెంచిన చిల్కఁబట్టి చీ
కాకుపడంగఁ జేయుటయగా మదిలోఁ దలపోసి చూచినన్.

చ. మనమునఁ గోపగింపకుము మాధవ చిత్తమునం దలంప నీ
మనుజవిభుండు క్రొవ్వి యవమానముఁ జేసినవాఁడు
గాఁడు మన్నన యొనరింపు దైవికమునం దురగానన ఫేన
మింత జాఱినఁ దెగనేల సర్వమునెఱింగిన దేవుఁడ
వీవెఱుంగవే. 130

వ. అని చెప్పుమనియె నని విన్నవించి యతండు మఱియు నిట్ల
నియె. 131

క. వనజాక్ష! రాజధర్మం
బున శరణాగతునిఁ గావఁబూనె న్యాయ
జ్ఞునుఁ డించుక గురు గంగా
తనయ కృప ద్రోణిముఖ్య దార్ఢ్యులతోడన్. 132

తే. ధర్మతనయుండు పెక్కువిధముల నీకుఁ
బ్రియము చెప్పంగ నీయల్కపేర్చె నేల
యింతమాత్రంబునకు నెనరేల చెఱుచు
కొన మనలకును నామాట వినుము కృష్ణ. 133

చ. అనుఁ డొకయింత నవ్వి జలజాక్షుఁడు గన్గొనలందుఁ గెంపుఁ
జా,య నిగుడ రామసాత్యకిగదాసమబాణులఁజూచి పాండు
నం,దనుల నయంబు వింటిరె కదా తమమాట నిజంబుసేయ

నే, పెనఁగెద రింద్రుఁడుఁ విధుఁడుఁ బేర్చిన నావచనంబు
తప్పునే. 134

సీ. నీలాంబరుఁడు నవ్వె గేలిఁబెట్టె గదుండు
కృతవర్మ కన్నులు గీటె సాంబుఁ
డల్లన తలయూఁచె ససమబాణుఁడు భుజం
బప్పళించెను [1]జేతులార్చె నుగ్ర
సేనుండు చేవ్రైచెఁ జేకితానునిపైని
ననిరుద్ధుఁ డక్రూరుఁ డదిమె బుషభుఁ
జారుదేష్ణుండు రోషమునఁ బండ్లు కొఱికె
సారణుఁ డట్టహాసంబుఁజేసెఁ

తే. బెదవి విఱిచెను సాత్యకి మదము మెరసి
చూచె దీప్తిమంతుండు భోజులును యాద
వులును వార్ష్ణేయులును మది నలుకవొడమి
గుజగుజలుపోయి బీరముల్ గొనిరి మిగుల. 135

క. ఈరీతిఁజేయ సభ్యులఁ
దేరఁగఁ గని పాండుసుతుఁడు తెలిగన్నుల సాం
ధ్యారాగ మొదవ నుడుగని
వీరత్వము మెఱయ ననియె వినఁ జిత్రముగన్. 136

ఆ. నెనరు మనసులోన నిలిపి యీతెఱఁగున
సామభాషణములఁ బ్రేమతోడ
లోకులెల్ల మెచ్చ మీకుఁ జెప్పితిఁ గాక
బలిమి మమ్ము గెలువఁగలరె మీరు. 137

---

1 జతురాడెను గ్ర.

క. సకలాస్త్రకోవిదుని యు
ద్ధకళానిపుణుని విరోధిదర్పవనీపా
వకుని నసహాయశౌర్యా
ధికు నర్జును గెలువఁగలఁడె త్రిణయనుఁడైనన్. 138

వ. అనవుడు సహదేవునకు వాసుదేవుం డిట్లనియె. 139

చ. నిజము నిజంబు పాండుధరణీవరసూనులు మీరు మత్తది
గ్గజములవంటివారలు జగన్నుతశౌర్యనిధు ల్నతారిభూ
భుజు లతిశౌర్యు లుగ్రసురపుంగవ[1]నందనుఁడాహవోగ్రుఁ
డౌ,ట జగమెఱుంగు నక్కటకటా పలుమాఱును నెంచ
నేటికిన్. 140

చ. ఘనబలుఁడైన యానరుఁ డొకండు నదీతనయుండుఁ గుంభ
జుం,డును ధృతరాష్ట్రభూవరతనూజులు భానుసుతుండు
వాయునం,దనుఁడును ద్రోణజుం,డు వసుధావరులుం దమ
లావు మీఱఁ జే,కినిసిన యానృపాలు రణకేళిఁ జలంబునఁ
గావకుందురే. 141

వ అనిన బలభద్రుండు క్రోధారుణితలోచనుండై సహదేవుం
గటాక్షించి కృష్ణున కిట్లనియె. 142

చ. అనఘ భవద్భుజాబలమహత్త్వ మెఱుంగనివారికిట్టి ని
ట్లనిమెద రర్జునుండును మృణాకృతి నీఘనరోషవహ్నికిం
గనుఁగొన ధార్తరాష్ట్రు లనఁగా సరిదుద్భవకుంభజాతభీ
మ నకుల మిత్రసూనులన మాకొకలక్ష్య మెయెన్ని భంగులన్.

చ. ఘనతరదివ్యబాణములకుందువ శౌర్యముచేవ యైన య
ర్జునుఁడు భవద్విరోధి నృపరుం గదణించెను నీప్రతిజ్ఞ

1 తుల్యులునాహవోగ్రులౌ,ట.

మ్మా,యు నళిననేత్ర యంచుఁ దననోటికివచ్చినరీతి నాడఁ
గా, మనము గలంగె. నీపడుచుమాటలు మాకు సహింప
వేమియున్. 144

శా. హేళిం గేలఁ దెమల్తునో జగము లీరేడు న్వడిం
గ్రుంతునో, వ్యాళాధీశసమానమత్ప్రథులబాహాలాంగ
లాగ్రంబుచేఁ, గ్రోలన్ సప్తసముద్రనీరములు నా కెంజేతికిం
జెత్తునో, యాలోకంబునఁ గల్గు రాజు లనఁగా నేలెక్క
తక్కెంచినన్. 145

వ. అనుడు శీరపాణికిఁ జక్రపాణి యిట్లనియె. 146

తే. నాసహాయంబు లేకున్న నరుఁడు నరుఁడు
నాసహాయంబుగలిగిన నరుఁడు హరుఁడు
క్షత్త్రులంగెల్ల భీష్మాదు లెఱిఁగి యెఱిఁగి
యేల చేసిరి యిప్పని బేల లగుచు. 147

వ. అనుటయు సహదేవుం డదిరిపడి యిట్లనియె. 148

సీ. ద్రోణుని పంపున ద్రుపదుఁ దెచ్చినయప్పు
డబ్జాక్ష నీసహాయంబు గానెనో
దారుణ మత్స్యయంత్రం బేయునప్పుడు
నబ్జాక్ష నీసహాయంబు గానెనో
పాంచాలికై మహీపతుల గెల్చినయప్పు
డబ్జాక్ష నీసహాయంబు గానెనో
[1]సింధుదేశాధీశు సైంధవు గెల్చునాఁ
డబ్జాక్ష నీసహాయంబు గానెనో

1 ఖాండవవనమంతఁ గాల్చువచ్చిన యప్పు డబ్జాక్ష.

తే. యేల యీమాటలాడంగ నింద్రసూతి
యొకసహాయంబుఁ గోరునే యుగ్రమైన
గాండివంబును గవదొసల్ పాండురాశ్వ
విమలరథమును దేవదత్తమునుఁ దక్క. 149

వ. కావున జగదేకవీరుండును నసహాయశూరుండును నగు గాండీవితోడ భండనంబుసేయ నాఖండలాదు లోపరనినఁ దక్కినవారలం జెప్ప నేల యదియునుంగాక యతని సూరెల నున్న మహాయోధవరుల నెన్నెద నవధరింపుము. 150

చ. చతురంభోధిపరీతభూవలయరక్షాదక్షబాహాబలో
ద్ధతరాజన్యసమూహశుష్కగహనోద్యద్దావవహ్నిచ్ఛటా
యిత శాతోగ్రకుఠారభార్గవమదాహిస్తంభనోదగ్ర మం
త్రితమౌర్వీరవ భీష్ము భీష్ము నని వారింపంగ మీశక్యమే.

శా. దివ్యాస్త్రజ్ఞుఁడు, ఘోరసంగరకళాధిష్ఠాత, దక్షుండు, గౌ
రవ్యాచార్యుఁడు, మేరుధీరుఁ, డరి వీరక్షోణిభృద్వజ్రి,
భూరివ్యాళాధిప కోపనుం,డతిరథశ్రేష్ఠుండు, ద్రోణుండు శ
స్త్రవ్యాపారముసూప నిల్వఁగలవారా వీరలుఁ మీరలున్.

చ. కృపుఁడను పేరుగాని రణకేళి మెయిం దలపోసిచూడ ని
ష్కృపుఁ డతులప్రతాపుఁడు వశీకృతదివ్యశరుం డజేయుఁ
డు,గ్రపుఁదఱి వానిమ్రోలఁబడిరా విధియు న్మనఁజేయఁ
జాలఁ డ,ట్టి పురుషవర్యు గెల్వఁగలఁడే యొకఁడైన మురారి,
వీరిలోన్. 153

మ. నిటలాక్షాగ్ని[1]కణంబులై మెఱయ నిర్నిద్రప్రభావంబు మి
క్కుటమై గ్రాలఁగఁ గొండనాఁదగు మహాకోదండ

1 శరంబులై.

క. శల్యుఁడు నిహతాహితవా
త్సల్యుఁడు విజయప్రదోగ్ర శస్త్రాస్త్రకళా
కల్యుఁడు రణవిషమాంబక
తుల్యుఁడు సంగ్రామమున్నఁ దోడనె యుబ్బున్. 160
వ. మఱియును. 161
సీ. ద్రుపదుఁ డాయోధననిపుణుఁ డాతనిసూను
లంతకంబెను ఘను లాహవమున
విరటభూపతిమహావీరుఁ డాతనికంటె
బాహ్లికుఁ డతి భుజాబలధనుండు
సోమదత్తుఁడు రణోద్దాముఁడు భూరిశ్ర
వుండు భండనమున దండిమగఁడు
భగదత్తుఁ డరిమానభంజనుండు సుదక్షి
ణుఁడుఁ గేకయులును నీలుఁడును యవన
తే. విభుఁడు శకునియు విందానువిందనృపులు
రుక్మియును ధృష్టకేతుండు రూఢయశులు
పాండ్యనాథుండు సింధుభూపతియుఁ జూడఁ
జిచ్చు కబళింతురన నాజిఁ జెప్ప నేల. 162
వ. వెండియు దుశ్శాసనాదిధార్తరాష్ట్రకుమారవర్గంబును నంగ
వంగ కళింగ బంగాళాదినానాదేశాగతరాజపుంగవులును
సముద్రంబులు గలంచి యువ్వెత్తునఁ గులపర్వతంబులు పెక
లించి యవ్విజయుని ప్రతిజ్ఞ నిలుపఁబూని మదంబున దమ్ము
నెఱుంగకయున్నవా రదిగావున. 163
సీ. కపికేతనంబు భీకరతఁ దోఁపకమున్న
తొడరి గాండీవ మెక్కిడకమున్న

ఆ. అని ప్రతిజ్ఞ సేయ నఖిలలోకంబులు
వడఁకె గిరులు దూలె వార్ధు లింకెఁ
జుక్కలురిలె బ్రమసి సోమసూర్యులు త్రోవఁ
దప్పనడచి రింద్రతనయతనయ. 169

వ. అయ్యెడ సహదేవుండు పోయివచ్చెదనని బలభద్రాదులకు
నెఱింగించి కొలువుకూటంబు వెడలివచ్చి రథారోహణంబు
గావించి రయంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 170

తే. సకలరాజన్యులును బంధుజనులు సుతులుఁ
బాండవేయులుఁ గెలఁకుల బలసికొలువ
విదురసంజయు లిరుమేలఁ గదిసి నిలువ
నున్న ధృతరాష్ట్రుఁ గనుఁగొని యుచితభంగి. 171

క. పలికెఁ సహదేవుఁడు దా
నెలమిఁ ద్వారకకు నేగి కృష్ణుననిన మా
టలచందము నందుల కతఁ
డలిగి ప్రతినచేయుటయు బలాదుల తెఱఁగున్. 172

వ. ఇట్లు పలికిన యనంతరంబ. 173

క. కినుక దలిర్పఁగ దుర్యో
ధనుఁడుఁ దుశ్శాసనుండుఁ దర్పంబునఁ గృ
ష్ణునిపురికి నిపుడ కదలుద
మని తమకించుటయు భీష్ముఁ డను వారలతోన్. 174

వ. మీర లిక్కార్యంబెఱుంగరు నిలువుండని వైచిత్రవీర్యు
నుద్దేశించి యిట్లనియె. 175

సీ. ధర్మనందన సుయోధను లీచతుర్ధన
రక్షణార్థంబుగా రాజవరుల

బంధుల మిత్రుల గంధేభ సైంధవ
స్యందనభటుల నందంద కూర్చి
రనఘ యీపెన్మోన యష్టాదశాక్షౌహి
ణీసంఖ్య యయ్యె దాని న్నెలంపఁ
గావఁ గృష్ణునితోడఁ గయ్యంబు సేయంగ
మనయోధులందు సర్జునుఁడ కాని

తే. తక్కొరుం డింతభారంబు దాల్చి నిల్చు
వాఁడు లేఁడది గావున వాహినీప
తిత్వమున కీతఁ డంబ మరుత్వదాత్మ
జాతుఁ బట్టంబు గట్టుట చాల మేలు. 176

వ. అనిన నగుంగాక యనియె నంత నావివ్వచ్చుం డాదేవ
వ్రతున కిట్లనియె. 177

మ. అనఘా యిట్లని యానతీఁ దగునె యోధాగ్రేసరస్ఫూర్తి
మిం,చిన మీరుఁ గృపుఁడుఁ ధనుర్ధరుఁడు రాజీవాప్త
సూనుండు రా,జును భీముండును ద్రోణజుండు సకలక్షోణీ
శులు న్నిండి యుం,డినచో నా కభిషేకవైభవము దండిం
బూనఁ గర్తవ్యమే. 178

క. వీరలలోపల నొక బలు
వీరుం డొండేని లోకవిఖ్యాతుఁడవై
మీఱిన నీవొండెఁ జే
నారాజత్వంబు [1]దాల్చిన న్నేలరయన్. 179

క. ఏనును నానేర్పున నా
దానవరిపుతోడఁ బోరెద న్నీరుఁ దే

1 దాల్చినన్ మాత్రోలన్.

వానీకము నను మెచ్చఁగ
నానాశస్త్రాస్త్రముల రణస్థలి ననినన్. 180

వ. భీష్ముం డిట్లనియె. 181

తే. అనఘ, నీమాట యట్టిదయగు నిజంబు
వినుము వీరలనెల్లఁ గాదనుట గాదు
సకలవైరులయని యొక్కచంద మంబు
జోదరునితోడ రణము వేఱొక్కవిధము. 182

వ. కావున నీచతుర్థనుం గావను గృష్ణున కెదురించను నీవ సమర్థుండవు. నీపిఱుందన యుధిష్ఠిర దుర్యోధన దుశ్శాసన శకుని సైంధవ ద్రుపద విరాట ఘటోత్కచులును ధృష్ట కేతుండును సుదక్షిణ పాండ్య భగదత్తులును గేకయు లేవురును నీలుండును రుక్మియు శల్యుండును విందాను విందులును గూడఁ బదునేనమండ్రు నక్షౌహిణీపతులయ్యె దరు. వీరలు నేనును గురు కృపా-శ్వత్థామ కర్ణ బాహ్లీక సోమదత్త భూరిశ్రవులుం దక్కిన యోధవీరులును సంగ రంబున నీచెప్పినరీతిన తిరిగెదమనిన నయ్యర్జునుం డియ్య కొని నాకు సారథియుం జక్రరక్షకులును మహాయోధులు గావలయుననిన నతండున్నిగుల విచారించి యశ్వంతకు నక్షౌహిణీపతిత్వంబునకు నియమించి శల్యు సారథ్యంబు నకు నియ్యకొలిపి చక్రరక్షకత్వంబునకు నోడం బఱచిన నుత్తమోజుండును యుధామన్యుండును నట్ల గాక యని రంత. 183

తే. ఉత్తమంబైన యభిజిన్ముహూర్తమునను
భూసురాశీర్నినాదంబు బోరుకొనఁగ

జాహ్నవీనీరములచేత సవ్యసాచిఁ
జిత్తమలరంగ నభిషిక్తుఁజేసి మఱియు. 184

వ. ఇట్లు సకలాక్షౌహిణీపతిత్వంబునకు నయ్యర్జును నభిషిక్తుం జేసి మున్ను చెప్పిన పదునెనమండ్ర నేకైకాక్షౌహిణీనాయకత్వంబునకు నియోగించి యంత వృత్తాంతంబు నెఱింగించిన నోలగంబు చాలించి యందఱ ననిపి ధృతరాష్ట్రుం డభ్యంతరమందిరంబున కరిగె నెల్లవారలుఁ దమ తమ విడుదలకేగి సుఖంబుండిరని శుకయోగీంద్రుం డిలావంతునకుఁ జెప్పిన మీఁదటివృత్తాంతం బేమని యడుగుటయు. 185

శా. మందారద్రుమమంజరీస్రుతసుధా మాధుర్యవాగ్ధుర్య స
ద్బృందాంభోరుహ పద్మమిత్ర రిపు భూభృన్మంత్రి మంత్ర
క్రియా, సందోహాంబుధర ప్రభంజన కళా సర్వజ్ఞ మీనే
క్షణా, కందర్పాప్రతిగండభైరవ సమగ్ర శ్రీధనాధీశ్వరా.

క. హరిదంత దంతిదంత
ద్విరసనపరివృఢ వియన్నదీ శశి నాగా
భరణ సితాభ్రసితాభ్రా
మర భూరుహచారుకీర్తి మన్మథమూర్తీ. 187

స్రగ్విణి —
మాదయాపాత్ర సంపద్ధరామండలా
మాదయాత్మోద్భవా క్ష్మాసురాఖండలా
మ్రేదినీ భాను దీవ్యత్ప్రతాపానలా
మ్రేదినీరాడ్గభీరా ద్విడబ్ధానిలా. 188

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మ నామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్ర భారతం బనుపురాణకథయందు షష్ఠాశ్వాసము.



శ్రీ ర స్తు.

# చిత్రభారతము

## సప్తమాశ్వాసము.

---



కర నిజగోత్రార్థి సు
ధాకర నత రాజమకుటతటఘటితమణి
శ్రీకర [1]ఘృణిమయ పదయుగ
భీకర రిపుగోత్రవజ్ర పెద్దామాత్యా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషిత ముని జాతుండగు సూతుండు హరికథాశ్రవణాహ్లాదులగు శౌనకాదులకు నిట్లనియె నట్లుండఱుం దమతమ నివాసం బులనున్న యంత నర్జునానుమతంబున దుర్యోధనుండు సకలసైన్యంబులవారలఁ గురుక్షేత్రంబునకు నడువుండని చెప్పించి ప్రస్థానభేరి సఱపించిన. 2

సీ. పటుగదాతాడితఘటముచందంబున
బ్రహ్మాండభాండకర్పరము పగిలె
ఝంఝానిలాధూతశాఖిశాఖలభంగిఁ
గులవసుధాధరంబులు చలించె

---

1 మణిమయ.

చ. పిడుగులు నల్గడంబడియెఁ బెల్లుగ నెత్తురువానవట్టె మి
న్నడరెఁ దురంగపుచ్ఛముల నగ్నికణంబులు రాలెఁ గ్రైదు
వుల్, పొడిపొడియయ్యె మత్తగజపుంగవగండ మందాంబు
ధారలుఁ, దోడఁబడి యింకె సైనికధనుర్ధరు లాత్మ
భయంబు నొందఁగన్. 7

వ. ఇట్లు మహోత్పాతంబులు గనుంగొని యగ్గాండీవి శాంతన
వానుమతంబునఁ దచ్ఛాంతివిధానంబు గావించి నడచిన
యవసరంబున. 8

సీ. మత్తవారణగండమండలీనిస్సర
ద్దానధారల సముద్రములు పొంగ
నాశీరచరణగంధర్వరింఖోద్ధూత
ధూళిచే గగనసింధువు గలంగ
నిష్ఠురస్యందననేమిఘంటానినా
దముల హేమాద్రిసింహములు [1]చెదర
బరభయంకరవీర బలబాహుఖడ్గదీ
ధితులచేఁ జండాంశుదీప్తి పొదల
తే. విజయదుందుభికాహళవేణుశంఖ
మురజఢక్కాహుడుక్కాసమూహరావ
మఖిలదిక్కులు నిండ బ్రహ్మాండమగల
సేన లరుదెంచె నా కురుక్షేత్రమునకు. 9

క. పాండవులుఁ గౌరవులు భీ
ష్ముండును ద్రోణుండు ద్రుపదముఖ్యులు నచటన్
మండిత నివాసములయం
దుండిరి జయకాములగుచు నుచితప్రీతిన్. 10

1 శిరములు చెదర.

వ. అంత నర్జునుం డాత్మస్కంధావారంబునకు రక్షగాఁ దూర్పున ధృష్టకేతుని నాగ్నేయంబున విందానువిందులను దక్షిణభాగంబున సుదక్షిణుని నైరృతి ప్రదేశంబున నీలునిఁ బశ్చిమస్థలంబునఁ గేకయులను వాయవ్యంబున వంగాధీశ్వరుని నుత్తరంబున భగదత్తుని నైశాన్యంబున సింధుదేశాధీశ్వరుని వారి మధ్యంబునఁ బాంచాలరాజ మత్స్యవల్లభులను నియమించె నంతనమున్న సుయోధనునియోగంబునఁ బనులవారును సకలపదార్థంబులు వలయువారలకు నొసంగుచుండి రెల్లజనంబులు సంతోష భరితాంతఃకరణులై యుండిరని చెప్పుటయు. 11

క. అనవుడు శుకయోగికి న
ర్జునసూనుండనియె నాకురుక్షేత్రమునం
దనికై పాండవులుండిన
వనజాక్షుం డెవ్విధమున వచ్చె నచటికిన్. 12

తే. అనుడు శుకయోగి యయ్యర్జునాత్మజాతు
తోడ నిట్లనుఁ బాండుపుత్త్రులు శమంత
పంచకంబున నుంట యాప్తచరు లెఱిఁగి
విన్నవించిన నయ్యదువిభుఁడు నవ్వి. 13

వ. కొలువుకూటంబున కేతెంచి బలభద్రసాత్యకిప్రముఖులం బిలిపించి వారలతో నిట్లనియె జతుర్ధనరక్షణార్థం బర్జునునకు సహాయులై యవంతీవిభులగు విందానువిందులును విదర్భాధిపతియగు రుక్మియు యవనపాండ్యాధీశ్వరులును గాంభోజపతియగు సుదక్షిణుండును జేదిపతియగు ధృష్ట కేతుండును గేకయమహీశు లేవురును బ్రాగ్జ్యోతిషాధీశుం డగు భగదత్తుండును బాంచాలపతియగు ద్రుపదుండును

మత్స్యమద్రసింధునాథులగు విరాటశల్యసైంధవులును రాక్షసరాజేంద్రుండు నాదిగాఁగల నానాదేశాగత రాజన్యబలంబులు పదునాల్గక్షౌహిణులును ధర్మజ సుయోధనుల మూలబలంబులు నాలుగక్షౌహిణులునుగూడఁ బదునెనిమిదక్షౌహిణులయ్యె నంతటికి నర్జునుం డధిపతియై భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణ బాహ్లిక సోమదత్త భూరిశ్రవులు మొదలుగా సమస్తయోధులుం గొలువఁ గురుక్షేత్రంబున కేతెంచియున్నవారని చారులుచెప్పిరి కావున మన మచ్చటికిఁ బోవనలయు. వారలకు సమానులయిన మన యోధుల నేర్పఱచెదనని హలాయుధున కిట్లనియె.

సీ. నీవు భీష్మునకు శైనేయుఁ డశ్వత్థామ
కును వృకధ్వజుఁడు ద్రోణునకుఁ జేకి
తానుండు బాహ్లికతనుజాతునకు నని
రుద్ధుండు కృపునకు నుద్ధవుండు
మత్స్యేంద్రునకు దీప్తిమంతుండు రాజరా
జునకు సాంబుఁడు సూర్యతనయునకు గ
దుండు మారుతికి వృకుండు కేకయులకుఁ
జారుదేష్ణుండు దుశ్శాసనునకుఁ
ఆ. బుష్కరుండు పాండ్యభూపాలునకు గాంది
నీసుతుండు ద్రుపదునికి సునంద
నుండు నా సుదక్షిణునకును గృతవర్మ
శల్యునకు శుకుండు సైంధవునకు. 15

వ. వెండియుఁ దక్కిన యోధులు వారల యోధులకు నెనర్జునునకుం జాలుపడిన జయింపవచ్చునని కొలువు చాలించి యంతఃపురంబున కరిగె నందఱుం దమతమ నివాసంబు

లకుఁ జనిరంత నయ్యదువల్లభుండగు శ్రీకృష్ణుని యను
మతంబునఁ జారుదేష్ణుండు ప్రయాణభేరి వేయించినఁ 16

మ. శరధివ్రాతము పంకమై నిలిచె నక్షత్రంబు లుర్లె న్దిశా
కరిసందోహముమ్రొగ్గె భూధరము లాకంపించె సూర్యాగ్ని
చంద్రరుచుల్ మాసె నభంబు బిట్టడరెఁ బాతాళంబు
భీతిల్లె శంకర నీరేరుహాసంభవుల్ బ్రమసి రుగ్రంబైన భేరి
ధ్వనిన్. 17

వ. అయ్యవసరంబున యదువృష్ణిభోజాంధకాదులు యుద్ధ
సన్నద్ధులైరి. కృష్ణుండును సముచితశృంగారం బంగీకరించి
యంతఃపురంబు వెడలి. 18

తే. శైన్య సుగ్రీవ మేఘపుష్పక బలాహ
కములతో నరిచాపమార్గణగణాది
సకలసాధనములతోడఁ బ్రకట గరుడ
కేతనముతోడఁ దగు తేరు ప్రీతిఁ జూచి. 19

వ. ఆరథమునకుఁ బ్రదక్షిణము గావించి మహీదేవతల దీవనలు
గొని వాదిత్రనాదంబులు చెలంగ రథారోహణంబుచేసిన
బలభద్రసాత్యకిప్రభృతిభ్రాతృవ్రాతంబును ప్రద్యుమ్న
సాంబ సారణ చారుదేష్ణ దీప్తిమ ద్భానుభానువింద శుక
వృక పుష్కర వేదవాహ శ్రుతదేవ సునంద చిత్రబర్హ
చరూధికవిన్యగ్రోధాయుణాదికుమారసంఘాతంబును ననిరు
ద్ధాదిపుత్త్రసమూహంబును, నుద్ధవాక్రూరకృతవర్మ చేకితా
నాదిబంధుసందోహంబును గూడి తమతమబలంబులు గొలువ
నిజకేతన చ్ఛత్రచామరశంఖశరత్రాణతనుత్రాణ ధనుర్బా

ణాది నానావిధచిహ్నచిహ్నితంబు లగురథంబు లెక్కి
రయ్యవసరంబున. 20

సీ. శుభమస్తు దేవతాచూడావతంస యం
చు సరోజగర్భాదిసురలు వల్క
భద్రమస్తు సుపర్వపరిపంథిహార యని
సిద్ధమునీంద్రు లాశీర్వదింప
మంగళమస్తు రమానాథ యని యక్ష
వనితలు గర్ణపర్వముగఁ బాడ
విజయోస్తు తే జగద్వినుతవిక్రమ యని
వందిమాగధులు గైవారమొసఁగ

తే. నాగ ఘీంకారఘంటానినాదములును
ఘోరగంధర్వవిపుల హేషారవంబు
నిష్ఠురస్యందనోదగ్ర నేమిరావ
మును దిశల్ నిండఁ గదలె నా మురహరుండు. 21

వ. ఇవ్విధంబున నశేషబలసమేతుండై కదలి రాజమార్గంబున
నల్లనల్లన చనుదెంచు నప్పుడు. 22

తే. పౌరపుణ్యపురంధ్రు లభ్రంకష కన
కమయ సౌధాగ్రములనుండి కంసవైరి
మీఁదఁ జల్లిరి లాజసమ్మిళితపుష్ప
ములు జయధ్వను లాకాశమునఁ జెలంగ. 23

వ. అందు. 42

ఉ. అక్కట యింతమాత్రమునకై భువనంబులయందు నెల్లఁ
బే, రెక్కిన యాదవోత్తము లనేకులు గొల్వఁగ మేటి
కయ్యముల్, పెక్కులు గెల్చినట్టిహరి పెంపునఁ దాఁ జన

నేల యిందులో, నొక్కఁడ చాలు నోర్వఁగ రణోర్విని
గౌరవపాండవేయులన్. 25

క. అని పలుకువారు కొందఱు
ఘను లర్జునమూఁకలోనఁ గలరు నదీనం
దన గురు కర్ణాశ్వత్థా
మ నకుల కృప వాయుతనయ మద్రేశాదుల్. 26

క. వారలయం దొక్కొక్కఁడ
యీరేడుజగంబులందు నెక్కుడు కడిమిం
దేరినవారలు వీరలు
నారూఢబలాఢ్యులిఁక జయము విధి యెఱుఁగున్. 27

క. అనువారలునై చూడఁగ
మనుజులుఁ దనుజులును గొల్వ నతిసంతోషం
బున సేనలు మున్నుగ న
వ్వనజాక్షుఁడు వెడలె ద్వారవతిపురమునకున్. 28

వ. అప్పుడు. 29

సీ. పరశు తోమర గదా ప్రాస కృపాణ చా ✓
పశరాఢ్యులై వీరభటులు చనఁగ
సమరసన్నాహభీషణయోధజనమనో
రథసమానంబులై రథము లరుగ
నిజవేగజితమనో నిలజవవాజిసం
హతి ధరాతలము గ్రక్కదలఁ బర్వఁ
బృథులఘంటాజాతభీషణారావంబు
సురల బెగ్గిలఁజేయఁ గరులు నడవ

తే. నా మహాభారమోర్వక యవని క్రుంగ
దిక్కరులు మ్రొగ్గ శేషుండు దిరిగె ముడుక

కచ్ఛపంబును దలయెత్తఁ గానదయ్యెఁ
గ్రోడమును నిల్వనోపక కొమ్ము వంచె. 30

వ. ఇవ్విధంబున బంధు భ్రాతృ పుత్త్రమిత్త్రాదిజనంబులు పరివేష్టించి కొలువ శమంతపంచకంబునకుం జనుదెంచి యంతకమున్న పన్నినం గనుపట్టు పట్టాంశుకవిరచితాభ్యంతర నివాసంబులును, నీలపటకల్పితానల్ప కుంజరశాలలును, ధవళాంబరకృతమందురలును, చిత్రచేలనిర్మితంబులగు గుడారంబులును, విలసిల్లు నిజశిబిరంబు గోధూళికాలగ్నంబునం బ్రవేశించి సాత్యకి ప్రద్యుమ్నానిరుద్ధాదుల నయ్యైతావుల నుండ నియమించి బలభద్రాదుల నుచిత స్థానంబుల కనిపి రథంబు డిగ్గి యభ్యంతరంబున కరిగి. 31

తే. నలిననేత్రుండు పన్నీట జలకమాడి
వస్త్రభూషణమాల్యముల్ వరుసఁ దాల్చి
బుధులతోఁ గూడి సంధ్యాదివిధులు దీర్చి
యన్నపానాదికృత్యంబు లాచరించి. 32

క. అరవిరిపూఁబానుపుపై
మురాంతకుఁడు పవ్వళించె ముద్దియ లడుగుల్
పరిపరిలాగుల నొత్తఁగ
మరువపుసురటీలు వీవ మది ముదమొదవన్. 33

వ. అనవుడు నుదారస్వాంతుండగు నిలావంతుండు హరిగుణానురాగియగు శుకయోగి కిట్లనియె. 34

క. హరి యివ్విధమున సేనా
పరికరములతో శమంతపంచకమునకుం
ద్వరితముగ వచ్చినంతట
హరిసూనుం డేమిచేసె నానతియీవే. 35

వ. అనుడు శుకయోగీంద్రుం డిట్లను నాతెఱంగున వారు సుఖ నిద్రం జెందినఁ దత్సైన్యంబులవారలును మజ్జనభోజనాది కృత్యంబులుదీర్చి విశ్రమించిరంత నిక్కడఁ బాండవస్కంధా వారంబున నొక్క రమ్యప్రదేశంబునఁ గనదీపికాలంకా రంబులు వెలుంగ బాహ్లికాది కురువృద్ధులును ద్రుపదాది బంధులును ద్రోణాది మాన్యులును గర్ణాది[1]వీరులును ధర్మజ సుయోధనాది పౌత్రులును బరివేష్టింపఁ గాంచన పీఠికాసీనుం డై యున్న గాంగేయునకు నర్జునుం డిట్లనియె.

మ. హరి యేతెంచె సమస్తబంధువులు సైన్యాధీశులుక్ నందనుల్ కరిగంధర్వరథాశ్వసేనలు సమగ్రప్రీతిఁ గొల్వంగ సం గరకేళీపరులై మదీయరథులుం గాల్బలవ్యూహస్నారు ని ర్భరదర్పంబున మించి రేపకడ సంగ్రామంబు సేయందగున్.

క. అనుడుఁ గిరీటికి గంగా
తనయుం డిట్లనియె నతని తలఁపెఱిఁగి ప్రియం
బున నట్లే చేయుద మీ
జననాథుల ననుపు యుద్ధసన్నద్ధులుగాన్. 33

వ. అన నప్పార్థుండు పార్థివోత్తములం గనుంగొని యిట్లనియె.

మ. హరితో నీధరణీవరాగ్రణికినై యాయోధనక్రీడకుక్ బురికొంటన్ననుఁ గూడి మేనులు తృణంబుల్ గా విచారించి వీరరసోద్రిక్తమనస్కులై మెఱయువారల్ నిల్వుఁడాత్మక్ శరీరరతిం జెందినభూవరుల్ చనుఁడు పుత్త్రభ్రాతృసం యుక్తులై. 40

వ. అనిన వారెల్లను నైకమత్యంబున నర్జునున కిట్లనిరి. 41

---

1 ప్రభులును.

క. సురనాథతనయ సంగర
ధరణిని బ్రాణంబులొసఁగెదము "కా చింతా
మరణే రణే" యనెడు పలు
కెలుఁగ మె నీకేల మమ్ము నిట్లాడంగన్. 42

వ. అనిన నల్లని యెల్లి కయ్యంబునకుఁ జయ్యన సన్నద్ధులై
రండని యనిపిన నెల్లవారలుం దమతమ విడిదలకరిగిరి.
అనంతరంబ భీష్ముండును బాహ్లిక ద్రుపదాదులును నిజ
నివాసంబులకుంజనిరి. వారలచేత ననుజ్ఞాతుండై తాను
నిజస్థానంబున కరిగి యుచితప్రకారంబున నుండె నంత. 43

క. తెలతెలవేగినఁ బణిహా
రులచే నన్నరుఁడు భూవరులకు దొరలకున్
బలములతో నాయితమై
నిలుఁడని చెప్పించె నంత నిజశిబిరములన్. 44

సీ. పక్కెరల్[1]వన్నింప భద్రదంతావళ
ఘటలుగావించు ఘీంకారరవముఁ
బల్లనల్ గట్టుచో నుల్లాసముగఁ జేయు
సైంధవశ్రేణి హేషారవంబు
నాయితమొనరింప నందంద తిరుగంగఁ
దేరులఁ బరఁగు చక్రారవంబు
సన్నద్ధులగుచు నుత్సాహంబుతో వీర
వరులొనరించు నాహ్వానరవము

తే. విజయ భేరీమృదంగాది వివిధతూర్య
రవములొక్కటఁ దివి భువి నవియఁజేయఁ

1 వేయుచో.

బూర్ణచంద్రోదయాత్యంతఘూర్ణమాన
సాగరంబును బోలి తత్సైన్యమడరె. 45

వ. అయ్యవసరంబున సూర్యోదయంబైనఁ జతురంగబలంబులు
సవరణలఁ గనుపట్టి నేల యీనినచందంబున సంగరంబు
నకు నరుగం దొడంగె నంత. 46

సీ. కాంచన పద్మరాగశ్రేణిచే నొన
ర్చినయట్టి దివ్యకిరీటమమర
నతులిత వజ్రమయంబై యభేద్యమై
తనరు వర్మము మేన ఘనతమీఱ
మరకతమాణిక్యమయదండయుక్తప్ర
తాపాంకవానరధ్వజము మీఱ
నంభోజసంభవస్యందనరథ్యవి
భ్రాజితగంధర్వరథము మెఱయ
తే. మద్రనాథుండు నొగలపై మహిమఁ జెలఁగ
గాండివంబును గవదొనల్ కాంతిఁ బూని
దేవదత్తనినాదంబు దిశలు నిండ
విజయుఁ డత్యుగ్రమూర్తియై వెడలె ననికి. 47

వ. వెండియు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణ బాహ్లీక సోమ
దత్త భూరిశ్రవులును ధర్మజ భీమ నకుల సహదేవులును
దుర్యోధన దుశ్శాసన దుర్ధర్షణ దుష్ప్రసహాది ధార్తరాష్ట్ర
శతంబును ద్రుపద శిఖండి ధృష్టద్యుమ్నాది పాంచాల
వర్గంబును విరాట ధృష్టకేతు సుదక్షిణ యవన నీల
విందానువిందులును కేకయమహీపాలు రేవురును భగ
దత్తాలంబుస హాలాయుధ ఘటోత్కచాదులును రుక్మి

సైంధవ శకున్యాది నానాదేశాధీశ్వరులును దమ తమ చతు
రంగబలంబులు గొలువ రథారూఢులై నిజకేతన చ్ఛత్ర
చామరాది నానాలాంఛనంబులు మెఱయ, శంఖంబులు
మ్రోయించుచు నొండొరుల సంగరోచితాలాపంబులాడుచు
నద్దేవేంద్రనందనుం జూడ నడచిరంత నందఱుం గలయం
జూచి. 48

సీ. వివిధశస్త్రాస్త్రప్రవీణులై తగు వీర
బలము నొక్కొక్కడు బారుకొలిపి
వానికిఁ బ్రాపుగా వాయువేగములైన
గుఱ్ఱంపుదళములఁ గుదుకఱచి
వానికిఁ గాపుగా నానారణక్రియా
శూరులచే మీఱు తేరులునిచి
వానికి బాసటగా నున్నతద్విప
ప్రచయంబు చాలుపువాఱఁజేసి
తే. నడుమ నొక్కొక్క రాజు నేర్పడఁగ నునిచి
యనిమిషాధీశనందనుం డనువెఱింగి
మానుషవ్యూహ మొనరించె భూనుతముగ
సకలయోధులుఁ జూచి యాశ్చర్యమొంద. 49

వ. ఇవ్విధంబున మానుషవ్యూహంబుఁ బన్ని యందునకుముం
దట గాంగేయ రాధేయులును దానును వామభాగంబున
గురుకృపాశ్వత్థామలును దక్షిణపార్శ్వంబున భీమ ధృష్ట
ద్యుమ్న ఘటోత్కచులును నడుమ యుధిష్ఠిర నకుల సహ
దేవ దుర్యోధన దుశ్శాసనాదులును జతుర్ధనుండును వెనుక
బాహ్లీక సోమదత్త భూరిశ్రవులును నెడనెడ ద్రుపద

శిఖండి విరాట ధృష్టకేతు కేకయ నీల సుదక్షిణ విందాను
విందులును భగదత్తాలంబుస హాలాయుధ రుక్మి సైంధ
వాదులు తమతమ తనుత్రాణ శిరస్త్రాణ చాపబాణతూణం
బులు ధరియించి హస్త్యశ్వరథారూఢులై వీరాలాపంబులు
నిగుడం బడమరమొగంబై నిల్చిన నమ్మొన పరభయం
కరంబై యుండె నంతకమున్న యక్కడ. 50

మ. వనజాక్షుండును వైణికోత్తములు భవ్యప్రక్రియంబాడ
మేల్కని కాలోచితకృత్యముల్ నడపె నక్కాంతేయు
లాయోధనంబున కేతెంచువిధంబెఱింగె బలరాముండు
న్మదింబొంగి గొబ్బున సేనల్ వెడలింప వేత్రసమితింబుచ్చెన్
రణక్షోణికిన్. 51

వ. తదనంతరంబ. 52

ఆ. గరుడకేతనంబు గగనంబు నొరయంగ
ఖడ్గబాణచాపగదలమెఱుఁగు
లెల్లదిశలు నిండ నెలమి దారకుఁ డర
దమ్ముఁ దేరఁ గడుముదమున నెక్కి. 53

మ. రమణీయంబగు పాంచజన్యజనితారావంబు గర్జావిశే
షముగా ఖడ్గమరీచిజాలము తటిత్సంఘంబుగా నుగ్రచా
పము దేవేంద్ర శరాసనంబుగను శుంభత్కృష్ణమేఘంబు
పార్థ మహాగ్నిచ్ఛటమీఁదికేగె శరధారాఖేల నోన్మాదియై.

వ. మఱియును. 55

ఉ. విధ్వమలాంశురేఖయన వెల్లనిగాత్రము చెంగలింపఁ దా
లధ్వజమొప్ప సీరముసలంబులు భీషణవృత్తిఁ జూప శం
ఖధ్వని లోకజాలములు గంపమునొందఁగఁ జేయ వచ్చెన

భ్రాధ్వమునన్ సురాళి గొనియాడఁ బ్రలంబవిరోధి యా
జికిన్. 56

ఉ. అత్యధిక ప్రతాపము జనావళి సన్నుతిఁ జేయ సంగరా
చిత్యము మీఱ వర్మము విచిత్రకిరీటముఁ దాల్చి శస్త్రసాం
గత్యమునన్విరోధులకుఁ గాలుఁడనం గడు భీకరాకృతిన్
సాత్యకి వచ్చె భర్మరథజాలము వ్రేయఁగ యుద్ధభూమికిన్.

శా. విద్యుల్లీలఁ జెలంగు ఖడ్గలతికావిర్భూతరుగ్జాలముల్
ఖద్యోతప్రభ నించఁ శంఖరవ మాకాశంబునం బర్వ యు
ద్ధోద్యోగంబున మత్స్యకేతనముతో యోధావళుల్వెంట
రాఁ, ప్రద్యుమ్నుం డరుదెంచె వైరికులగోత్రచ్ఛేదదంభో
ళియై. 58

మ. ఘనబాణాసన బాణకుంతపరిఘా ఖడ్గంబులన్నించు మిం
చినతేరున్నతలీల నెక్కి సిడమున్ జిత్రాతపత్రంబు మీ
ఱ నవీనోజ్జ్వల దివ్యవర్మము శిరస్త్రాణంబుఁ జూపట్టఁగా
ననిరుద్ధుం డనిరుద్ధవృత్తి నడచెన్ హర్షంబు సంధిల్లఁగన్.

శా. చండప్రక్రియ మేఘడంబరము లాశాచక్ర మొక్కుమ్మడిన్
నిండన్నవ్యరథంబుపై నిలిచి తూణీరంబులున్ సజ్యకో
దండంబున్ ధరియించి కంకటశిరస్త్రచ్ఛన్నుఁడై చారుదే
ష్ణుం డేతెంచె మహోజ్జ్వలాకృతి రణక్షోణీజయోత్సా
హియై. 60

ఉ. అంబుజలోచనప్రతిముఁ డాహవకేళిధురంధరుండు బీ
రంబున విల్లు నమ్ములుఁ గరంబులఁ బూని విపక్షభీకరా
డంబరవృత్తి దిక్కులు వడంక మహారథమెక్కి వేడ్కమై
సాంబుఁడు వచ్చె వాహినులసంఖ్యలు గొల్వఁగ యుద్ధ
భూమికిన్. 61

సీ. ఇద్ధసంగ్రామస్థలోద్ధవుం డుద్ధవుం
డుగ్రసేనుం డాజినుగ్రసేనుఁ
డభియాతిరాజమహాక్రూరుఁ డక్రూరుఁ
డరితమోనిచయోద్యదరుణుఁ డరుణుఁ
డతులితధీరతాకృతవర్మ కృతవర్మ
కాంచనమణిమయాంగదుఁడు గదుఁడు
దారుణ సమరైకతానుండు చేకితా
నుం డాస్యజితపుష్కరుండు పుష్క
తే. రుండును శుకుండు దీప్తిమంతుండు భాను
విందుఁడు సునందనుండును వేదవాహుఁ
డును బృహద్భానుఁడును వృకుండును రథంబు
లెక్కి చనిరనికి ధరణి గ్రక్కతిలఁగ. 62

వ. మఱియు భానుదేవుండును సారణుండును శ్రుతదేవుండును వరూధియుఁ జిత్రబర్హియు నాదిగాఁగల యోధులు దమ తమ సేనాసమేతులై యొండొరులఁ గడవఁ బంతంబులు వలుకుచు సింహనాదంబులు సేయుచు శంఖంబులు పూరించుచుఁ గృష్ణునింగూడి చని రంత నిరంతరదానధారా గంధలుబ్ధ పుష్పంధయ ఝంకారబధిరిత దిక్తటంబులై చలితఘంటాఘణఘణారావ నిజఘీంకార ప్రతిధ్వనిత చక్రవాళాచల గహ్వరంబులైన మత్తదంతావళంబులును, మత్తదంతావళ మదజలకలితమార్గ దుర్గమకర్దమంబుడెక్కల త్రొక్కుడులచే నింకిపగిలి బీటలై రజోవికారంబుఁజెంది యొగసి మొగసిచూచు గంధర్వ గరుడసీమంతినుల సీమంతసీమలసిందూరరేఖలై తత్కబరీభర విలసిత మందారతరు

ప్రసూన నిష్యందమానమరందమదవ దిందిందిరంబులపైఁ
బుష్పాడియొప్పునంగప్పి మెఱయ నడతెంచు భీషణ హేషా
ఘోషంబుల జయసూచనంబు చేయు వాయువేగ తురంగం
బులును, వాయువేగ తురంగంబుల గట్టిపఱచి సారథులు
వలసినయెడలకు నడిపింప యుద్ధసన్నద్ధులగు రథికులకు
నెఱకలై యెఱకలువచ్చిన భుజంగమంబుల తెఱంగునం
దనరు విచిత్రకేతనంబులును, గేతనంబులఁ బొలుపొంది
యాత్మచక్రనేమిధ్వానంబులచేత శైలగహ్వరంబుల ని
ద్రించు సింగంబుల మేలుకొల్పు రథంబులును రథంబుల
కంటె వడిగలిగి ధనుర్బాణపట్టిసప్రాసపరశ్వధశూలభిండి
వాలకరవాల తోమరక్షురికాగదాది నానావిధాయుధ
సన్నద్ధులై యుబ్బున నిబ్బరంబైన బెబ్బులుల చందంబునఁ
గోదమసింగంబుల తెఱంగునం బొంగి నింగి పగుల
నార్చుచు నొండొరులఁ గడవఁ బఱతెంచు వీరభటులుం
గలిగి యెడలేక ఘోషించు విజయభేరీమృదంగ కాహళా
దుల యారావంబుల నమరి యిరువది యక్షౌహిణులుం
గనుపట్టు నాత్మసేనాసముద్రం బర్జునద్వీపంబు ముంపుట
కునై యెదురునడచి నిల్చిన. 63

ఉ. ఆ హరి పాండవేయులు నయంబునఁ బన్నినయట్టి మానుష
వ్యూహముఁజూచి యందునకు నోర్చి జయించుటకై మహా
చల, వ్యూహ మొనర్చినంత నరియోధులు విస్మయ మొంది
సంగరో, త్సాహముఁ దక్కిరాత్మల భుజంగమరాజసుతా
తనూభవా. 64

వ. అని మఱియు నిట్లనియె నట్లు పన్నిన యమ్మొగ్గరంబుముం
ఖదఁ దానును బలభద్రుండును సాత్యకియును వామ

భాగంబునఁ గృతవర్మ ప్రద్యుమ్నానిరుద్ధులును దక్షిణ
పార్శ్వంబున గద సాంబ చారుదేష్ణులును మధ్యప్రదేశం
బున బంధుమిత్రామాత్యసహితుండై సెలయేరులతోడి నడ
గొండలనఁ బొల్చు గంధసింధురంబులు పరివేష్టింప రథా
రూఢుండై యుగ్రసేనుండును బశ్చాద్భాగంబున నుద్ధ
వాక్రూరచేకితానసారణాదులును నెడనెడ బృహద్భాను
భానుదేవ శ్రుతదేవ వృక శుకారుణాదికుమారులునుం
దమతమ యడియాలంబులు మెఱయనుండిరి. వారల
యుద్ధంబుఁజూడ నంతకమున్న పురందరాది బృందారకులు
విమానారూఢులై యంతరిక్షంబున నిల్చిరంత. 65

క. మోహరములు రెండును స
న్నాహంబునఁ దారసించినన్ ఫల్గున సే
నాహంకృతి యుడివో ను
త్సాహంబున శౌరి పాంచజన్యంబొత్తెన్. 66

క. వెండియు రాముఁడుఁ బ్రద్యు
మ్నుండును సాత్యకియు సారణుండును ననిరు
ద్ధుండును గృతవర్మయు సాం
బుండును శంఖంబులపుడు మొరయించిరొగిన్. 67

తే. సకలయాదవసేన యుత్సవముతోడ
సింహనాదంబు లొనరింప సింహనాద
ములు యటంచును భీతిపెంపునఁ గిరీటి
బలములోఁగల కుంజరంబులు వడంకె. 68

వ. మఱియుఁ గృష్ణుని సైన్యంబునందు విజయభేరీశంఖ కాహ
ళాదులు మొరయించిన నారావంబు ప్రళయకాల ఘూర్ణ

మానార్ణవధ్వానంబు ననుకరించె సకల యోధవీరులును
గయ్యంబునకుఁ గాలుద్రవ్వుచు ధనుర్గుణటంకారంబులు
నిగిడింపుచుఁ జతురంగబలంబుల మున్ను నడపించిరంత. 69

క. ఈకైవడి హరిసేనా
నీకము నడ తేరఁ జూచి నిష్ఠుర కోపో
ద్భ్రాకౌటిల్యమున సుభ
ద్రాకాంతుం డపుడు దేవదత్తంబొత్తెన్. 70

సీ. తదనంతరంబున ధర్మపుత్త్రుం డనం
తవిజయంబును వృకోదరుఁడు పౌండ్ర
మును మాద్రిపెద్దనందనుఁడు సుఘోషంబుఁ
దెలివిమీఱఁగ సహదేవుఁడు మణి
పుష్పకంబును నదీపుత్త్రుండు గురుఁడును
గృపుఁడు ద్రౌణియుఁ గురుక్షితివిభుండు
హైడింబుఁడును ద్రుపదాధీశుఁడును మత్స్య
పతి వికర్ణుఁడు నలంబుసుఁడు నర్క
తే. పుత్త్రుఁ[1] డాదిగ యోధులద్భుతముగాఁగ
శంఖములను మ్రోయింపఁ దత్స్వనములను
విజయదుందుభి తమ్మటవ్రజరవంబుఁ
గూడి యొక్కట సర్వదిక్కులుఁ బగిల్చె. 71

ఉ. వాసవిఁ జేరవచ్చి మనవారలకుఁ సెలవిమ్మటంచు దు
శ్శాసనుఁ డాడి యవ్విభుని సమ్మతినొంది చెలంగి యాత్మ సే
నాసమితిన్ రయంబున రణంబునకుం బురికొల్పునంత ను
ల్లాసముతోడ నమ్మొన చలంబున యాదవసేన దాఁకినన్.

1 దు మొదలుయోధు.

చ. హరులు హరుల్ రథావళి రథావళి యోధులు యోధు
లుగ్రకుంజరములు కుంజరంబులును సందడిగాఁ దలపడ్డ
నప్పుడ బ్బరవస మిట్టిదట్టిదనిప ల్కఁ దలంప నశక్యమయ్యెనా
సరసిజసూతికైనను భుజంగమహారునకైనఁ జూడఁగాన్.73

వ. మఱియు నుభయసైన్యంబులం గనుపట్టు వీరభటులు చటులచక్రచంక్రమణవిలాసనిరుపమాభ్యాసులై యీసున రేసి పోతరించి యాఁబోతులరీతి గంధసింధురంబుల చందంబునఁ గోదమసింగంబుల తెఱంగునం దలంపడి పోరుచోఁ గఠోరంబుగ వారలు మీఱినపంతంబుల నంతంతకు నడుగులెక్క లెక్కగొనక యొండొరుల నేరుపునం బొడువఁ గడువడిఁ గ్రిందుపడి నిప్పులొలుక సరి దాటులుగ విళంగీలవయిచుచు బిరుదునం దివురుకొను నెడ వెఱపులుగని కుమ్మి నెమ్మి సంతసిల్లి అంకెలువైవ నంకంబులను సూడిపట్టి నెట్టనఁ జంపి చచ్చువారలు, నద్దాయుధంబులఁ బ్రవీణులై సంచలింపక యొకండొకండు పదుగు రేగురతోడ భ్రమరీ విశేషంబులం జరియింపుచు డాయుచు వ్రేయుచు నొండొరుల వ్రేట్లుదప్పించి దాఁటుచు నీటున నరి కెదిరించి యుఱుకుచుఁ బరస్పరహేతిగతుల నంగంబులు వ్రీలినఁ బిఱికివాఱక సాహసంబున మించి నేల గొఱగువారును, నానావిధాయుధానీకంబులు ధరియించి బంటుతనంబున శూరులతోడం దలపడి సంగరప్రకారంబునం బెఱవారలు చూచుచుండఁ బోరాటం బొనరించుచు హుంకారంబు నిగిడించుచు నొక్కసాధనంబు దమమేను నొంప నది నెత్తురు కాఁక వీకఁ దిగువరాకున్న నొండొక

యాయుధంబుగొని నఱక నదియుఁ దుత్తుమురైన వేఱొక
శస్త్రంబునఁ బొడిచి విడిచి పుడమి యద్రువఁ గలియంబడి
బాహాబాహిం బెనంగి త్రెళ్లువారును, గైదువులంకించి
అంకెలువైచుచుఁ బదువురు నేవురు జోకలై యురువడించి
మేనులు సింపుచుఁ బొంచి పొంచి పదలాఘవంబుల నెదిరి
యితరేతరముష్టాముష్టి మోములుపగులఁ బోరి పడువార
లును, మఱియు నూఱు నిన్నూఱుఁ దుటుముతుటుములై
చటులగతిం గయ్యంబులుసేయఁ జొచ్చి హెచ్చినగర్వం
బున నన్యోన్యప్రాసంబులఁ గర్ణాద్యవయవంబులు దెగిన
సిబ్బితి నిబ్బరంబై మగుడఁజాలక విడనిమచ్చరంబునఁ గచా
కచిం బెనంగి మడియువారును సహస్రసంఖ్యలగు శూరులు
గుంపులై గర్వంబు పెంపున మూఁకల కుఱికి గదలఁ గదల
నీక పోరి యొండొరులయేట్ల లుకలుకలై కూలువారలును,
దమతమ దొరలు తెరలియొరఁగు టెఱుంగక యరిగియరిగి
తిరిగివచ్చి పతులకడఁ జతురతఁ బోరి ప్రాణంబులు విడుచు
వారలును, మున్నొకని గుఱిచేసి కూడం జనునెడ నడుమ
నొకండు దలద్రెంచినం బడక వాని నఱికి పడిపొరలు
మొండెంబులును, ననుజులుం దనుజులుం జుట్టంబులు
మొదలగువారలు పోరునెడ నడుమ సొచ్చి తెంపుచేసి
మృతిఁబొందువారలును, భయంకరంబైన పాలికలనం
దొరఁగు రక్తమాంసపుఁదిట్టలు సూచి వెఱచి తలకోక
లెఱుంగలేక వెఱ్ఱియాటలాడుచు నుభయసైన్యంబుల
వారలు చూచి నవ్వఁ బరువులువెట్టువారును గశాతాడ
నంబునం జేసి తురంగమంబులం గదలించి డాసి యితరే
తర ప్రహారణంబుల నశ్వపల్యాణసహితంబుగా వ్రేటాఱు

తునియలై కీలుదప్పిన బొమ్మలచందంబునం గూలు రాహు
త్తులును నంకుశాఘాతకుపితంబు లై యొండొంటి మర్మం
బులు గాడ దంతాదంతింబోరి మావంతులతోడఁ బీనుంగు
లైన యేనుంగులును, సారథులురవడించి యుగ్యంబుల
పగ్గంబులు వదలి కదియఁద్రోలినఁ బరస్పరబాణఘట్టనల
రథంబులు తిలప్రమాణఖండంబు లై దొఱఁగిన విరథులై
కరవాలంబులుం బలుకలుంగొని యోలమాసగొనక యొం
డొరుం డాసియు వ్రేసియుఁ దప్పించియుం గుప్పించియుఁ
బోరిపోరి పొలిసిన రథికులుం గలిగి యాసందడి కయ్యంబు
భయంకరంబై యుండెనంత. 74

ఉ. వాసవనందనుం గడచివచ్చి వికర్ణుఁడు డోడుగాఁగ దు
శ్శాసనుఁడేచి సాంబుని నిశాతశరంబులనేయ నవ్విభుం
డీసును మచ్చరంబు మది హెచ్చఁగఁ గృష్ణుఁడు మెచ్చ
నార్చి యుల్లాసముతోడ వాఁడి దెరల న్విశిఖంబుల నొంచి
వెండియున్. 75

క. శరముల రెంట వికర్ణుని
తురగంబుల నొంచి పడగఁ ద్రొమ్మిదితూపు
ల్వాఱపి పొడిచేసి సారథి
నురువడి నొకకోలచేత నుక్కడఁగించెన్. 76

ఉ. అత్తఱి దుస్ససేనుఁడు రయంబునఁ దీవ్రశరంబుచేత వీ
రోత్తము సాంబునొంచి మఱియుం బదునేను మెఱుంగు
టమ్ము లు,వ్రేత్తున సారథిం దగులనేసి తెరల్చినఁ గృష్ణనంద
నుం, డొత్తిలి శాతబాణమున నొక్కటనేసె నతండు
మూర్ఛిలన్. 77

చ. కడువడి సారణుండు తెలికన్నులఁ గెంపుదలిర్ప నగ్రజుం
గపచి శరవ్రాయంబున వికర్ణునిసారథిఁ జంపి యుబ్బునన్
శిత నిసమూడుబాణములఁ జెక్కలువాపుచు వాని
బాహువుల్, వైరివపుఃస్థ లాలు వఱపెన్ గగనంబు
గలంగ నార్చుచున్. 78

ఉ. వాఁడును రోషమెత్తి హరివాహిని బెగ్గిల సాంబుతమ్ముని
న్వాఁడి నిశాతబాణముల నొంచి హయంబులఁ గేతనంబుఁ
గ్రొవ్వాఁడి శరంబులేసి నెఱవాదితనంబునఁ ద్రుంప
నాతనిన్, బోఁడిమిమీఱ్చి యార్చెఁ గురుపుంగవ సైన్యము
దైన్యమొందఁగన్. 79

తే. అది గనుంగొని కృష్ణసైన్యంబులెల్ల
నార్చి భేరులు మ్రోయింప నర్జునుండు
తనబలంబులఁ బురికొల్పి తానుఁ గడఁగి
తోరముగఁ కిన్కఁ దోడఁ బ్రద్యుమ్నుఁ దాఁకె. 80

తే. అతనిపై జాలుకొన ముంచెనంపవెల్లి
మీనకేతుండు నతనిపై మించి నూఱు
సాయకంబులు వఱపె మాద్రేయు లలిగి
చారుదేష్ణునిఁ దాఁకి రుత్సాహమొదవ. 81

క. ఆ రుక్మిణీకొమరుండును
వారలరథ్యములమీఁద వడి నూఱమ్ముల్
తోరముగ నేయ వారును
ఘోరాస్త్రములేసి హరులఁ గూల్చిరి నేలన్. 82

వ. అంత. 83

సీ. సురనదీసూనుండు హరిపూర్వజుని మేన
నాలుగుబాణముల్ నాటె నతఁడు
కోపించి హలముచేఁ గూల్చె రథ్యంబుల
భీముండు సాత్యకిఁ బేర్చి మూఁడు
శరములనేసిన బరవసంబున వాఁడి
తూపుల నేడింటఁ దునిమెఁ బడగ
ద్రోణుండు కృతవర్మ దోడరి తొమ్మిది నార
సంబులు పరఁగింపఁ జండసాయ

తే. కముల నేనింట నతఁడు దత్కంకటంబు
చూర్ణముగఁజేసె నల్కమైఁ గర్ణుఁ డంబ
కంబు లిరువది ననిరుద్ధుఁ గాఁడ నేయ
నతఁడు నన్నింట నొప్పించె నతని మేను. 84

తే. ద్రౌణి వడిఁ జేకితానుని తనువు మూఁడు
బాణముల నొంచె నతఁడు నక్షీణశక్తి
నాలుగమ్ముల నతని గంధర్వములను
దనువు లెడఁబాపి యొకటఁ గేతనముఁ ద్రుంచె. 35

తే. బాహ్లికుం డుగ్రసేనునిఁ బదిశరముల
నొంచె నాతండుఁ దూపులేను నిగిడించె
నతనిదేహంబు దల్లడమంద సోమ
దత్తుఁ డొకయమ్ముచేత నుద్ధవునిఁ గ్రుచ్చె. 36

క. భూరిశ్రవుఁ డరుణునిపై
ఘోరాస్త్రంబులరవది నిగుడ్పఁగ నాతం
డీరేడు వెడఁదతూపుల
సారథి రథచాప కేతుజాలముఁ ద్రుంచెన్. 37

వ. వెండియు ధర్మనందనుండును, సుయోధనుండును, ఘటోత్క చుండును, నీలుండును, కేకయులును, ద్రుపదుండును, విర టుండును, సుదక్షిణుండును, విందానువిందులును, గురు కరూశాది దేశాధీశులును నొక్కుమ్మడి శరపరిఘ శక్తి తోమర శూలాది బహువిధాయుధంబుల నరిబలంబులు బడలువడ నుద్దండవృత్తి మోదుపఱచి రందు ఘటోత్క చుండు 88

శా. మార్వీరావము దిక్కులందు వెడల న్మాయాబలస్తోముఁడై వార్వాహంబున మింటికిం జని శిల ల్వర్షించు నొక్కొక్కచో, గర్వోద్రిక్తమనస్కుఁడై రథికులన్ ఖండించు నొక్కొక్కచో, దుర్వారాశుగకోటిఁ గాలుబలముం దూలించు నొక్కొక్కచోన్. 89

వ. మఱియును. 90

మ. ఒకచో నాఱుచు నొక్కచోఁ జటుల చాపోల్లాసము ల్సేనవారికిఁ గానంబడఁజేయు వేఱ యొకచోఁ గ్రీడా గతిం గుంజరప్రకరంబు న్వడిఁ జెండివైచు నొకచో రథ్యం బులన్ గూల్చునొం, డొకచోఁ జీఁకటిఁ గొల్పునంపగమిచే నుద్దామతేజంబునన్. 91

క. ఈరీతి నింద్రనందను
వారలు వెఱఁగందఁ గృష్ణువాహిని గలఁగన్
ఘోరాస్త్ర పరంపరచే
వారక పదివేలరథుల వడి మడియించెన్. 92

ఉ. వెండియుఁ గృష్ణుసైన్యములు వీఁగి సనన్వడిఁ ద్రోలఁ జూచి సాం, బుండును సాత్యకిం గలసి పూనికతోడ ఘటో

త్కచుర్ మహా, కాండము లేసి నొంచి తురగంబుల పించ
మడంచి సారథిన్, గుండెలు వ్రీలఁ జేయుటయు ఘోర
పరాక్రమవృత్తి నాతఁడున్. 93

ఉ. ఒండురథంబుపై కుఱికి యుగ్రత సాత్యకిఁ గృష్ణనందనుం
బెండుపడ న్నిశాతశరబృందము లేసిన వారలిద్దఱున్
వెండియు భీమనందనునివిల్లుసిడంబును దేరు సారథిం
జండతరాశుగ ప్రతతిఁ జక్కుగఁ జేసి చెలంగి యార్చినన్.

క. విరథుండై యవ్వీరుఁడు
కరమున గదఁ బూని విలయకాలుండనఁగాఁ
బఱతేరఁ జూచి సాత్యకి
శరముల నేనింట దానిఁ జక్కుగ నేయన్. 95

క. అనిరుద్ధుండును ఝషకే
తనుఁడు బలుఁడు సారణుఁడు నుదగ్రస్ఫూర్తిన్
ఘనబాణజాలముల నొం
చిన నాతఁడు ౘచ్చుపడి విచేష్టితుఁ డయ్యెన్. 96

వ. అప్పుడు. 97

క తనతోడుకుఁ బెక్కురథికులు
గనుకని నొప్పింప నుదరి కడువడిని మరు
త్తనయుఁడు ప్రశయాంబుదని
స్వనమొ యన నార్చి బాహుసారము మీఱన్. 98

ఉ. సారణు నైదుతూపులను సాంబుని దొమ్మిదిసాయకంబుల
న్నీరిఁ బదేడుబాణముల నిష్ఠురపత్త్రుల రెంట సాత్యకిన్
క్రూరశరంబుచేత ననిరుద్ధుని మూరుని మూఁడుకోలలం
దూఱఁగ నేయ వారలును దోడనె కప్పిరి భీము నమ్ములన్.

వ. వెండియు. 100

మ. అనిరుద్ధుం డొకతూపుచేత బకదైత్యధ్వంసిచాపంబు గ్ర
క్కున ఖండించె బలుండు నాగట రథాంగంబు ల్వడం
గొట్టెఁ గే,తన మాసాత్యకి ద్రుంచివైచె విలసత్కాండ
ద్వాయి స్త్రీనకే,తను డుగ్ర సాంబుఁడు నేసి రాశుగతతిం
దత్కాయ మత్యుద్ధతిన్. 101

వ. అంత. 102

మ. గదచేఁ ద్రిప్పుచు రౌద్రవైఖరి మహాకల్పాంతక ప్రౌఢి బె
ట్టిదుఁడై భీముఁడు చండభాస్కరునికిం బెక్ దీవ్రమై నెమ్మొ
గం,బు దలిర్పం గనుదోయి నిప్పులుసలక్ భూమండలం
బెల్ల గ్ర,క్కదలక్ రాముని తేరు దక్షిణము నుగ్రైరాలఁ
గొట్టె న్వడిన్. 103

శా. ఆవీరుండును బాదచారియయి బ్రహ్మాండంబు గంపింపఁ
గ్రో,ధానష్టంభమునక్ మరుత్తనయు సంహారంబు గావిం
పఁగా, వేవేగం బఱతేఁ గన్గొని మహావీరుండు పార్థుండు
రో,షావేశంబున నేగుదెంచెఁ బరయోధానీకము ల్బెగ్గిలన్.

వ. అతనితోడన యుత్తమౌజుండును, యుధామన్యుండును,
ధృష్టద్యుమ్నుండును, విరాటుండును, రుక్మియు, భగదత్తుం
డును, కేకయులును నేతెంచి రంతకమున్న. 105

శా. అశ్వత్థామయు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణాచార్యుఁడుం
గర్ణుఁడుక్, విశ్వంబెల్ల వడంక నార్చి సమరోర్వీరేణుసం
ఘంబు న్మ్రాక్స్వం గ్రమ్మ శతాంగముల్వాఱపి తాలాంకున్న
దంబేద నీ,ల శ్వేతోరుగరుద్వితానశరజాలంబేయఁగా
నత్తఱిన్. 106

త్కుచున్ మహిఁ, గాండము లేసి నొంచి తురగంబుల పించ
మడంచి సారథిన్, గుండెలు వ్రీలఁజేయుటయు ఘోర
పరాక్రమవృత్తి నాతఁడున్. 93

ఉ. ఒండురథంబుపై కుతికి యుగ్రత సాత్యకిఁ గృష్ణనందనుం
బెండుపడ న్నిశాతశరబృందము లేసిన వారలిద్దఱున్
వెండియు భీమనందనునివిల్లునిడంబునుఁ దేరు సారథిం
జండతరాశుగప్రతతిఁ జక్కుగఁజేసి చెలంగి యార్చినన్.

క. విరథుండై యవ్వీరుఁడు
కరమున గదఁ బూని విలయకాలుండనఁగాఁ
బఱతేరఁ జూచి సాత్యకి
శరముల నేనింట దానిఁ జక్కుగ నేయన్. 95

క. అనిరుద్ధుండును ఋషకే
తనుఁడు బలుఁడు సారణుఁడు నుదగ్రస్ఫూర్తిన్
ఘనబాణజాలముల నొం
చిన నాతఁడు ఱిచ్చపడి విచేష్టితుఁ డయ్యెన్. 96

వ. అప్పుడు. 97

క తనతోడుకుఁ బెక్కురథికులు
గనుకని నొప్పింప నుదరి కడువడిని మరు
త్తనయుఁడు ప్రళయాంబుదని
స్వనమో యన నార్చి బాహుసారము మీఱన్. 98

ఉ. సారణు నైదుతూపులను సాంబుని దొమ్మిదిసాయకంబుల
న్నీరిఁ బదేడుబాణముల నిష్ఠురపత్త్రుల రెంట సాత్యకిన్
గ్రూరశరంబుచేత ననిరుద్ధుని మారుని మూఁడుకోలలం
దూఱఁగనేయ వారలును దోడనె కప్పిరి భీము నమ్ములన్.

వ. వెండియు. 100

మ. అనిరుద్ధుం డొకతూపుచేత బకదైత్యధ్వంసిచాపంబు గ్ర
క్కున ఖండించె బలుండు నాగటఁ రథాంగంబు ల్వడం
గొట్టెఁ గేతన మానాత్మకుఁ ద్రుంచివైచె విలసత్కాండ
ద్వయి న్మీనకేతనుఁడున్ సాంబుఁడు నేసి రాశుగతతిం
దత్కాయ మత్యుద్ధతిన్. 101

వ. అంత. 102

మ. గదచేఁ ద్రిప్పుచు రౌద్రవైఖరి మహాకల్పాంతక ప్రౌఢి బె
ట్టిదుఁడై భీముఁడు చండభాస్కరునికిం బెన్ దీవ్రమై నెమ్మొ
గంబు దలిర్పం గనుదోయి నిప్పులుఁ రలన్ భూమండలం
బెల్లఁ గ్రక్కదలన్ రాముని తేరు దక్షణము నుగ్గై రాలఁ
గొట్టె న్వడిన్. 103

శా. ఆవీరుండును బాదచారియయి బ్రహ్మాండంబు గంపింపఁ
గ్రోధావష్టంభమునన్ మరుత్తనయు సంహారంబు గావిం
పఁగా, వేవేగం బఱతేరఁ గన్గొని మహావీరుండు పార్థుండు
రోషావేశంబున నేగుదెంచెఁ బరయోధానీకము ల్బెగ్గిలన్.

వ. అతనితోడన యుత్తమౌజుండును, యుధామన్యుండును,
ధృష్టద్యుమ్నుండును, విరాటుండును, రుక్మియు, భగదత్తుం
డును, గేకయులును నేతెంచి రంతకమున్న. 105

శా. అశ్వత్థామయు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణాచార్యుఁడుం
గర్ణుఁడున్, విశ్వంబెల్ల వడంక నార్చి సమరోర్వీ రేణుసం
ఘంబు సప్తాశ్వుం గ్రమ్మ శతాంగముల్వఱపి తాలాంకున్న
దంబేద నీల శ్వేతోరుగరుద్వితానశరజాలం బేయఁగా
నత్తఱిన్. 106

శా. అభ్రధ్వానసమానశార్ఙ్గనినదం బాకాశసంచారులన్
విభ్రాంతిం బొరలింపఁ జేతనయుచు న్విష్ణుం డత్యంత శో
భాభూరిమండలి భగ్నులై మెఱయ శుంభత్పాంచజన్యా
రవా, దభ్రవ్యాప్తి మహీధ్రము ల్వడఁక దైత్యధ్వంసి
యై తెంచుచున్. 107

సీ. భీష్మునిమ్మూట నొప్పించి యశ్వత్థామఁ
బదియేనుతూపులఁ బాఱఁగొట్టి
ద్రోణుని నిరువదిబాణంబులఁ దెమల్చి
భీముని మున్నూట బెండుపఱచి
కర్ణుఁ బండ్రెండుమార్గణముల నొనేసి
ద్రుపదనందను మేనఁ దూపుపొన్చి
మత్స్యనాయకుని మైమఱు వాఱుశోణితములఁ
జించి యొక్కట రుక్మి నొంచి నరక
తే. తనయ కృపులను నిష్ఠురాస్త్రముల గ్రుచ్చి
కాండపంచకమునను గేకయుల నొగ్చి
నిమిషమున నొక్క యక్షౌహిణీబలంబుఁ
బిలుకుమారిచె నానాస్త్రముల నరేంద్ర! 108

వ. అయ్యవసరంబున నర్జునుండు గర్జత్కాలమేఘంబు చందం
బున సింహనాదంబుఁ జేసి దేవదత్తంబు పూరించి కర్ణ
గాంధారేయాదులఁ గయ్యంబునకుఁ బురికొల్పిన. 109

ఉ. వారలు తూర్యబంధురరవంబు లెసంగఁ* సింహనాదముల్
బోరనఁ జేసి యద్భుతముఁ బొందిసురల్ గన శౌరి సైన్య
ముల్, దారుణలీలఁ దాఁకినఁ బడంపడి యయ్యదుయోధ

వర్యులుం, ఘోరపరాక్రమస్ఫురణం గోల్తలంజేసిరి పార్థ
నందనా. 110

వ. అందు బలభద్రుండును భీష్ముండును, సాత్యకియు నశ్వత్థామయు, ప్రద్యుమ్నుండును ద్రోణుండును, జేకితానుండును సోమదత్తుండును, ననిరుద్ధుండును గృపుండును, గృతవర్మయు ధృష్టద్యుమ్నుండును, నుగ్రసేనుండును బాహ్లికుండును, సాంబుండును గర్ణుండును, నక్రూరుండును నజాతశత్రుండును, నుద్ధవుండును ద్రుపదుండును, గలియు విరాటుండును, గదుండును భీముండును, సారణుండును ఘటోత్కచుండును, జారుదేష్ణుండును దుశ్శాసనుండును, దీప్తిమంతుండును దుర్యోధనుండును, భానుదేవుండును భూరిశ్రవుండును, బృహద్భానుండును ధృష్టకేతుండును, రుక్మియు భానువిందుండును, వృకుండును గేకయులును, వరుణుండును భగదత్తుండును, బుష్కరుండును పాండ్యాధీశ్వరుండును, యవనాధిపుండును వేదవాహుండును, శ్రుతదేవుండును సుదక్షిణుండును, సునందనుండును నీలుండును, జిత్రబర్హియు వరూధియు, విందానువిందులును న్యగ్రోధుండును, నకుల సహదేవులును దక్షిన యోధులును దుర్మర్షణాదులును, హేతిప్రాసపరశ్వధ పట్టిస భిండివాల ధనుర్బాణ నానావిధాయుధ సన్నద్ధులై యొండొరుల వ్రేసియుం ద్రోసియుం ద్రుంచియుం జించియుం బొడిచియు నడిచియుం జిమ్మియుం గ్రుమ్మియు మొత్తియు హత్తియు ననేకప్రకారంబులం జమిలికయ్యంబు సేయునెడం గుంజరంబులం గుంజరంబులును, ఘోటకంబుల ఘోటకంబులును, నరదంబుల నర

దంబులును, బదాతులఁ బదాతులుం దలపడి పిఱుతివియని
బీరంబునఁ బరస్పరశస్త్రంబులఁ బొడిచియు నొడిచియు,
వ్రచ్చియు గ్రుచ్చియుఁ గుదిపియుఁ జదిపియుఁ గొట్టియు
ముట్టియు ననేకోపాయంబులఁ బోరుసమయంబున. 111

క. రారాజు తమ్ములెల్లన్
ఘోరమదేభముల నెక్కికొని యఱువదివే
లేరుపు లేనుంగులతో
నారామునిమీఁదికేఁగ నతఁడుద్వృత్తిన్. 112

క. ఏనిక మొత్తము లెదిరెదు
నే నిఁక మొత్తక యడంగ నెగ్గునని మ
త్తానేకపములఁ గొన్నిటిఁ
బీనుంగులఁ జేయఁదొడఁగెఁ బేర్చినకినుకన్. 113

వ. అట్టియెడ నాసుయోధనుతమ్ములు దుష్ప్రహ దుర్మర్షణ
దుర్ముఖ దీర్ఘబాహు భీమబాహు భీమ సుషేణ సులోచన
సేనాపతి జలసంధ విచిత్ర తర్షణోగ్రాలోలుపులు పదు
ముప్వురును మత్తకుంజరంబుల నొక్కపెట్టునం డీకొల్పి
చుట్టుముట్టిన నతం డందఱికి నన్నిరూపులై హాలంబునన్
దగిలిచి తిగిచి ముసలంబునఁ దత్కుంభమధ్యంబులం దివిచి
జంభారాతి కుంభినీధరంబుల దంభోళిచేఁ గూల్చుచందం
బున నందంద కూల్చి దుష్ప్రహుసామజంబుతోడన చదిపి
తత్సోదరుఁడగు భీమునిశిరంబు డొక్కసొర నడఁచి
తత్కుంభికుంభములు వగులంవన్ని యనంతరంబ భీమ
బాహుం డురవడించి తన దంతావళంబుచే నష్వీరునిం
బొడిపించిన నతం డచలాకారుండై తద్దంతిదంతంబులు

వెఱికి వానిన వాని నేనుంగుతోడఁ బీనుంగుఁ గావించినఁ
దక్కిన పదుగురును దలపడి సింహనాదంబులుచేసి యెదిరినఁ
నా హలాయుధుండు వారలతోడన యవ్వారణంబుల
మారిమసంగి పొంగి నింగి నగులనార్చిన. 114

ఉ తమ్ములు సచ్చిరంచును సుయోధను బలికి యర్జునుఁ జేరవచ్చి శో
కమ్మున రాజరాజుపలుకన్ సురరాజతనూభవుండు వే
గమ్మున రాజులన్ గజనికాయములుం దనతోడ రాఁగ
నొ,క్కుమ్మడిఁ దన్నుఁదాఁక బలుఁ దుర్గతితోడ హలంబుఁ
ద్రిప్పుచున్. 115

చ. నిలిచిన సర్వసైన్య ధరణీవరముఖ్యులు రేఁగి సాయకం
బులు నిగిడించి రాకసము పోఁడిమి గానఁగరాకయుండ న
బ్బలుఁడును వానిఁ గైకొనక బంధురహస్తహలంబుచేత
రా,జులఁ బొలియించి వాజుల వసుంధరఁ గూల్చె రథాలి
నూర్చఁగాన్. 116

ఉ. అర్జునుఁ డగ్నికల్ప నిశితాశుగముల్ పరఁగించి వానిపై
నూర్జితశక్తి సూప నతఁ డుగ్రగ నాఁగలిఁ గేలఁ ద్రిప్పుచున్
నిర్జరనాథనందనుని నేలకుఁ దే నడ తేర సీరి వి
స్ఫూర్జితమూర్తిచూచి దివిజుల్ భయమంది చలించిరందఱున్

వ. అయ్యవసరంబున భీమసేనుం డర్జునుం దలకడచి యమ్మహా
వీరు నెదురునెడఁ బ్రద్యుమ్నానిరుద్ధ సాత్యకి కృతవర్మ
గద చేకితానులు రథారూఢులై కదలి పాండవ సేనా
మధ్యంబున నొక్కండును బాదచారియై భీమార్జునుల
మీఁద నురువడించు బలభద్రుం గనుంగొని వాయు వేగం
బున వచ్చి విచ్చఁచుంచఁగ చక్కి. 118

సీ. సాత్యకి యిరువదిసాయకంబుల శల్యు
నేసెఁ బ్రద్యుమ్నుండు నేడు వెడద
తూపుల వర్షంబు దూఱనిగిడ్చెఁ గ
దుండు తొంబదియాఱు కాండములను
గపికేతనము సించె విపులాస్త్రములునాల్గు
కృతవర్మ హయములఁ గీలుకొల్పెఁ
జేకితానుండు నిశితభల్లముల రెంటఁ
దఱిమి గాండీవంబుదాఁక నేసె
తే. మీనకేతనసూనుండు మెఱుఁగులొల్కు
రత్నపుంఖశరంబు లుగ్రంబు గాఁగ
భూనభోంతర మదరంగ నా నిలింప
సార్వభౌమాత్మజుని నేసె గర్వమడర. 119

వ. అప్పుడు. 120

ఉ. ఆ జగదేకవీరుఁడగు నర్జునుఁ డంద ఱకన్ని తూపులై
రాజితపుంఖసాయక పరంపర లభ్రమునిండ నాత్మ నే
నాజను లెల్ల నుబ్బ గదనం బదునార్వుర నొక్క పెట్టునం
గాజుపడంగ నేసెఁ దెలిగన్నులఁ గెంపుదొలంక వెండియున్

సీ. కృతవర్మసారథిఁ గెడపె మూఁడమ్ముల
గదునిపై నాల్గు మార్గణము లేసె
నంబకయుగళి సాత్యకిమేన నాటించెఁ
గ్రూరాస్త్రమున ననిరుద్ధుసీడము
పడవైచెఁ బుడమిని బ్రద్యుమ్ను నక్షుద్ర
భల్లసంహతి మూర్ఛపాలు చేసె
నతనిసారథి నేరుపడర నవ్వీరునిఁ
గొనియేగెఁ దమ సైన్యమునకు వేగ

తే. చేకితానునియురము నిశితమహాస్త్ర
పంచకమ్మున గ్రుచ్చె నప్పార్థుఁ డంతఁ
గర్ణ గాంగేయ గురు కృపు ల్గడిమి మెఱసి
హరికిఁ గ్రేడించి తత్సేన కరిగిరపుడు. 122

శా. ధృష్టద్యుమ్నుఁడు నా సుయోధనుఁడు మాద్రీసూనులున్
సంగరావష్టంభోజ్జ్వలమూర్తులై హరిని దివ్యస్ఫూర్తిబా
ణంబులన్, ధృష్టప్రక్రియనేసి యార్వ నతఁడున్ ధీరా
త్ముఁడై యందఱం, జేష్టల్ దక్కఁగ శార్ఙ్గముక్త విశిఖశ్రేణి
న్వ్యాసం జేసినన్. 123

మ. భగదత్తుండు నలంబుసుండును విదర్భస్వామియున్ సైంధ
వుం,డు గురుప్రోద్భవుఁడున్ హలాయుధ విరాటుల్ నీలుఁ
డుం గేకయుల్,దగుభూపాలురుఁగూడి యవ్విభునిమీఁదన్
మార్గణవ్రాతముల్, నిగుడంజేసి ధరాతలంబు వడఁకన్
విక్రాంతులై యార్చినన్. 124

తే. అప్పు డయ్యంపవెల్లికి నరుదుగాఁగ
సంచలింపకయుండె నా సారసాక్షుఁ
డంబుదంబులు జలధార లగ్గలముగఁ
గురియఁ గనుపట్టు నీలాద్రి తెఱఁగుమీఱి. 125

వ. తదనంతరంబ యతఁడు. 126

సీ. భగదత్తు మేన డెబ్బదితూపులడరించి
ద్రౌణిబాహ్లికుల శరద్వయము నాఁటి
నారాచయుగళి సైంధవువిల్లు ఖండించి
మూఁడుబాణము లలంబుసుని మేనఁ

గిలించి యొకవాఁడికోల రుక్మిఁ దెమల్చి
ద్రుపదనందను[1]నిపైఁ గ్రూరభల్ల
[2]పంచకం బేసి యంబకషట్కమున సుయో
ధను మూర్ఛనొందించి ఘనశిలీము

తే. ఖములరెంట విరాటువక్షంబు వ్రస్సి
కవల నెనిమిదియమ్ములఁ గాడ నేసి
కాండవింశతి నీలగేకయుల గ్రుచ్చి
యుగ్రమార్గణమున హలాయుధుని నొంచె. 127

వ. అయ్యవసరంబున. 128

ఉ. వీరరసంబు వెల్వడిన వీఁకను[3] రక్తము గ్రమ్మ నద్దొర
లొక్కరకితోరుకింశుకములోయనఁ బొల్చియు ధీరచిత్తులై
తోరముగాఁగనార్చి జయదుందుభు లొక్కట మ్రోయఁ
బేర్చియ,వ్వీరశిఖామణిం దఱిమి వేయిశరంబుల నేసి రుద్ధతిన్

ఉ. అత్తఱిఁ గృష్ణుఁడార్చుచు మహాశుగసంహతి వానినన్ని
టిన్, దుత్తుమురై పడంగ వడితో నొసరించుచు వారి
కెల్ల వి,ల్లెత్త శరంబులెత్తఁ దలలెత్త నశక్యముగాఁగనేసె
ను,వ్వెత్తున యాదవోత్తములు హెచ్చఁగఁ బాండవసేన
భీతిలన్. 130

చ. మఱియు నతండు వారలఁ దెమల్పఁగఁ బూని తదీయ
వాజులన్, నెఱి చెడఁగొట్టి సారథుల నేలపయిం బడఁ
ద్రోచి తేరుల, న్విఱుగఁగమోఁది కేతువులు విండ్లును

1 మేను దూసిపాఠ. 2 భల్లపంచకమేసి బాణషట్కమున సుయోధ
ను మూర్ఛపా లొనరిచి వి౹. 3 మేనులఁ గ్రమ్మనెత్తురులొక్కరకితోరుకింశుక
ములో.

నొక్కటఁ ద్రుంచి వర్మముల్ పఱియలు చేసి తత్తనువులన్
నిగిడించె ననేకబాణముల్. 131

తే. వారలెల్లను విరథులై పోరికెడఁగఁ
దలఁగిపోయినఁ గృష్ణుఁ డుద్దండ[1]లీల
నరిబలంబులు దల్లడమందఁ జూచి
యశనికల్పాశుగంబు లేయంగనంత. 132

క. ఒరలెడు మత్తేభంబులుఁ
దెరలెడు తురగములు నేలఁ ద్రెళ్లెడు రథముల్
పొరలెడు యోధులు నల్గడ
పఱలెడు రక్తంబులయ్యె వాసవిసేనన్. 133

వ. అది గనుంగొని యర్జునుండు. 134

శా. కృష్ణుం దాఁకి గుణధ్వనుల్ నిగుడ నక్షీణాశుగశ్రేణి న
త్యుష్ణజ్వాలలు గ్రమ్మనేయ నతఁడుం దోర్దండనవారించి యా
జిష్ణుప్రోద్భవు మేన శాతశరరాజిన్నిండఁ గీలింప వ
ర్ధిష్ణుండై యతఁడున్ మదింగనలి శౌరిన్ముంచె వాలమ్ములన్.

వ. మఱియును. 136

ఉ. మచ్చరమెచ్చఁ గృష్ణుఁడు సమగ్రభుజాబలలీలఁ బేర్చి వి
వ్వచ్చుని దేహమంతయును వాఁడిశిలీముఖకోటి నుద్ధతిన్
గ్రుచ్చ నతండు నాహరి నకుంఠితవైఖరి నట్లు చేయఁ గ
మ్మచ్చులరీతిఁ బొల్చిరపు డా దనుజారియు నా కిరీటియున్.

వ. ఇవ్విధంబున నా కృష్ణార్జునులు మనంబున ఘనంబగు మచ్చ
రంబున రామరావణుల కైవడి నంధకాంతకాంతకుల
లాగున జలధరంబులచందంబున గర్జనతర్జనంబులు నిగుడ

---

1 ప్రతి.

హుంకారతంకారంబులు మెఱయఁ బోరుచుండిరంత ఘటో
త్కచాలంబుస హలాయుధులును బాహ్లిక సోమదత్త
భూరిశ్రవులును ధృష్టకేతు సాల సుదక్షిణులును విందాను
విందులును గేకయ మహీపాలు రేవురును యవనపాండ్యాధి
పతులును ద్రుపద విరాట రుక్మి సైంధవులునుఁ గూడి యాదవ
సైన్యంబు దైన్యంబునొంద శంఖంబులుపూరించియు ధను
ష్టంకారంబులు గావించియుఁ గ్రూరనారాచంబుల మేనుల
గ్రుచ్చియు శరంబుల నురంబుల వ్రచ్చియు భిండివాలం
బుల గుండెలు వ్రీలనొంచియు భల్లంబుల శిరంబులు డొల్లఁ
ద్రుంచియుఁ జేర్చి యార్చి రయ్యవసరంబున. 138

సీ. బాహ్లికుఁ డుఱక యంబకములు మూఁడు గ్ర
సేనుపైఁ బఱపినఁ [1]జీడ రేఁగి
యతఁ డొక్కతూపున నతనివిల్లుండించి
యాఱుబాణముల రథ్యములఁ జంపి
విరథుఁడై తను నేయ కురువృద్ధుపై శక్తి
యడరింప నది ఘోరమగుచు వచ్చి
యతనివక్షస్థ్సలం బవలీల నాఁటిన
నెత్తురు గ్రక్కుచు నేలఁ గూలె

తే. నది గనుంగొని తత్పుత్త్రుఁడైన సోమ
దత్తుఁ డా భోజపతిమీఁద దారుణాస్త్ర
కోటు లడరించి యొకవాలుగొని రథమున
కుఱికి యాతని తల తెగ నఱకెఁ గడిమి. 139

వ. మఱియు. 140

---

1 జిష్ణు రేఁగి.

క. ఆయుగ్రసేను రథికుల
వేయివిధంబులఁ గలంచి విగతాసులుగాఁ
జేయుచు బాహ్లికనందనుఁ
డాయోధన భీష్మమూర్తియై తను నొంపన్. 141

తే. నూఱుతూపులఁ జేకితానుండు సోమ
దత్తుపై నేసె నతఁడు చేయెత్తకుండ
మఱియుఁ బిడుగున కెనయైనమార్గణమున
నలిగి యేసిన నవ్వీరుఁ డవనిఁ గూలె. 142

వ. ఇట్లు సోమదత్తుండు పడిన. 143

తే. పార్థసేనలు దుఃఖవిభ్రాంతిఁ బొందె
హరివరూథిని సంతోష మడరి యార్చె
నది గనుంగొని మత్స్యేంద్రుఁ డలుకతోడ
నుద్ధవునిఁ దాఁకి యేసె శరోత్కరమున. 144

క. ఆతఁ డవి నడుమఁ జడియుచు
భూతల మగలంగ నొక్క భూరితరాస్త్రం
బాతనిపై నిగుడించిన
భూతము లార్వంగఁ దనువు బోరన విడిచెన్. 145

వ. ఇవ్విధంబున మత్స్యమహీనాయకుండగు విరాటుండు దెగినఁ దద్బలంబులు హాహానినాదంబుగావించె నయ్యాదవనాయకుబలంబులు సింహనాదంబొనరించె నంతఁ బాంచాలపతి క్రుద్ధుండై యుద్ధవునిపై శరపరంపరలు వరఁగించిన నతండును దోర్దర్పోన వారించె నయ్యవసరంబున ద్రుపదుండు. 146

తే. ఆఱుతూపుల నతనిరథ్యములఁ దునిమి
నాలుగమ్ముల సారథి నఱికి యొక్క
కోల విలుద్రుంచి వర్మంబు ప్రీల రెండు
శరములేసి యతనిమీఁద శక్తిఁ బఱపె. 147

క. అది భూతల మద్రువంగా
నదరులు గ్రక్కుచును వచ్చి యాయుద్ధవు బె
ట్టిదముగఁ దాఁకుడు ధరణిం
జదికిలఁబడి కూలె పార్థుసైన్యములార్వన్. 148

వ. ఇవ్విధంబున నుద్ధవుండు సమిద్ధరణింబడిన నడలుచు నక్రూ
రుండు క్రూరనారాచంబుల ద్రుపదు గ్రుచ్చి నాలుగుబాణం
బుల ఘోటకంబులఁ గూల్చి సారథి నొక్క నిశాతశరంబున
శిరంబు ద్రుంచి కేతుచ్ఛత్ర చామరంబులు భూతలంబునం
దొరలించిన నతండు విరథుండై వాలునుం బలకయుం
బూని సింహచంక్రమణ విలాసంబున నతని తేరిపయింగవి
యుడు నతం డనేక నిశితశరంబులం బరఁగింపం దనవాలున
జడియుచుఁ జేర నేతెంచిన నయ్యక్రూరుం డర్ధచంద్ర బాణం
బున నప్పాంచాలపతి మూర్ధంబు ద్రుంచి సింహనాదంబు
గావించిన. 149

క. ఆ రవము విని శిఖండి మ
హారోషం బెత్తి చూడ్కి యక్రూరునిపై
ఘోరముగ నిడి రయంబునఁ
జేరఁగ నేతెంచి పటువిశిఖములఁ గప్పెన్. 150

తే. అతఁడు నేర్పునఁ ద్రుంచె నాయంబకముల
మఱియు ద్రుపదాత్మజుఁడు వాఁడిమార్గణముల

నతని రథ్యధనుర్వైజయంతులను హ
రించి యొకకోల నతని ఖండించి యార్చె. 151

వ. ఇవ్విధంబున నక్రూరుండు దెగిన నయ్యాదవబలంబుఁ జలంబునఁ బోరి కడికండలు సేయు శిఖండిం గనుంగొని హైడింబ హలాయుధాలంబుసులును ధృష్టకేతు సైంధవ యవన రుక్మి పాండ్య భూరిశ్రవులును గేకయ పంచకంబును విందానువిందులును దమతమ శంఖంబులు పూరించి యాదవబలంబు దఱియంజొచ్చి యొక్కపెట్టున. 152

సీ. కర్ణము ల్కుంభము ల్గరములుఁ బాదము
ల్దంతముల్ దనువులుఁ దఱిగి తఱిగి
ముఖములుఁ గేసరంబులు వాలములు ఖురం
బులు నీరుపక్కియల్మోది మోది
యుగములు చక్రముల్ నొగలాతపత్రముల్
చిందంబులును బొడిచేసిచేసి
శిరములు నురములుఁ జెక్కులు ముక్కులుఁ
దొడలుఁ గరంబులుఁ దునిమితునిమి

తే. యేనుఁగుల నొంచి హయముల యేపుడించి
యరదములఁ ద్రుంచి కాల్వురయద టడంచి
సంగరంబున నిబ్బంగి శౌర్య మెసఁగ
నేర్పుమైఁ గూల్చి రక్షౌహిణీబలంబు. 153

వ. అంత మధ్యాహ్నంబయ్యె నప్పుడు శిఖండి ఘటోత్కచాదులవిక్రమంబునకు దేవత లద్భుతంబునొంది యిట్లనిరి. 154

ఉ. రావణకుంభకర్ణులపరాక్రమముం [1]గ్గన కాత్తువిక్రమ
శ్రీవిభవంబుఁ గ్గైటభునిచేఁతయు నంధకు దోర్బలంబు నా
భూవనితాకుమారకునిపోఁడిమిఁ గంటిమిగాని యిట్టి శౌ
ర్యావహకేళిసల్పెడు మహాత్ములఁ జూచి యెఱుంగ మెన్నఁ
డున్. 155

వ. అని యగ్గింప నయోధ్యావరులు సింహనాదంబులు చేసినఁ దద్రవంబు విని సాత్యకి ప్రద్యుమ్నానిరుద్ధాదులు రయంబునఁ బఱతెంచి వారలపై శరవర్షంబులు గురియించి నిలువరించి రయ్యవసరంబున నవ్వాలిచక్కి భీష్మద్రోణకృపకర్ణులొక్కుమ్మడిఁ బ్రళయకాలరుద్రచతుష్టయంబు తెఱంగున మెఱపుమెఱసినభంగి యంత్రకారుల బాగున మెఱసి యొక్కచో ధనుర్గుణ టంకారంబులు నిగిడింపుచు, నొక్కచో నిజహేతిప్రభావిలసితంబులు గావింపుచు నొక్కచోఁ గేతనంబులు మెఱయ రథవేగంబులు గనుపట్టంజేయుచు, నొక్కచో సింహనాదంబులు సేయుచు నొక్కచో శంఖంబులు పూరించి విజృంభించుచుఁ, గిలూడ్చినఁ గెడయు బొమ్మలయోజంగూలి కుప్పలుగొన నేకాక్షౌహిణీబలంబుఁ దునుమాడి యందు రక్తప్రవాహంబులు వఱపిరి. హతశేషులు గాందిశీకులై యొండొరులు విఱిగి పడిన రథంబులసందున వీఁగియు గజకళేబరంబుల నొదిగియు సమసిన సైంధవంబుల పక్కెరలఁ జొచ్చియు శవంబులనడుమంబడి కాలుచేయాడించకయుం గొందఱు నిలువం దక్కినవారు కృష్ణకృష్ణ గావుమను నెలుంగు సూపఁ దన్నాదంబు విని యాముకాంతకుండును దారకునిచే

1 మధుసుగ్రవిక్రమ.

రథంబు వేగంబునం బఱపించి తన సేనకుం జెయివీచి యోధ
కుం డని నిలువరించు నవసరంబుఁ బ్రొద్దుగ్రుంకె నంతక
మున్న యర్జునుండు తమసైన్యంబులం దివియించి భీష్మ
ద్రోణకృపాశ్వత్థామధర్మజసుయోధనకర్ణాదులుం దానును
గరదీపికాసహస్రంబులు వెలుంగ నిజస్కంధావారంబున
కుం జని సముచితప్రకారంబున నందఱ ననిపి మజ్జనభోజనా
దులు సల్పి సుఖంబున నుండె నంత నిక్కడ. 156

ఉ. సీరియు మాధవుండు హతశేషవరూథినితోడఁ గూడి య
క్రూరుని యుద్ధవుం దలఁచి కుందుచుఁ బాండుతనూజసేనపై
వైరము మిక్కుటంబుగ నివాసము చేరఁగఁబోయి మందిర
ద్వారమునందు నిల్పి పరివారమునంపి యథోచితంబుగన్.

వ. అన్నపానాదికృత్యంబుల నిర్వర్తించి యెప్పుడెప్పుడు
సూర్యోదయం బయ్యెడు నని రణకుతూహలాయత్తచిత్తు
లై యుండి రయ్యుభయబలంబులు తమతమ శిబిరంబుల
కరుగంజూచి దేవతలు దివంబునకుం జనిరని శుకయోగీం
ద్రుం డిలావంతునకుం జెప్పె నని చెప్పిన నటమీఁది
వృత్తాంతం బేమని యడుగుటయు. 158

మ. శతపత్రోద్భవవంశపావనదయా సత్యాన్వితస్వాంతసం
తతగోకాంచన ఘోటకాంబరధరాధాన్యాదిదానాఢ్య
యూర్జిత నానావనదేవతాగృహధరిత్రీదేవకళ్యాణ కా
వ్యతటాకోరునిధానసంతత సమగ్రైశ్వర్యభాగ్యోన్నతా.

క. దుర్మంత్రివదనముద్రా
కర్మఠ దుగ్ధాబ్ధికన్యకాధవపూజా

నిర్మలమానస నృపనయ
మర్మజ్ఞ దయాసముద్ర మానగుణాఢ్యా. 160

మణిగణనికరము —

శరశరవణభవజనకగిరి సుధా
కరకరహరిహాయ కరిహరిహారి భూ
ధరధర సితజలధరసురతరు సుం
దరదరవృషవిబుధమునిసమయశా. 161

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మనామాత్యపుత్త్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్రభారతం బనుపురాణకథయందు సప్తమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# చిత్ర భారతము

## అష్టమాశ్వాసము.



రంగరాజసేవా
పారంగతవ్యాసయ కమలభవవంశపయః
పారావారసుధాకర
మారసమానావతార మాదయపెద్దా. 1

వ. అవధరింపుము మృదుమధురవచనరచనాపరితోషితముని జాతుండగుసూతుండు హరికథాశ్రవణాహ్లాదులగు శౌనకాదులకు నిట్లనియె నట్లు రామకృష్ణులుఁ దక్కిన యోధవరులును సూర్యోదయంబుఁ గోరుచు నాహవకుతూహలాయత్తచిత్తులై యుండి రనవుడు శుకయోగీంద్రునకు నిలావంతుం డిట్లనియె. 2

క. ఈరీతి నుభయసేనలుఁ
బోరాడఁగ దినములెన్ని పోయెఁ గలన్
భూరిబలు లెవ్వ రెవ్వరు
వీరత్వముమీఱఁ దెగిరి వివరింపఁగదే. 3

వ. అనుడు నయ్యిలావంతునకు నయ్యోగికేసరి యిట్లను నిత్తెఱంగున మఱియునుం బదియాఱుదినంబులు [1]సంగ్రామంబు భీమంబై చెల్లె నందుఁ బాండవసైన్యంబున భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణభూరిశ్రవులును యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవదుర్యోధనదుశ్శాసనులును శిఖండిధృష్టద్యుమ్నులును శల్యుండును నుత్తమౌజుండును యుధామన్యుండును ఘటోత్కచాలంబుసహలాయుధులును సైంధవ విందానువిందులును నీలసుదక్షిణపాండ్యయవనకేకయులును జతుర్థనుండును [2]నక్షౌహిణీబలంబులుం దక్కఁ దక్కిన [3]సైన్యంబులతోడ బాహ్లికాదులు గెడసిరి. యాదవబలంబున రామకృష్ణసాత్యకిగదులును బ్రద్యుమ్నసాంబసారణచారుదేష్ణబృహద్భానుభానుదేవదీప్తిమదరుణాది కృష్ణకుమారవర్గంబును ననిరుద్ధచేకితానకృతవర్మలును నక్షౌహిణీద్వయంబునుం దక్కఁ దక్కినసైన్యంబులతోడంగూడ నుద్ధవాదులు మడిసిరి. పదునెనిమిదవనాఁడు ప్రభాతసమయంబునఁ బార్థుండు మేల్కాంచి సంధ్యాదికృత్యంబులు నిర్వర్తించి గురుకృపాశ్వత్థామయుధిష్ఠిరదుర్యోధన కర్ణాది యోధవీరసమేతుం డై యున్న [4]గంగానందనుం బాలికిం జని యతనియనుమతి నొక్క యుచితాసనంబునం గూర్చుండి వినయపూర్వకంబుగా నతని కిట్లనియె. 4

క. అనఘా నేఁ డెవ్విధమున
మొన దీర్పఁగవలయు నందు మురవైరికిఁ గుం

1 సమరంబు భీమంబై. 2 జతురక్షౌహిణీబలంబులుం. 3 బలంబులతోడ. 4 గంగానందనుంగాంచి యతనియనుమతి.

దిక్కులు పగులుపడకయుం
డ నుపాయము దలఁచి చెప్పుఁడా వెరవడరన్. 5

క. అనవ్రడు గంగాసుతుఁ డ
య్యనిమిషరాజాత్మజునకు ననియెం గడునే
ర్పున శకటాకృతిగా మన
మొన నిల్పుదమందు పాతము చతుర్థమునిన్. 6

వ. అని సంగరంబునకుఁ జయ్యన వెడలుం డని యనిపిన సకల
సైన్యంబులుఁ గొలువ నతండు గట్టాయితం బైనరథంబు
శల్యుండు చేరఁ రథారోహణంబు గావించి కపికేతనంబు
మెఱయఁ జక్రరక్షకులగు నుత్తమౌజుండును యుధా
మన్యుండును దోడరాఁ జనియె ననంతరంబ భీష్మ ద్రోణ
కృపాశ్వత్థామకర్ణయుధిష్ఠిరవృకోదరనకులసహదేవసుయో
ధనాదియోధవీరులు సంగరోచిత శృంగారంబు లంగీకరించి
నిజకేతనచ్ఛత్రచామరశరశరాసనాదినానావిధచిహ్నచిహ్ని
తంబు లగురథంబులెక్కి విజయభేరీమృదంగశంఖకాహ
ళాదివాద్యంబులు మొఱయ యుద్ధభూమికింబోయి రంత.

క. స్వారాజనందనుఁడు దన
తేరొయ్యనఁ బోవనిచ్చి దృఢతరశకటా
కారంబుగా నమర్చెఁ
వారణరథతురగసుభటవర్గము వరుసన్. 8

వ. ఇవ్విధంబున శకటాకారంబుగా మోహరంబు మీఱం బన్ని
యందు నంతరవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబు సమకట్టి
దాని మధ్యప్రదేశంబున సూచీవ్యూహం బేర్పఱచి
తన్ముఖంబునఁ గేకయపంచకంబును నట పిఱుంద సుదతీ

ణుండును దత్పశ్చాద్భాగంబున నక్షౌహిణీబలంబు ము
న్నిడుకొని నకులసహదేవసహితుం డై యుధిష్ఠిరుండును
దత్పూచీముఖాలస్థానంబునఁ జతుర్థనుండును నతనిచుట్టును
గురుకృపాశ్వత్థామకర్ణదుర్యోధనదుశ్శాసన హాలాయుధా
లంబుసవిందానువిందరుక్మి సైంధవభగదత్తయవనపాండ్యా
ధీశులు నుండునట్లుగా నియమించి యర్జునుండు తానును
గాంగేయుండును వృకోదరుండును భూరిశ్రవుండును
శిఖండియు ధృష్టద్యుమ్నుండును ఘటోత్కచుండును దమ
తమ యడియాలంబులు మెఱయ శంఖంబులు పూరించుచు
ధనుష్టంకారంబులు నిగిడించుచు సింహనాదంబులు గావిం
చుచు నప్పెను మొగ్గరంబు ముందట నిల్చియుండి రదిగనుం
గొని పురందరాదిబృందారకు లద్భుతంబంది రక్కడ. 9

మ బలభద్రుండును గృష్ణుఁడుఁ భుజబలప్రస్ఫీతులై నందను
బ్బలియుల్ పౌత్రులుఁ దమ్ములుఁ సమరఖేలాలోలతంగొల్వ
న్నార్పు లెసంగం జను దెంచి రాకలనికిఁ భూషాకిరీటధ్వజం,
బుల కాంతుల్నభ మెల్ల నిండ రభసంబు న్వేడ్కయు న్మీఱఁ
గాన్. 10

వ. ఇవ్విధంబున యాదవవీరులు చదిమి పెట్టిన బంటుతనంబునఁ
జతురంగబలసమేతు లై పాండవబలంబునకు ననతిదూరం
బున రామకృష్ణులు మున్నుగా నుండి రందు. 11

ఉ ఆహరి వెన్నుదన్ని కుసుమాయుధసాత్యకిసాంబసారణుల్
బాహుబలంబుమీఱఁగఁ గృపాణశరాసనసాయకాది స
న్నాహముతోడ నిల్చి రరుణప్రముఖాత్మజులుఁ విరోధి సే
నాహరణప్రవీణులయి నవ్వుచుఁ బొల్చిరి వారిచక్కటిన్.

వ. అంతకమున్న రామకృష్ణులం గడచి కృతవర్మయుఁ జేకితా
నుండును సవరణాలతోడి యరదంబులెక్కి తమతమ బలం
బులును దామును నిజశంఖంబులు మొరయించి సింహ
నాదంబు లొనరించి యతిరయంబునం జని యర్జును
సైన్యంబుఁ దాఁకిన నిరువాఁగునుం గలసి పదాతులుఁ
బదాతులును రథంబులు రథంబులునుఁ దురంగంబులుఁ
దురంగంబులును గుంజరంబులుఁ గుంజరంబులును ఘోరం
బుగాఁ బోరు నయ్యవసరంబున. 13

శా. ధృష్టద్యుమ్నుఁడుఁ జేకితానుఁడును సందీప్తప్రతా
పాఢ్యులై, ద్రష్టల్ మెచ్చఁగఁ బోరిపోరి తమరథ్యంబుల్
ధరం గూలినన్, ముష్టాముష్టిఁ [1]జెలంగ నంతట బలంబున్
గర్వమున్ మీఱ నుత్కృష్టుండై ద్రుపదాత్మజుం డతని
మర్దించెన్ రిపుల్ బెగ్గిలన్. 14

తే. అది గనుంగొని కృతవర్మ యదరులుమియు
బాణములఁ గప్పె ద్రుపదభూపాలసుతుని
నతఁడు నడుమన వారించి యతనిమేనఁ
దొమ్మిదమ్ములు గ్రుచ్చి సూతుని హారించె. 15

సీ. సారథ్యమును దాన సల్పుచు నుభయసై
న్యంబు లచ్చెరువంద నా యదుప్ర
వీరుఁడు పాంచాలవిభుకుమారునిఫాల
మున నొక్కబాణంబుఁ జొనుప నతఁడు
మూర్ఛిల్లె నప్పుడు ముమ్మరంబైన శో
కమున శిఖండి యాగ్రహమునిగుడఁ

1 బెనంగిరంతట.

క. అఱిముఱి సారథితోడన్
ముఱియుపడగతోడ హయసమూహముతోడన్
జిఱజిఱను ద్రిప్పి యరదము
పఱిపఱిగాఁ గొట్టి భీముఁ బైకొని కినుకన్. 22

క. ముసలమున వ్రేయ నాతం
డసమున గేడించి దాఁటి హలధరువక్షం
బసరొత్తఁగ గదచేఁ గొ
ట్టి సురలు గనుఁగొని తన మగఁటిమి నుతియింపన్. 23

శా. ఆలో భీమునిపైఁ బురత్రితయసంహారంబుగావించు న
ప్ఫాలాక్షుండననేగి మాధవుఁడు శుంభల్లీలఁదద్బాహులన్
గీలించెన్ బదునాల్గుతూపు లది పీఠిం చర్జునుం డాహరిం
దూలించెన్ విశిఖంబులన్ సురలు సంతోషించి భూషిం
పఁగన్. 24

క. హరి యంతట రోషంబున
నరుని యురంబాడ నేసె నారాచములన్
శరమొకటిగ్రుచ్చె నొసటను
గరవాలున బలుఁడు గొట్టి కడువడి నార్చెన్. 25

వ. ఆసమయంబున. 26

మ. అవనీమండలమెల్ల గ్రక్కదల బ్రహ్మాండంబు భేదిల్ల వా
సవి రోషంబున రామకృష్ణులపయిన్ సమ్మోహనాస్త్రంబు
మంత్రవిధిన్ మహోర్వినమర్చి యేయుటయు మూర్ఛంబొంది
రద్దారకుం,డు వడిన్ వారలఁ గొంచు [1]సత్యకసుతుండుం
దోడ నేతేరఁగన్. 27

---

1 సత్యసుతుఁడుం దోడ్తోడ నేతేరఁగన్.

క. చనియె నిట వాయుతనయా
ర్జునులార్చి కడంగి హరివరూథినిపైఁ జే
ర్చి నిశితశరములఁ గురియం
గని వారలఁ గప్పె మరుఁడు కాండంబులచేన్. 28

వ. వెండియు. 29

మ. అనిరుద్ధుండు ధనుర్గుణధ్వనులు మిన్నందంగ నేతెంచి లో
చనయుగ్మంబున వహ్నికీల లురులన్ సవ్యాపసవ్యంబులన్
ఘనబాణంబులు పింజపింజ గఱవంగా వారిపై నేసి యా
ర్చిన భూరిశ్రవుఁ డుగ్రమూర్తియయి వచ్చెన్ సేనలగ్గింపఁగన్. 30

సీ. వచ్చి యాయనిరుద్ధువక్షస్థ్సలంబు మూ
డంబకముల నేసి హయములపయి
బదితూపులడరించి గుదియించి సారథి
గుండె వ్రీలఁగ నొక్కకోలఁ జొనిపి
కత్తివాతమ్మున కాండాసనంబు న
డిమికి వ్రయ్యలుగ ఖండించి బిరుదు
చిందంబు నాల్గువిశిఖముల భేదించి
భల్లత్రయంబునఁ బడఁగ ద్రుంచి
తే యార్చిన నతఁడు వేఱొక్క యరదమెక్కి
యొండువిల్గొని యవ్వీరు బెండుపఱచి
గొడుగుఁ బడగయు విల్లును గుఱ్ఱములును
సూతునింద్రుంచె నమ్ములసోన గురిసె. 31

క. వాలున భూరిశ్రవుఁడుం
గేలీగతి వైవ బుశ్యకేతుఁడు దానిన్

వాలమ్మునఁ జూర్ణంబై
నేలంబడ నేసి యాతనిఁ సోలించెన్. 32

వ. వెండియు. 33

శా. ఖద్యోతోజ్జ్వలమూర్తియై రిపులకుం గాన్పించు కౌరవ్య
వీరోద్యోగంబు నిరర్థకంబయి చనన్ యోధావళిన్
ముంచు ధృష్టద్యుమ్నాదిరణప్రవీణులయవష్టంభంబు
వారించునా ప్రద్యుమ్నాత్మజుఁ డొంటిమైఁ గురుచమూ
పాథోధిమంథాద్రియై. 34

వ. అయ్యవసరంబున భూరిశ్రవుండు దెలివొంది యొక్కెడఁ
జూచినఁ దానయై విహరించు హరిపౌత్రుని పయికి నడరు
నెడ వృకోదరుండు రోషరక్తాక్షుండై యట్టహాసంబుఁ జేసి
నిలునిలుమని యదల్చి గదాదండంబున నవ్వీరుని వక్ష
స్థలంబు వగుల నేసిన నతండు వాతాహతిం జలించు మహీ
రుహంబు చందంబున నీషత్కంపితతనుండై కోపంబున
నతనిం గరవాలంబున నేసిన నది ఖండంబులు గావించి
యంతకాకారుండై. 35

క. మరుదుద్భవుండు గదచే
హరిపౌత్రునిశిరము వ్రేయ నది దునిసి సమి
ద్ధరణీస్థలమునఁ బడియెన్
హరియనుచుం బార్థునేన నార్పులు నిగుడన్. 36

వ. ఇవ్విధంబున ననిరుద్ధుంజంపి సింహనాదంబుఁ జేసి సరో
వరంబుఁ గలంచు గంధసింధురంబు చందంబున యాదవ
సైన్యంజొచ్చి హెచ్చిన గర్వంబున గదఁద్రిప్పుచు రథులఁ
గెడపియు సారథుల మడిపియు సిడంబులు పొడిఁ జేసియు

గొడుగులు పడఁగొట్టియుఁ దురంగంబుల నిరంగంబులఁ గావించియు భటులఁ జటులగతి సంహరించియుఁ దనివి చనక మఱియును. 37

సీ. కుంభరక్తము చివుక్కున నెమ్మొగమ్ముపైఁ
జిందంగ గదచేతఁ జిదిమిచిదిమి
యొకటిఁ జేపట్టి యొండొక్కటిపై ద్రొబ్బి
చరణాగ్రమున నేలఁ జమరిచమరి
తుండముల్ చుట్టి చేతుల తీఁటవోవంగ
ఘోరవిక్రమకేళిఁ గొట్టికొట్టి
కడకాళ్లు వట్టి ఘీంకారంబు సేయంగ
వీచి నల్గడఁ బాఱవైచివైచి
తే. కింకిణీఘంటికాపతాకాంకుశప్ర
కరవరత్రశస్త్రాసిచామరనియంత్రృ
భీషణోదగ్రమత్తకుంభివ్రజంబు
భీముఁ డవలీలఁ జంపె నాభీలలీల. 38

వ. అయ్యవసరంబున. 39

చ. కొడుకువిధం బెఱింగి కనుగోనల నీరును విస్ఫులింగముల్
వడిఁగురియంగఁ బాండవబలంబు భయంపడిచూడ మారుఁ
డవ్వాడముడిఁదాఁకి యార్చి యదువర్గము మెచ్చు గుణంబు
మ్రోయఁగాఁ, బిడుగులవంటిబాణములు పెల్లుగ నేయ
నతండు నుగ్రుఁ డై. 40

వ. ఆ శంబరాంతకుపైఁ గవిసి యంతకదండంబునుంబోలిన తన గదాదండంబున నతని వక్షస్థ్సలం బుపలక్షించి వేసిన నప్వీ రుండు సోలి యాలోన మేలుకని విలయకాలుండునుం

బోలె విజృంభించి విశిఖంబుల వెల్లి ముంచి మఱియు నొక్క ఘోరనారాచంబున నమ్మారుతకుమారుజత్రు దేశంబు గాడనేసిన నతండు మూర్ఛిల్లె నది గనుంగొని యాదవబలంబున సింహనాదంబులు చెలంగె నాభీముండు దెలివొందునంతకు ధృష్టద్యుమ్నుండు ప్రద్యుమ్నునిం దాఁకి పుంఖానుపుంఖంబులుగా నిశితశరపరంపరలు వరఁగించి యొక్కభల్లంబున నుల్లంబు నోనాడనేసిన నతండు వెడఁదతూపున నతని విల్లువిఱుగనేసిన నవ్వీరుండును వేఱొండు కోదండంబుఁ గొని యమ్ముల దొరఁగించిన నవి తోడనె తునియలై దొఱఁగునట్లుగా నేసి మఱియును. 41

క. ప్రద్యుమ్నుఁడు దరిగా ధృ
ష్టద్యుమ్నుని నేసె నశనిసమసాయకముల్
ప్రద్యోతములై నిగిడి జ
యోద్యోగము హెచ్చఁ బార్థయోధులు బెదరన్. 42

క. అవియెల్ల ద్రుపదనందనుఁ
డవలీలం దూలనేసి యవ్వీరుని [1]మూ
డు విషమశాతశరములే
సి వెగడుపఱచెను విరోధిసేనలు చెదరన్. 43

వ. వెండియు నా దండిమగలు దమలోనొండొరులపై నిగిడించు నిష్ఠురకాండంబులచే సూతాశ్వచ్ఛత్రచామర ధ్వజ సహితంబులుగా రథంబులు గూలిన విరథులై కృపాణంబులును ఖేటకంబులుం బూని మిక్కుటంబైన యుక్కున నొక్కరొక్కరుల లెక్కగొనక డాసియు వ్రేసియు వ్రేట్ల

---

1 వైఁ, బవిసమశాతశరములేసి.

కుం దప్పించి కుప్పించియు బహువిధగతులం గొంత
ప్రొద్దు పోరునెడఁ దెఱపిగని యా ధృష్టద్యుమ్నుండును
బ్రద్యుమ్ననిశిరంబు హరించి సింహనాదంబుఁ జేసిన
యాదవసైన్యంబు దైన్యంబునొంది సల్లకలంబఱచినం జూచి
శోకరోషంబులు మనంబునం బెనంగొన సాంబసారణాదు
లెలుంగుఁజూపి తమ సేనకుం జెయివీచి మరల్చి తీవ్రంబు చేసి
ధృష్టద్యుమ్నాదులపై నురువడించిన నుభయసైనికులకుఁ
బోరు ఘోరంబయ్యె నందు. 44

తే. మేఘముల్ పెక్కుగూడి భూమీధరంబు
నంబుధారలచేఁ గప్పు ననువు దోఁప
నమ్మహావీరు లర్జును నాక్రమించి
శరపరంపరఁ గప్పిరి సాహసమున. 45

వ. వెండియు. 46

సీ. చారుదేష్ణుఁడు శతసాయకంబుల నారిఁ
ద్రెంచె సాంబుండు పదింట సిడము
జవ్వాడ నేసెను సారణుం డేనుమా
ర్గణముల శల్యునురంబు గ్రుచ్చె
భానువిందుఁడు బృహద్భానువిందుఁడు భాను
దేవుండు వృకుఁడుఁ [1]బన్నెండుదూపు
లఁ దురంగములఁ దూలనొనర్ప నరుణ పు
ష్కరులు తచ్చక్రరక్షకుల నొంచి
తే. రౌక్మొగిఁగలియ వేదవాహుఁడు సునంద
నుండు శుకుఁడును దీప్తిమంతుండు నాది

1 బంద్రెండుదూపు.

ర్యైన కృష్ణతనూభవు లతని మెదలఁ
గదలరాకుండ నేసి రాగ్రహము నిగుడ. 47

తే. అప్పుడా సవ్యసాచియు హారకరాగ్ర
దీప్తశూలంబుగతి మించుదివ్యశరము
నారి సంధించి వేయ నానావిధముల
నతివిచిత్రంబుగా నొంచె నారథికుల. 48

వ. ఇవ్విధంబున నర్జునుండు హరికుమారుల నిశ్శేషంబుగా వధి యించిన దుర్యోధన ప్రముఖయోధులు హతశేషబలంబును జలంబునఁ జంపిరంత నిట రామకృష్ణులు సాత్యకి దారకులుసేయు శిశిరోపచారంబులవలన మూర్ఛందేఱి ఖండంబులైన శుండాలంబులును నొరఁగిన తురంగంబులును బఱియలైన యరదంబులుం గూలిన కాలుబలంబును మ్రగ్గిన కుమారవర్గంబునుం గలిగి నిర్మనుష్యంబైన యాత్మసైన్యంబుఁ జూచి శోకవ్యాకులితమనస్కులై రయ్యవసరంబున. 49

సీ. సంవర్తచండభాస్కర మండలంబునా
నాస్యంబు భీకరంబై వెలుంగఁ
గల్పాంతవిస్ఫులింగంబు లొక్కుమ్మడి
నిగిడె నాఁ గన్నులనిప్పు లురులఁ
బ్రళయకాలోగ్రనిర్భరసింహనాదంబు
నాఁ బాంచజన్యస్వనంబు నిగుడఁ
గల్పాంతసమయమేఘవ్రాతనిర్ఘోష
మన శార్ఙ్గ గుణరావ మగ్గలింపఁ

తే. బహుతిచ్ఛాయ దిక్కులఁ బర్వుచున్న
గాశ పతి కేతు వభ్రంబునందుఁ గ్రాల
దానవధ్వంసి శత్రులు దల్లడిల్ల
రామసాత్యకు లిరువంకఁ రాఁగనడచె. 50

వ. ఇవ్విధంబున రామసాత్యకి సమేతుండై కృష్ణుఁడు రాఁజూచి భీష్మార్జునులు తమతమ బలంబులం బురికొల్పిన దూర్య స్వనంబులు చెలంగఁ జండభానుమండలంబునుం బొదువు నీహారంబు విహారంబున దావపావకజ్వాలాజాలంబు పయిం జను శలభంబుల విధంబున నొక్కమొగి నురు వడించి యమ్మువ్వురపయి లెక్కకు నెక్కువ యగునమ్ములం గప్పిన ముప్పిరికొను రోషంబున. 51

సీ. పర్జన్యుఁ డద్రులఁ బడఁగొట్టు వైఖరిఁ
గుంజరంబుల నేలఁ గూలఁ దన్ని
శార్ధూల ముద్ధతి సారంగములభంగి
సైంధవంబుల బారి సమరి వైచి
కరి పద్మములఁ ద్రుంచు కైవడి రథికుల
గళము లొక్కుమ్మడి నులిమివైచి
బలుగాడ్పు తరువులఫలముల డుల్చువ
డువునఁ బదాతుల డొల్లఁగొట్టి

తే. భీష్మునొప్పించి భీముని బెండుపఱచి
యర్జునుని మోఁది హైడింబు నదటడంచి
ద్రుపదనందను సారథిఁ ద్రుంచి రథము
చక్కుగావించి యార్చె ముసలధరుండు. 52

క. గొడుగులు గడువడిఁ ద్రుంపుచు
సిడములు గెడపుచును జొళ్లుచింపుచు రథముల్
పొడిపొడి సేయుచు నమ్ముల
మడియించెన్ యోధుల నుపమర్దనుఁడు వెసన్. 53

తే. కరుల హయముల రథంబులఁ గాల్బలముల
రూపుమాపి చెలంగి మెఱుంగు మెఱసి
నట్టు లెల్లెడఁ బొలయుచు నాశినిప్ర
వరుఁడుఁ బెక్కండ్రు రథికుల వసుధఁ గూల్చె. 54

సీ. భూరిమదోత్కట పున్నాగ జాలని
వాసంబు గంధర్వవారపదము
నిష్ఠురస్యందననికరాలయము శత
కుంతసహస్రవిశ్రాంతభూమి
యర్జున నకుల శల్య ద్రోణ నిలయంబు
గాంగేయ భూదార ఖడ్గసీమ
శకుని పలాశసంచయనిత్యవాసంబు
కమనీయపుండరీకస్థలంబు
తే. నగుచుఁ గనుపట్టు పార్థుసైన్యంపుటడవి
రామకృష్ణ శినిప్రవర ప్రచండ
వీతిహోత్రత్రయంబుగ్ర హేతులడరఁ
గాల్చె లోకంబులెల్ల నాకంప మొంద. 55

వ. అయ్యవసరంబున నర్జునుండు కోపోద్దీపితమానసుండై రామ
సాత్యకులతోఁ దలపడి పోరుచుండంజూచి కృష్ణుం డమ్మొ
గ్గరంబుఁ గదియునెడ భీష్మ భీమనందన భూరిశ్రవ శిఖండి
ధృష్టద్యుమ్ను లడ్డంబువచ్చి సాయకాసారంబుల ముంచిన

నతండును నవ్వీరవరుల నంపగమిం గప్పి నిశ్చేష్టితులఁ గావించి భేదించి సూచీవ్యూహంబు సొచ్చి యచ్చట నెదురుపడు కేకయులపై నిశితశరానీకంబులు నిగిడించి వారలం గడచి చనునెడ సుదక్షిణుం డడ్డంబువచ్చిన నతని నొక్క నారాచంబునఁ జచ్చినట్లు యుండునట్లుగాఁ జేసి పోవు నప్పుడు ధర్మనందనుండు గపలునుం దానును నతనిపై నాశుగసముదాయంబులు వఱపిన నవి నడుమన చూర్ణంబులై తొరఁగ నేసిన యమ్ముఖ్యవీర మూఁడువాఁడిబాణంబుల నొప్పినొందించి తద్బలంబు బడలుపడ నడచి పద్మవ్యూహంబు డగ్గఱి పాంచజన్యంబొత్తిన. 56

సీ. ఆకృష్ణుఁ జూచి సైన్యంబు భీతిల్లి బె
బ్బులిఁ గన్న మృగములపోల్కిఁ బఱవ
నది చూచి యర్జునుఁ డాకుండి నేశ్వరుఁ
[1]డటఁ జచ్చియుండునో యని తలంచి
తనతోడఁ బోరు సాత్యకి సీరపాణుల
డించి తీవ్రమున నే తెంచి సేన
మగుడంగఁ బురికొల్పి బెగడు చతుర్ధన
జననాథుఁ దెల్పి యా చక్రపాణిఁ

తే. దాఁకి నిబిడాశుగంబుల తళ్లుగురియ
నతఁడు నాతనిఁ గప్పెఁ బేరంపసమితి
నంతనారామ శైనేయు లరుగుదెంచి
యాముఱాంతకుఁ గూడి రుద్దామలీల. 57

1 దలజడిఁ బొందునో యని తలంచి.

వ. ఇవ్విధంబున నాయిద్దఱు కృష్ణుని గూడి రంతకమున్న
భీష్మాది యోధవీరులు నరుగుదెంచి గాండీవిం గలసి
యంపఱు నొక్కపెట్టున నమ్ముగ్గురిపైఁ గవిసిన దారుణం
బైన రణంబయ్యె నందు సాత్యకిం దలపడి ధృష్టద్యు
మ్నుండు మగఁటిమిమీఱిన నయ్యిద్దఱు నన్యోన్యబాణ
ఘట్టనల శతాంగ తురంగ సూత కేతు బాణాసన తను
త్రాణ శిరస్త్రంబులు ధరణిపయిం దొరఁగిన విరథులై
నేలకు లంఘించి కుంతంబులు గొని పంతంబులు పలుకుచు
బెబ్బులులనయంబున గంధసింధురంబుల చందంబున సింగం
బులభంగిఁ బొంగి నింగివగుల నార్చుచుఁ బదాభిఘాతంబుల
భూతలంబు చలింపఁ జిమ్మియుఁ గ్రుమ్మియు బహువిధ
గతులఁ బోరుచుండి రయ్యవసరంబున. 58

చ. కడువడిఁ బాఱు తేరు పదఘట్టన భూమివడంక మోమునం
బడిన గజంబులం జిదిమి పాముచు యోధుల నుగ్గుసేయు
చున్, గడఁగిన రామునొంచె బలగర్వమునన్ శరజాల
మేసియు, వ్వడముడిపట్టి యవ్విభుఁడు వాని తురంగ
ములన్ వధించినన్. 59

క. వెండియు ఘటోత్కచుం డు
ద్దండత బాణంబు లేయఁ దలఁకక బలభ
ద్రుండు హాలంబునఁ దత్కో
దండము రాఁదిగిచి విఱిచి తను వ్రేయుటయున్. 60

మ. కచభాగం బురియాడి వెన్నొఱయ రక్షస్సైన్యముల్పాఱ
నేల చలింప న్మణిహారజాలములు రాల న్వ్యోమయాన
స్థులై, ఖచరుల్ గన్గొని నవ్వఁ జేలము విడంగా భీతిమై

నా ఘటో, త్కచుఁ డేగెం దనతండ్రి తేరునకుఁ జిత్తం
బుత్తలం బందఁగన్. 61

వ. అప్పుడు కృష్ణుండు కుండిననాథుండగు చతుర్ధనుం జేర
వచ్చిన ధనంజయుండు దేవదత్తంబు పూరించి నారిసారించి
యొక్క సారవంతంబగు సాయకంబున దారకు పేరురంబు
దూఱనేసి హయమ్ముల రయమ్మున నొక్కొక్కయమ్మున
నెమ్ములు ప్రీలునట్లుగాఁ జేసి సింహనాదంబు చేసినం గించి
దరుణిత నయనుండై. 62

ఉ. పుష్కరలోచనుండు వసుపుంఖశరంబుల నాలిగింట ధా
నుష్కకులాగ్రగణ్యు నరు నొవ్వఁగఁ జేసి కడంగి డగ్గఱం
బుష్కరసంచరుల్ భయముఁబొందిరతండనుగోపగించి య
వ్విష్కర రాజకేతనుని వేయిశరంబుల నేసె నత్తఱిన్. 63

శా. భుగ్నభ్రూకుటి ఫాలభాగుఁడయి యంభోజాక్షుఁ డప్పా
ర్థుపై, నాగ్నేయాశుగమేయ నాశరము బ్రహ్మాండంబు
భేదిల్లఁగా, నగ్నిజ్వాలఁ గరాళమై యరిగినం బ్రాణేచ్ఛఁ
దత్సైన్యము, ద్విగ్నంబై నలువంకల న్విఱిగి వేవే
గంబునం బాఱెనన్. 64

వ. అప్పుడు. 65

శా. జంభారాతితనూభవుండలిగి తచ్ఛస్త్రంబుపై నేసె సం
రంభంబొప్పఁగ వారుణాస్త్ర మది ఘోరంబై నభోవీథి నీ
లాంభోదంబులు నిండఁగప్పెఁ దిమిరంబంతంతకుం బర్విది
క్కుంభుల్ మ్రొగ్గఁగ మ్రోయుచుం భువనసంక్షోభంబు
గావింపుచున్. 66

క. కడువడిః బిడుగులు దొరుగుచుః
బుడమి యడల నిష్ఠురాశ్మములు గురియుచు న
ప్పుడవాచి నడచి వివిదల (దివిజుల)
సుడివరపుచు వచ్చుశరముఃజూచి కడంకన్. 67

మ. వనజాక్షుండును మంత్రపూర్వకముగా వాయవ్యబాణం
బు నే, సినః దచ్ఛస్త్రము దానిః ద్రుంచి కుధరశ్రేష్ఠంబు
లుజ్జూఃతలూః, గ నిలింపుల్ భయమొంద నబ్ధులు గలం
గ భూమి గంపింప న, ర్జునుపై నుద్ధురలీల వచ్చుటయు
ధీరుండై యతం డుగ్రతన్. 68

క. నాగాస్త్రమేయ నదియుః
భోగిసహస్రములచేతః బొడవడఃచెం ద
ద్వేగం; బంతటః బోవక
యాగోవిందుం డెమల్ప నడరిన నతఃడున్. 69

సీ. కడుభయంకరలీల గరుడాస్త్రమేసిన
నర్జునుండును దాని నైంద్రబాణ
మునః దుత్తుమురుఃజేసె వనజాక్షుః డలిగి రౌ
ద్రాశుగంబు నిగిడ్చె ననిమిషేంద్ర
తనయుండు దానన దానివారించె యా
దవనాయకుండు చిత్తమున నల్గి
బ్రహ్మాస్త్ర మురువడిః బఱపిన ఫల్గునుం
డును బ్రతిశరములే కునికివేగ

తే మదర బ్రహ్మాస్త్రమేయ నయ్యాశుగములు
నిగిడి యొండొంటిః దాఃకి వహ్నిచ్ఛటలు చెః
దరఃగః బోరాడి తామ శాంతంబు లయ్యె
నఖిలదేవత లాశ్చర్యమంది చూడ. 70

వ. అంత. 71

చ. ఒకగుఱిఁ బెక్కుచాపధరు లొక్క మొగిం దగులంగ నేసిన
ట్లు కమలనేత్రుఁ జుట్టికొని డాసి ఘటప్రభవుండు భీష్ముఁ
డున్, నకులుఁడు కర్ణుఁడుం గృపుఁడు నాగపతాకుఁడు
దుస్ససేనుఁడున్, శకునియు ధర్మజుండును నిశాతశరంబుల
నేసి రుగ్రతన్. 72

వ. మఱియు నశ్వత్థామయు సహదేవుండును ఘటోత్కచుం
డును శిఖండియు ధృష్టద్యుమ్నుండును భగదత్తుండును
నీలుండును సుదక్షిణుండును కేకయులును విందానువిం
దులు నాదిగాఁగల సకలయోధులు చండకాండంబుల
బెండుపడ నేసిన. 73

ఉ. అప్పుడు కృష్ణుఁడున్ మనమునందుఁ జలింపక కుంభజాతునిన్
నిప్పులవంటిబాణమున నివ్వెఱఁగందఁగ నేసె వారలు
న్నొప్పిరిగొన్న యట్టిచలమున్ బలమున్ గరువంబుమీఱఁగాఁ
గప్పిరి కేతనంబుఁ దురగంబుల సారథిమేను నమ్ములన్. 74

చ. అలుఁగులు దాఁకి కౌస్తుభమునం దనలాగ్నికణంబులోలిమై
జలజలరాల నాభరణజాలము నుగ్గుగ డుల్లి జోడులో
పలనడఁగంగ మే న్దరలఁబాఱఁగ రక్తము గ్రమ్మి బాఱఁ దూ
పులు నిగిడించి చేదివిభు భూమిపయిం బడ నేసి యార్చినన్.

సీ. పరిపూర్ణచంద్రబింబసముజ్జ్వలాస్యంబు
ప్రళయకాలానలప్రభ ఁ నీన
శారదచంద్రికాసమకటాక్షంబులు
గల్పాంతసమయాగ్నికణములుమియఁ

బుష్పచాపోల్లసద్భ్రూవిమండలము భూప
జాతనాశకధూమకేతువుగను
దండశూకాధీశతుండిలదోర్దండ
మంతకదండభయంకరముగ
తే. కుంభినీభ్రమంబు లూఁగ దిక్కుంభివరులు
మునుఁగ నబ్ధులు గలఁగ నంభోజహితుఁడు
త్రోవ దప్పంగ దేవత ల్దొట్రుపడఁగ
రాక్షసారాతి ఘోరచక్రంబుఁ దలఁచె. 76
వ. అప్పుడు. 77
శా. రక్షోనాయకకంఠరక్తయుతధారాశోణరోచుల్ దినా
ధ్యక్షాంశుప్రకరంబు నుద్దవిడి మాయం జేయఁగా భూమి
భృత్పక్షచ్ఛేదనదక్షఘోరసురరాడ్దంభోళికోటిప్రభా,
వాక్షీణంబగు చక్ర మక్షణము దైత్యారాతిచే నిల్చినన్.
క. కరచక్రముఁ జూచి యుధి
ష్ఠిరు నొక్కనిఁ గాచి నిఖిలసేనాధరణీ
వర నర చతుర్ధనులఁ జెం
డి [1]రమ్మని హరి గనలి వడిఁ బ్రయోగించెన్. 79
తే. మన్ను మిన్నును నేకమై మంటలెగయఁ
జక్రమే తేరఁగాఁ జూచి సవ్యసాచి
యున్నయత్నంబులన్నియు నుడిగి యా చ
తుర్ధనునిఁ దనవెనుకకుఁ ద్రోచి నిలిచె. 80
వ. అంత. 81
మ. ఘననిర్ఘోషసమానరావ మడరంగాఁ జక్రమే తెంచి కుం
డిన భూనాథున కడ్డమైనిలుచు గాండీవిన్ హరించెన్ జతు

1 రమ్మనుచుఁ బల్కిహరి.

ర్థను కంఠంబును క్రీగ్రక్కునఁ దునిమె దుర్గాధీశ నీ రేజజా
త నిలింపాధిపు లాత్మభీతిలఁగ భూతవ్రాతము ల్బెగ్గిలన్. 82

వ. ఇట్లు తునిమిన. 83

చ. నరునిశిరంబు కేశవ! వినాయక కేతన! చక్రి! దైత్యసం
హార! పరమాత్మ! మాధవ! మురారి! సరోరుహపత్రనేత్ర
భూ, ధరధర! యిందిరారమణ! దానవవైరి! యటంచుఁ
బల్కుచుఁ, ధరపయి వ్రాలె నంతట సుదర్శన ముగ్రత
మీఱ వ్రేల్మిడిన్. 84

సీ. గాంగేయ కుంభజ కర్ణ దుర్యోధనా
శ్వత్థామ శల్యుల సంహరించి
మాద్రేయ కృప హిడింబతనూజవర జగ
త్ప్రాణిసంజాతుల బారిసమరి
సింధుభూవర దుస్ససేన ధృష్టద్యుమ్న
రుక్మి శిఖండుల రూపుమాపి
కేకయాధిప సుదక్షిణ నీల భగదత్త
విందానువిందుల వెల్లిఁబుచ్చి

తే. పాండ్య సౌబల యవన భూపాల ధృష్ట
కేతు బాహ్లికపౌత్రులఁ గీటడంచి
యుత్తమోజు యుధామన్యునుర్విఁ గూల్చి
మఱియుఁ దక్కిన శూరుల మారిమసఁగి. 85

వ. ఇవ్విధంబున సంవర్తసమయ సముజ్జృంభమాణ కుంభీనస
రాజకటకచటులనిటలతట శిఖిశిఖాసంకాశజ్వాలంబై ప్ర
ళయకాల ప్రచండ మార్తాండమండల విడంబి విస్ఫులింగ
భయంకరంబై కల్పాంత ప్రవర్ధమాన బృహద్భాను జిహ్వ

సంహతి దుర్నిరీక్షంబై పుష్కలావర్తకాది మహాంభోధర సంభూత నిర్ఘాత జాల బంధుర ధ్వానానూనస్వానముఖరిత బ్రహ్మాండంబై కాలకూటంబు లీల సంస్పృష్టరాజశేఖర కంఠంబై బడబానలంబు చందంబున నపహృతవాహినీనాథ జీవనంబై వర్షాకాలంబు తెఱంగునఁ బ్రవర్ధితకబంధంబై భగవదవతారంబు చెలువున సంస్థాపితధర్మంబై పాటితరక్షశ్చక్రంబగు చక్రం బాక్రమించినఁ దత్సైన్యంబునం గెడయు రథులును మఱియు సారథులును విఱుగుతేరులును నొఱగుహోరులును డొల్లు మాతంగంబులును ద్రెళ్లు తురంగంబులును నొరలు సవారులును బొరలుయోధులును గూలినపదంబులును, రాలిన రదంబులును జెదిసినశిరంబులును జదిసినకరంబులును, దునిఁగిన మెడలును బెనఁగిన తొడలును బగిలిన ఱొమ్ములును నొగిలిన యొమ్ములును దరలు గుండెలును నొరలు కండలును జూర్ణంబులైన గొడుగులును విశీర్ణంబులైన పడగలును నుగ్గైననానావిధ శస్త్రంబులును దుత్తుమురైన తనుత్రాణశిరస్త్రాణంబులును గూడి నెత్తురుటేరులం గలసి పఱచెనందు. 86

సీ. కీలాలవాహినీజాలంబు ప్రవహింప
నందంద వడి నోలలాడుఁ గొన్ని
తెగగలమాంసంబు తెట్టెల దిట్టలై
వేడుకఁగని పాతులాడుఁ గొన్ని
గజమస్తకంబు లక్కజముగాఁ జేపట్టి
యచ్చనగండ్లుగా నాడుఁ గొన్ని

సమరోర్విఁ బడియున్న శస్త్రఖండంబుల
ననువుమీఱఁగ వేటులాడుఁగొన్ని
తే. భూమిపాలక భూషణంబులు ధరించి
మెఱసి దమవారినుందట ముఱియుఁగొన్ని
యివ్విధంబున భూతంబు లెసక మెసఁగఁ
గ్రీడసల్పుచుఁ జనియెఁ గిరీటితనయ. 87

వ. ఇవ్విధంబున భూతంబులు దిరుగ నంతకమున్న తనబలంబు
సుదర్శన నివృత్తంబగుట ధర్మనందనుం డెఱింగినవాఁడు
గావునఁ గురు పితామహ జ్ఞాతి బంధుమిత్రామాత్యుల
నానాదేశాగత రాజన్యులం గనుంగొనియెడువాఁడై రథం
బు డిగ్గివచ్చి గాంగేయుం గనుంగొని మూర్ఛం జెంది కొంత
తడవునకుం దెలిసి కన్నీరు దొరఁగ నతని పాదంబులపైఁ
వ్రాలి యిట్లనియె. 88

తే. అనఘ! స్వచ్ఛంద మరణుండ వనినిఁ గల్గు
మగలకెల్లను మగఁడనఁ బొగడనెగడు
పరశురాముని గెల్చిన బాహుబలుఁడ
వైన నీవును బొలిసి తేమందు విధిని. 89

వ. అని శోకించి యచ్చటఁ బాసి గురుకృపాశ్వత్థామ కర్ణదుర్యో
ధనాదులం జూచుచు నేగి యొక్కచో నిల్చి యందఱం
దలంచి యిట్లనియె. 90

సీ. సంగరోగ్రులు దివ్యశస్త్రాస్త్రనిపుణులు
గురు కృపాశ్వత్థామ లరిదిమగలు
ప్రకటదోర్బలులు బాహ్లీక సోమదత్త భూ
రిశ్రవుల్ విపులకీర్తిప్రతాపు

లభియాతి శైల జంభారులు గర్ణ దు
రోర్యోధన శకుని శల్యులు దలంప
మార్తాండతేజులు మత్స్య కేకయ పాండ్య
పాంచాలదేశాధిపతులు మఱియు

తే. నఖిల విశ్వంభ రాధ్యుల కధికు లిట్టి
వారలును వచ్చి చచ్చిరి పోర నా ని
మిత్తమయి యాయఘుంబు నేమిట నడంగు
దైవమా యని చింతించుఁ దల్లడించు. 91

వ. ఇవ్విధంబునఁ గొంతప్రొద్దు దుఃఖించి యనంతరంబ యచ్చో
టువాసి ముందఱం బరశు పట్టిస ప్రాస ముద్గర తోమర
గదా శూల భిండివాల కరవాలాది నానావిధాయుధ
శకలంబులపై నవయవభేదంబు లెఱుంగరాక కూలిన
కాల్బలంబులకు నెడగలిగిపోవుచుఁ గేతన చ్ఛత్ర చామర
ధనుర్బాణ రథ తురంగ సారథిసమేతంబుగా సమసిన రథిక
వరులకు నీసడింపుచు రాహుత్తసహితంబుగాఁ గుప్పలు
గొనఁబడిన గుఱ్ఱపుఁదిట్టలకు నోసరిల్లుచు మావంతులతోడం
బీనుంగులైన యేనుంగులకు నోహటింపుచుఁ జనియచ్చట
భీమసేనునిఁ దద్వామ దక్షిణపార్శ్వంబులఁ ద్రెళ్లినకవలనుం
గని యొల్లంబోయిన యుల్లంబున మూర్ఛిల్లి యెట్టకేలకుం
దెలిసి పేరుపేరున నిట్లని విలపింపందొడంగె. 92

సీ. దుర్యోధనుండు బద్ధునిఁ జేసి ముంప నా
నదినుండివచ్చిన నాఁటి శక్తి
మమ్ము లాక్షానివాసమ్మునఁ గీడుచెం
దకయుండఁ దెచ్చిననాఁటిశక్తి

వనమధ్యమున హిడింబుని యుద్ధమునను బ్రా
ణములను గొన్నట్టి నాఁటిశక్తి
విక్రమంబుననేకచక్రమ్మున బకదా
నవు జీరివైచిన నాఁటిశక్తి

తే. యెవ్విధంబున మఱఁగె నేఁ డెందడంగె
నే తెఱంగున డాఁగె నేఁడెచటి కేఁగె
హా మదేభాయుతత్రాణ హా గదాప్ర
వీణ హా వీర హా జగత్ప్రాణతనయ. 93

తే. నకుల సహదేవులార భండనపటిష్ఠు
లార సౌందర్యలక్ష్మీకుమారులార
పోయితిరె మీరు నేఁడు నాపొందు విడిచి
యంచు విలపించు నలుదిక్కులాలకించు. 94

తే. మఱియు భీమాత్మసంభవు మానసమునఁ
దలఁచి యంతంత కార్తనాదంబునిగుడ
నేడ్చె నదివిని భూతంబులెల్ల నడలె
మృగసమూహంబు పక్షులు మేఁతలుడిగె. 95

వ. ఇవ్విధంబున రోదనంబుచేయుచుఁ గొన్నియడుగులు నడచి
చతుర్థనుం గనుంగొని పుడమిం బడి యిట్లనియె. 96

క. నినుఁగావఁ బూని యర్జునుఁ
డనిఁ దన శౌర్యంబునెఱపి హరిచేఁ దెగెఁ గుం
డినహాథ, యిట్టిభాగ్యము
గనఁజాలఁగనైతి నెంత కలుషాత్ముఁడనో. 97

వ. అని నిర్వేజపడి నిట్టూర్పు నిగిడించి లేచి తత్పురోభాగం
బుననున్న యర్జునుని నతనిముందఱనున్న శల్యుని నతని
పార్శ్వంబులం గూలిన యుత్తమౌజ యుధామన్యులను
దేఱిచూచి దుఃఖాక్రాంతస్వాంతుండై దానిచెంగటంబడి
యున్న యన్నరు కళేబరంబుడగ్గఱంజని తచ్ఛిరంబు తన
యంకతలంబున నిడుకొని నెమ్మనంబునం గ్రమ్మిన యుమ్మలి
కంబు వెంపున రిమ్మగొని సొమ్మసిలి యమ్మహీతలంబునంబడి
పెద్దతడవునకుం గ్రమ్మఱం దెలివొంది కన్నీరు దొరుఁగ
నిట్లనియె. 98

సీ. ద్రోణుశాసనమున ద్రుపదుఁ దెచ్చినయట్టి
నీభుజావిభవంబు నేఁడడంగె
నంగారపర్ణుని భంగపెట్టినయట్టి
నీదివ్యశక్తి దా నేఁడడంగె
దారుణమత్స్యయంత్రం బేసిమించిన
నీ శరాసనవిద్య నేఁడడంగెఁ
బాంచాలికై మహీపాలుర గెల్చిన
నీవిక్రమస్ఫూర్తి నేఁడడంగె
తే. హా సరోజాతవైరికులావతంస
హా జితోద్దండపరిపంథిరాజహంస
హా మహాశౌర్య హాసురాహార్యధైర్య
హా జయద్వీర హా హరిహాయకుమార. 99

వ. అని పనవి రోదనంబుసేయుచున్న యమ్మేదినీనాథుదైన్యా
లాపంబులు విని బలభద్ర సాత్యకులు కృష్ణునిపాలికిం జని
సాంత్వనవచనంబుల నిట్లనిరి. 100

చ వనజదళాక్ష! యింద్రసుతు వాహినిఁ గాల్చినపోటిలో
మెఱుం, గొనరు తెఱంగునక్ నిలిచి కుందుచు నొక్కఁడు
విన్న వారికి, న్మన మెరియంగ బాంధవసమాజము మాటికిఁ
బేరుగ్రుచ్చి యొ,క్కని తలమ్రోలఁ బెట్టుకొని గద్గదకంఠము
మీఱ నేడ్చుచున్. 101

వ. నీచక్రంబునకుఁ దప్పియున్న వాఁ డెవ్వఁడో దెలియఁడు.

క. అని చూడుమనిన వారల
కనియెన్ దనుజారి యేడ్చునాతఁడు యమునం
దనుఁడు ధనంజయ శిరమది
మన మరుగుద మతని యడలు మాన్పఁగవలయున్. 103

వ. అని యాసంకర్షణ సాత్యకులుం దానును రథారూఢులై
కదలి యాత్మసేనామధ్యంబున మాతంగ తురంగాది చతు
రంగబలసమేతులై భూతలంబునం బడిన ప్రద్యుమ్న
సాంబ సారణాదికుమారుల ననిరుద్ధ యుద్ధవాక్రూర చేకి
తాన కృతవర్మ గదాది యాదవవీరులం గనుంగొనుచు
శోకవ్యాకులితమనస్కులై చని పాండవబలంబు దఱిసి
పోవుచుఁ గృష్ణుండు వారల కిట్లనియె. 104

సీ. ఇతఁడు గంగాసూనుఁ డీతఁడు కుంభజుఁ
డీతఁ డశ్వత్థామ యితఁడు కృపుఁడు
ఈతఁడు రాధేయుఁ డీతఁడు సైంధవుఁ
డితఁడు దుర్యోధనుఁ డితఁడు ద్రుపదుఁ
డితఁడు దృష్టద్యుమ్నుఁ డితఁడు శిఖండి యి
తఁడు పాండ్యనాథుఁ డితఁడు విరాటుఁ
డీతఁడు హైడింబుఁ డీతఁడు భగదత్తుఁ
డితఁడు సుదక్షిణుఁ డితఁడు నీలుఁ

తే. డితఁడు కాంభోజనాయకుం డితఁడు యవనుఁ
డితఁడు శిశుపాలనందనుం డితఁడు రుక్మి
యితఁడు వడముడి యితఁడు బాహ్లికసుతుండు
ఈతఁడు తదాత్మసంభవుఁ డితఁడు శకుని. 105

వ. అని మఱియు నకుల సహదేవాదులఁ బేరు వేరం జెప్పుచుఁ
బాడఱియున్న పార్థు తేరు చేరం జని రథంబు డిగ్గి నిలిచిన.

చ. తనతొడ మీఁదనున్న విబుధప్రవరాత్మజునుత్తమాంగ
మొయ్యన యరదంబు మీఁద నిడి యా హరిపాదములందు
వ్రాలి లోచనముల నశ్రుపూరము వెసఁ బ్రవహింపఁగ
దీనభావ మాననమున నంకురింప యమనందనుఁ డాతని
తోడ నిట్లనున్. 107

ఆ. అఖిలభూతసముఁడు నపవర్గదాయకుం
డంబుజాతనేత్రుఁ డనుచుఁ బలుకు
మాటదప్పకుండ మాధవా ననుఁ జక్ర
కోటిఁ ద్రుంచి వీరిఁ గూడ నంపు 108

వ. అనిన బలభద్రసాత్యకిసమేతుండై యప్పద్మలోచనుండు
నట్లు పరిదేవనంబొనర్చి తనకుఁదాన యూఱడిల్లి యతని
నూఱార్చుచుండ వెండియు నతం డిట్లనియె. 109

ఉ. తమ్ములు రాజులుం దెగినదానికి నీగతి నిల్వలేక శో
కమ్మున నుంటగాదు తనుఁ గావు మటంచుఁ జతుర్థనుండు
త్రాసమ్మున నన్నుఁ జేరె మనుజప్రభుఁ డంచును నిట్టివానిఁ
జక్రమ్మున కప్పగించి తెకఁ బ్రాణము లేటికి నాకు మాధవా.

క. అని కరుణ పుట్టఁ బల్కెడు
మనుజేంద్రుని మీఁదఁ గృప నమర్చినచూడ్కుల్

కొనసాగ నినిచి హస్తం
బున నిమిరి యతని కపుడు విభుం డిట్లనియెన్. 111

ఉ. ఇంత దలంక నేల ధరణీశ్వర యీ రణభూమిఁబడ్డ భూ
కాంతులలోన నొక్కరుని గ్రక్కున నిచ్చెద వేఁడుమన్న నా
యంతకనందనుండు వినయంబున హస్తయుగంబు మోడ్చి దై
త్యాంతక యీచతుర్ధనృపాగ్రణి నిమ్మన నాతఁ డిట్లనున్.

క. గురు కృప భీష్మాశ్వత్థా
మ రాజరాడ్భీమపార్థ మాద్రేయ దివా
కరసుత ఘటోత్కచాదులు
హరివిక్రము లుండ నితని నడుగఁగ నేలా. 113

వ. అనవుడు ధర్మనందనుండు కృష్ణున కిట్లనియె. 114

సీ. సకలరాజన్యచాపకిరీటఘృష్టపా
దద్వందుఁ డగుసుయోధనునికంటె
మత్ప్రాణసములు భీమప్రతాపులునైన
మరుదుద్భవాదిసోదరులకంటె
పరమపుణ్యులు కృపాపరులైన కర్ణగాం
గేయగురుద్రోణికృపులకంటె
బలవంతులగు మత్స్య పాంచాల కేకయ
పాండ్యాదివిశ్వభూపతులకంటె

తే. నిష్ఠుఁడైనట్టి కుండినాధీశు నిమ్ము
చాలు నిదియె సమస్తవిశ్వంభ రాధి
పత్య మిచ్చుట యేరికిఁ బడయరాని
బ్రహ్మపదము నొసంగుట పద్మనాభ. 115

వ. అనవుడు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె. 116

తే. సర్వభూతదయాపర సత్యసంధ
రాజపూజితపదపద్మ రాజతనయ
శోభనాకార నీచిత్తశుద్ధికాత్మఁ
జాల మెచ్చితిఁ గుండిసేశ్వరునితోఁడ. 117

క. జీవించుఁగాత మత్కృప
జీవాతువు గాఁగ నుభయసేనలు నిప్డే
దేవాధిప శంకర వా
ణీవల్లభు లాత్మలోన నివ్వెఱఁగందన్. 118

ఆ. అని యతండు పల్క నఖిలజనంబును
మిగుల నిదురఁబోయి మేలుకొన్న
చెలువ మూమతింపఁ జెక్కు చెమర్పక
లేచె నపుడు సవ్యసాచితనయ. 119

వ. అంత. 120

క. నరనాథాగ్రణి వినుమా
బరవసమునఁ జచ్చుటయును బ్రతుకుటయు మదిన్
బరికింపక రోషంబున
దురమునకును నుభయబలముఁ [1]దొడరుదునంతన్. 121

క. హలధరుఁడు ధర్మజుండును
బలమున కడ్డంబువచ్చి బ్రతికినచందం
బుల విప్పి చెప్పఁ దిరిగెన్
నలినాక్షునిమహిమఁ దమమనములఁ బొగడుచున్. 122

వ. ఇవ్విధంబున నజాతశత్రునకుఁ బ్రియంబుగా నుభయ
సైన్యంబులకుఁ బ్రాణంబు లొసంగిన సకలలోకాధ్యక్షుం

1 దొడరుటఁ గనుచున్.

డగుపుండరీకాక్షుని యక్షీణప్రభావంబునకు సముందానంద కందళితహృదయులై పురందరాదిబృందారకులు మందారాభినవప్రసూనవర్షంబులు గురియించిరి సిద్ధవిద్యాధరాదులును గిన్నరకింపురుషాప్సరోజనంబులును గీతనృత్యవాద్యంబుల సంతసించి రట్టియెడ సుయోధనాదిధార్తరాష్ట్రులును యుధిష్ఠిరాదిపాండవేయులును ద్రుపదవిరాటాదినానాదేశాధీశ్వరులును గాంగేయుండు మున్నుగాఁ దమతమ సైన్యంబులు గొలువ నరుగుదెంచి రథంబులు డిగ్గి యద్దేవునకుఁ గృతప్రణాములై నిలిచిరా యనంతరంబ విజ్ఞాననిధి యగు నాదేవవ్రతుండు కృతాంజలియై యిట్లని స్తుతించె. 123

దండకము.—శ్రీకామినీమానసాంభోజమిత్రాదళోత్పద్మనేత్రా రిపువ్రాతజైత్రా మునిస్తోత్రపాత్రా సదానందయోగీంద్రసన్మానసారామచైత్రా మహాఘౌఘవల్లీలవిత్రా జగజ్జాలరక్షావిధాదక్షదక్షాత్మజానాథవంద్యా సముద్రంబులన్ బుద్బుదవ్రాతముద్భూతమై పొల్చి తన్నీరమధ్యంబునన్ లీనమైపోవురీతిన్ సరోజాతగర్భాండముల్ నీప్రభావంబుచే నుద్భవించున్ జెలంగున్ మడంగున్ ముకుందా భవద్రోమకూపంబులం దత్సరోజాతగర్భాండసంఘంబు వాతాయనాయాత యాతాణుజాతంబనన్ బొల్చునందొక్క బ్రహ్మాండమధ్యంబునన్ రాజసుల్ తామసుల్ సోమరుద్రాజముఖ్యుల్ జగన్నాయకా తావకానంతకళ్యాణలీలాగుణశ్రేణిలో నొక్కఁడైనన్ యథార్థంబుగా బుద్ధి నీక్షించి వర్ణింపఁగా శక్తుఁడే భక్తవశ్యా పయఃపూరసంపూరితానేక కుంభాంతరద్యోతమానేందు బింబాకృతిన్

పెక్కుదేహంబులం దాల్చియున్ భిన్నమార్గంబులం దోఁచి
నీవద్వితీయుండవై యుండుదీశా భుజాచక్రధారావినిర్భిన్న
రక్షఃకులాధ్యక్షకంఠా నృకంఠీరవా మేదినీ నీర తేజోనభ
స్వద్వియత్స్వాంత చిద్బుధ్యహంకార సంఘంబుచే నీ ప్రపం
చంబు గావించి [1]తద్వ్యోఢసూక్ష్మాకృతింబొల్చు దేహంబుల
న్నిత్యపూర్ణుండవై యుండియుం [2]ద్వచ్ఛరీరంబుజీవాకృతిన్
నీవిశేషంబు చింతింపఁగా శక్తిలేకుండినీమాయగీలించినన్
గామినీపుత్ర హేమాదిసంపద్విశేషంబులం జొక్కినిక్కం
బుగా నమ్మి నెమ్మిన్ భవత్పాదపంకేరుహధ్యానమున్ మాని
గర్వంబునంబర్వి మూఢాత్ములై చచ్చుచుం బుట్టుచున్ సద్గతిం
గాన రంభోజసద్మాధిపా యందులోఁగొందఱత్యంతయుక్తా
త్ములై సుందరీనందనస్వర్ణసంఘంబుల న్రోసి కాంతారముం
జేరి యాధారలింగస్ఫురన్నాభిహృత్తాలు మూలాది
కాధోముఖవ్యస్తచక్రంబులన్ సంతతాభ్యాసలీలాపటు
త్వంబున న్మీఁదుగాఁ ద్రిప్పి యాధారశక్తిం బ్రకాశింపఁగాఁ
జేసి బాహ్యేంద్రియద్వారముల్ మూసి వాతాగ్నులం
గూర్చియు న్మధ్యమార్గంబుచే నూర్ధ్వసంచారులై మీఱఁ
గాఁ జేయుచుం జిత్సుధాపానకేళీరతిం జెందుచున్ నిన్ను నా
నందరూపంబుగాఁ జూతు రాజన్మశుద్ధాత్ములై కొందఱార్యుల్
మదింగామ్యకర్మంబులన్ మాని యేదేవతాభక్తియున్దించి
యేమంత్రసంసక్తియున్ లేక దంభంబు గామంబు లోభంబు
క్రోధంబు మోహంబు మాత్సర్యమున్ దవ్వుగాఁ ద్రోఁచి నీ
చిహ్నముల్ బాహుయుగ్మంబులంబూని నీదాసభావంబు

1 తద్వ్యష్ఠసూక్ష్మాకృతింబొల్చు. 2 దచ్ఛరీరస్థజీవాకృతిన్

నిక్కంబుగా నాత్మలోఁబట్టి నీనామసంకీర్తనల్ జిహ్వాఁ గీలించి నీపాద తీర్థంబు నిత్యంబునుం గ్రోలి నీభుక్తశేషంబు భక్షించి నీదాసవర్గంబుతోఁగూడి క్రీడించి సత్కర్మముల్ నీకు సంప్రీతిగాఁ జేయుచున్ ధన్యులై మించి నీసన్నిధానం బునం దెప్పుడున్ నిత్యసౌఖ్యంబుతో నుందు రంభోధిశాయీ సరోజాతగర్భు న్విచిత్రంబుగా మూర్ఛనొందించి తద్వక్త్రపద్మస్థవేదంబులం గొన్న విన్నాణియున్నట్టి యంభోధిలోఁ జొచ్చి దాఁగున్న యాసోమకుం జోరమీనాకృతింబట్టి కట్టల్కతోఁ జంపి యావేదముల్ బ్రహ్మమోదం బునంబొందఁగా నియ్యవేదుగ్ధవారాశి మధ్యంబునన్ మందరాగంబు మీఁదంగఁ గవ్వంబుగాఁ జేసి భోగీశ్వరుం ద్రాడుగాఁజుట్టి దేవాసురుల్ మచ్చరం బెచ్చఁగాఁ ద్రచ్చుచో నగ్గిరీంద్రంబు[1]పాథోధిలోఁ గ్రుంగినన్ గచ్ఛప స్వచ్ఛరూపం బునం దద్ధరం బుద్ధరింపన్ ధరన్ మోసి దేవాలికిం బ్రాపుగా వే ధరామండలం బెల్ల నుద్దండకేళిన్ హిరణ్యాక్షుఁ డక్షీణదోర్విక్రమారంభుఁడై చాపచందంబునంజుట్టి పాతాళలోకంబున న్నిల్చినన్ ఘోరదంష్ట్రాకరాళోగ్రభూదార లీలావతారంబున న్వైరిదైతేయునింజించి చెండాడి సర్వంసహాకామినిం[2]గొమ్మునన్నిమ్ముగా నెత్తవే మత్తవేదండరీతిన్ మదోద్రిక్తుఁడై యుగ్రదైత్యుండు పుత్త్రుం బరీక్షించి నీ దేవునిన్ స్తంభగర్భంబునం జూపుమాయంచుఁ దానుక్కకంబంబు వ్రేయన్ మహాక్రోధరంహంబునన్ శ్రీనృసింహాకృతిం[3]జేర్చి యద్దానవేంద్రున్ నఖాగ్రంబులన్ జీఱవే

1 పాథోధిలోమగ్గినన్. 2 గొమ్మునన్నిమ్మతో నెత్తవే. 3 బొల్చి.

మీఱటి లోకత్రయిం బాదపద్మంబుల నట్టి వైరోచనిన్
నాగలోకంబునన్ ముంపవే త్రెంపవే సర్వరాజన్యకంఠా
వలిం జండబాహాకుఠారోగ్రధారన్వడిన్ జామదగ్న్యుం
డవై పెంపుమీఱ న్నిలింపారియైనట్టి యాలోకవిద్రావణు
న్నిర్జితైరావణున్ రావణుం బుత్రమిత్రాదియుక్తంబుగా
భానువంశాబ్ధిరాకాసుధాంశుండవై త్రుంపవే బాహు
శక్తిన్ బ్రలంబాది దుష్టాత్ములంగొట్టి కాళింది నుద్ధండ
లీల న్విభేదింపవే రోహిణేయుండవై, దానవుల్
భీకరాకారులై లోకజాలంబు గారింపఁగా వారి
[1]నిర్బంధులంగా మహాశైలకోదండుచే [2]పట్టి గెల్పించిమున్
మించవే కల్కిరూపంబునన్ దేవ నీమోము దిక్పాలురన్
వహ్నియు, న్నేత్రముల్ చంద్రసూర్యుల్, శ్రుతుల్
దిక్కులున్, భూమి గర్భంబు స్వేదంబు పాథోధు, లుఛ్వా
సనిశ్వాసముల్ వాయువుల్, శైలముల్ శల్యముల్,
రోమముల్ వృక్షముల్, నాభి యభ్రంబు శీర్షంబు స్వర్గంబు
భార్యల్ ధరిత్రీరమాకామినుల్ పార్శ్వయుగ్మంబహో
రాత్రముల్ గాఁగ విశ్వాత్ముఁడై పొల్చు నీమోమునన్
బ్రాహ్మణుల్ బాహులన్ రాజు లూరుప్రదేశంబునన్
వైశ్యు లంఘ్రిద్వయిన్ శూద్రులుంబుట్టిన న్వారికిన్ ధర్మ
మార్గోపదేశంబుగా వేదశాస్త్రములం జేసితే నీశ నిన్ను
న్నుతింపంగ నేనెంతవాఁడన్ జడుండన్ మహాహీన
చిత్తుండ మత్తుండ నన్నుంగటాక్షింపుమీ భక్తమందార
వేదాంతసంచార భవ్యప్రకారా నమస్తే నమస్తే నమః.

---

1 శాఙ్గావతారంబుచేతన్ మహాశైల. 2 బిట్టు.

వ. అని బహుప్రకారంబుల వినుతించు నప్పరమభాగవతో
త్తము నయ్యాదవనాయకుండు మృదుమధురభాషణంబుల
నాదరించి ధర్మజ భీమ దుర్యోధనాదులను సకలరాజన్యు
లం దత్తదుచితప్రకారంబుల సంభావించి చిన్నవోయి
యున్న యర్జునుని జేరందిగిచి యాలింగనంబుఁ జేసి హృద
యానందంబుగా గారవించి చరణంబుల కెరఁగిన చతుర్థుని
మన్నించి గాంగేయాదుల ద్వారకానగరంబునకు రానియ
మించి తత్తన్నివాసంబుల కనిచి బలభద్రుండును దానును
జతురంగబల పరివృతుండై నిజస్కంధావారంబునకుం జని
యథోచితంబుగానుండి యమ్మఱునాఁ డుభయసైన్యంబులుఁ
గొలువ ద్వారకానగరంబునకుం జను నవసరంబున. 125

మ. బలముల్సుందరఁగాంచెఁ గాంచనమయప్రాసాద హర్మ్యాగ్ర
నిర్మల గంధోత్కటకుంభ ధిక్కృత నభోమధ్యజ్వలత్తా
రకఁ, లలితారామసదాత్త పల్లవలతాంత ప్రోల్లసత్కో
రకఁ, కలుషాంభోనిధి తారకఁ భటసమగ్రద్వారకఁ
ద్వారకఁ. 126

సీ. భవ్యప్రవాళసంబద్ధమందిరరోచు
లుభయసంధ్యారక్తినోటుపఱప
హరినీలమాణిక్య హర్మ్యాగ్రశోభలు
దర్శకుహూ తమస్తతి జయింపఁ
జారువజ్రాంచితసౌధశృంగద్యుతుల్
పండువెన్నెలతోడ మెండుకొనఁగఁ
బద్మరాగోపల ప్రాసాదకాంతులు
చండభానుప్రభఁ జౌకఁజేయ

తే. సంజ కడ లివి కృష్ణపక్షరాత్రి యామ
లివ్వి శుక్లనిశీథిను లివ్వి దినము
లివ్వియని బుద్ధిలోపల నేర్పరింపఁ
బద్మగర్భుండు నేరఁ డప్పట్టణమున 127

సీ. అనవద్య వేదవేదాంగశాస్త్రాంభోజ
గర్భేశ్వరగేంద్రులై గణనకెక్కి
యధికకోదండవిద్యాభీమ భార్గవ
రామ దాశరథులై రాశి కెక్కి
నానానిధానరత్నవ్రాత గుహ్యకే
శ్వర సింధురాజు లై వాసికెక్కి
రణరంగరిపుసంహరణక్రియాజంభారి
బలభద్రులై చాలఁ బ్రణుతికెక్కి

తే. యజ్ఞములొనర్చి శత్రుల నదటడంచి
వృద్ధి జీవనమునమించి విప్రసేవఁ
జేసి చెలఁగుదు రప్పురసీమ ధరణీ
సురలు రాజులు వైశ్యులు శూద్రవరులు. 128

క. నిరుపమ సుధామయములై
పరమాన్నతిఁజెంది మధ్యభాగవినీల
స్ఫురదురుచిహ్నంబుల చే
సరసత హర్మ్యములు చంద్రసామ్యముదాల్చెన్. 129

సీ. కరికుంభములఁ బోలి కందుకంబుల నేలు
నున్నని వక్షోవచన్ను లమరఁ
గలువ తేకులమీఱి జలచరంబులఁ గేరు
తిన్నని నిడువాలుఁగన్ను లమర

నళులకై వడిఁబొల్చి హరినీలముల గెల్చు
    కప్పున గిరికొను కొప్పు లమరఁ
గుందనంబు హరించి క్రొమ్మెఱుంగుల మించు
    మేలిమిఁ దగు [1]బొదమేను లమర

తే. మెలఁగుదురు ముద్దుఁబలుకులు దొలఁకుకలికి
మొలక నగవుల వెన్నెల తళుకుచిలుక
నలరుదురు లీల రతిపతినైన మిగుల
వలవఁగాఁ జేయ నేర్చిన వారసతులు. 130

చ. ప్రవిమలలీలఁ దద్వనవిరాజితకేళి మహీధరాగ్రవ
జ్రవిపులపద్మరాగరుచిజాలము లెల్లపుడున్ జెలంగుచుం
గువలయపద్మసంహతులకున్మది హెచ్చును గుందులేని యు
త్సవ మొనరింప డెందమున సంశయమంది కృశించె జక్కవల్.

చ. హరియును గుంభసంభవుఁడు నాగ్రహమెత్తి ధరాధరంబు
లన్,శరధుల నుద్ధతింగొన మనంబునఁ జూచిన భీతినొంది ద,
ద్ధరములు వార్ధులున్ హరిపదంబొగిఁ జొచ్చి భయంబు
దక్కి ని, ల్చురమణసాలముల్పరిఖలున్ గనుపట్టె మహో
జ్జ్వలాకృతిన్. 132

వ. అది మఱియును. 133

సీ. కకుబంతవిశ్రాంతగంధేభముల జోడు
    కోడెలో యన నొప్పు కుంజరములుఁ
గమలాప్తరథతురంగంబులపిల్లలో
    యనఁ బొలుపొందు భవ్యాశ్వములును

1 నును మేనులమర.

సౌరమాఘవన కౌబేరరథంబుల
యాకృతిఁ గనుపట్టు నరదములును
శౌర్యతిరస్కృతచండకంఠీరవ
ఘోరపరాక్రమవీరభటులుఁ
తే. గలిగి పరభీషణాకృతిఁ జెలఁగి నిత్య
కాహళీ వేణుడమరు ఢక్కా మురజక
దుందుభి మృదంగ శంఖమత్తుంభ డిండి
మధ్వనిశ్రేణి దిశలు గ్రమ్ముఁగఁ దనర్చు. 134
తే. అమిత తేజోమయంబైన యప్పురంబు
మెఱయుఁ గైవారమై తగుపరిఖతోడఁ
బరిధి సంయుక్తమై పొల్చు పద్మమిత్ర
మండలంబునుబోలి యఖండమహిమ. 135
సీ. పగడంపుఁగంబాలపైఁ గట్టినట్టి ర
త్న మణీనికరతోరణముల చేతఁ
గర్పూరకస్తూరికావజ్రరాసులఁ
గనుపట్టు మేలియంగళ్ల చేత
గందానవల్కి ముక్తారంగవల్లికల్
గీలింపఁదనరు ముంగిళ్ల చేతఁ
గాంచనదండసంకలితనానావస్త్ర
సమితిఁ జెన్నొందు సౌధముల చేత
తే. విమలమణిజాలనీరాజనముల చేత
ననుపమ దశాంగధూపవాసనల చేత
నమితమంగళగీతవాద్యముల చేతఁ
బుడమిలోఁ గడునొప్పు నప్పురవరంబు. 136
వ. కాంచి యబ్బలంబు చేరంజను నవసరంబున. 137

సీ. పరశుతోమరగదాపట్టిసశూలచా
పశరాఢ్యమగు కాలుబలము నడచె
రమణీయ వివిధచిత్రచ్ఛత్రకేతన
కాంతులఁ దగుశతాంగములు నడచె
నూపురకింకిణీనూతనక్వణనంబు
గడునొప్పు ఘనతురంగములు నడచె
దాన గంధాంధలుబ్ధ భ్రమద్భ్రమరఝం
కారనాదము మీఱఁ గరులు నడచెఁ
తే. దమ్ములును గర్ణుఁడును సోమదత్తుఁడును ద
దాత్మజుండును రుక్మియు యవనపతియు
నాదిగా భూమిపతులెల్ల నలమికొలువ
రాజసము మీఱ నారాజరాజు నడచె. 135

వ. తదనంతరంబ యజాతశత్రుండు బాలశీతాంశురేఖయుం
బోని యంకుశంబు కేలంగీలించి మాణిక్యశాతకుంభమయ
ప్రకరచామర రమణీయ ఘంటానిగళభూషితైరావతకుల
సంభవ చతుర్దంత దంతావళారూఢుండై నకుల సహదేవు
లుభయపార్శ్వంబుల నిలిచి వింజామరలు వీవఁ బరిపూర్ణ
చంద్రమండలసమాన పుండరీకంబు భీమసేనుండు పూన
నర్జునుండు తాంబూలకరండంబు ధరింపఁ జతుర్థనుండు
మంద మందానిలంబు సుడియునట్లుగా సురటి ద్రిప్ప సాంబ
సారణ చారుదేష్ణబృహద్భానుభాను దేవ భానువింద సునం
దనాది హరికుమారవర్గంబు ముందట బలసికొలువఁ సాత్యకి
గదప్రద్యుమ్నానిరుద్ధు లుత్తమాశ్వంబులనెక్కి [1]పాయు
తోలంగు లొనరింప నుగ్రసేనుండును నుద్ధవుండును నక్రూ

1 పాయుపకళాయి.

రుండును జేకితానుండును కృతవర్మయు నాదిగాఁగల యాదవవీరులు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామల మున్నిడుకొని పశ్చాద్భాగంబునం గొలిచి యేతేర ఘటోత్కచాది రాక్షసవీరులు తమతమ బలంబులతోడఁ బిఱుందరా వామదక్షిణభాగంబుల సామజంబు లెక్కివచ్చు రామకృష్ణుల తోడ నుచితాలాపంబులాడుచుఁ బౌరపుణ్యాంగనలు రమ్యహర్మ్యాగ్రములనుండి మంగళ పల్లవ లాజపుష్పంబులుచల్లి దీవింప భూసురాశీర్వాదనాదంబును మంగళపాఠకగీతరవంబును వందిమాగధ జయధ్వానంబునుం జెలంగఁ గుంజర ఘంటానినాదంబులు రోదోంతరాళంబు నిండ విజయభేరీ మృదంగ కాహళ వేణు శంఖ తమ్మట మురజ ఢక్కా హుడుక్కాది నానావిధవాద్యధ్వానంబులు లోకాలోక పర్వతంబునఁ బ్రతిశబ్దంబు నిగిడింప నైరావతారూఢుండైన దేవతా సార్వభౌముచందంబునఁ బ్రవేశంబు చేసె నంతక మున్న యాయితంబులయిన హర్మ్య ప్రాసాదంబుల బలభద్రపుండరీకాక్షులు నానాదేశాగత రాజన్యులను భీష్మాదులను విడియ నియమించి యక్రూరు మందిరంబున ననుజ సమేతుండైన యజాతశత్రునుంచి యఖిలబలంబులకు సకల పదార్థంబు లొసంగుచుఁ గతిపయదినంబులు నిల్పి యొక్క నాఁడు కృష్ణుం డుగ్రసేన శూరసేన వసుదేవ పురస్సరంబుగా భీష్మ ద్రోణాది మాన్యులకును యుధిష్ఠిరాది పాండవేయులకును సుయోధనాది గాంధారేయులకును రాధేయాది మహాయోధవీరులకును ద్రుపద విరాటాది నానా దేశాధీశ్వరులకును ఘటోత్కచాలంబుస హాలాయుధాది

రక్షోనాయకులకును జీని చీనాంబరానర్ఘ్య రత్నాభరణ తురంగరత్న చతుర్దంతదంతావళాది నానావస్తువ్రాతం బులును వలయువారలకు దోరహత్తుగా నొసంగి యందఱ ననిచి యందు నయ్యుధిష్ఠిరున కెఱింగించి యర్జునుం దన యొద్ద నునుచుకొని సుఖంబుండెనంత. 139

సీ. అయ్యుధిష్ఠిరుఁడు భీష్మాది కౌరవ వృద్ధు
లును ధార్తరాష్ట్రులు జనపతులును
దనతోడ నేతేర ననుపమసంతోష
భరితుఁడై ఖాండవప్రస్థమునఁ బ్ర
వేశంబుచేసె భూమీశులనందఱఁ
దమనాళ్ల నిల్పి సోదరులుఁ దాను
నిత్యసంతుష్టులై నిరతంబు బ్రాహ్మణ
పూజసేయుచు మహాభూరిమహిమఁ
తే. గీర్తిసౌహార్దములు గడుపూర్తిఁ జెంది
యెపుడుఁ దనయందె నిలువంగ విపులశౌర్య
వీర్యధైర్యజవములతో విభవ మెసఁగఁ
జిరతరశ్రీల రాజ్యంబు సేయుచుండె. 140

క. అని శుకయోగీంద్రుం డ
య్యనిమిషరాట్పౌత్రునకు దయాపరుఁడై చె
ప్పిన వృత్తాంతము సంతస
మున సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెన్. 141

శా. శ్రీమత్కాశ్యపగోత్రదుగ్ధజలధిశ్రీకామినీసోదరా
హేమక్ష్మాధరధీర బుద్ధిజితభోగీంద్రామరాచార్య సం
గ్రామోపార్జితభూరిభూవరసమగ్రప్రాభవా పన్నగ
స్వామి క్ష్మాధరకూర్మభూమిభరవాస్తవ్య స్వబాహార్గళా.

క. కృష్ణాంబికాకుమారక
కృష్ణాంఘ్రిసరోజయుగళకీర్తనశీలా
నిష్ణాత నిఖిలభువనచ
రిష్ణు సముజ్జ్వలయశః పరిష్కృతమూర్తీ. 143

శ్రీవృత్తము.—
శ్రీరమణీవార సరసీరుహారుణప్రభుర
శిష్టజనరక్షణమహీమం
పార జలజాతనయనాహ్లాదయశైవసు
ధారక నదీవరగభీరా
శైరిపసుధాకరమణవారణసమూహహృగ
వల్లభ నిలింపపతిభోగా
నీరజభవప్రణయినీకరలసత్కమల
నిస్సృతమరందనిభవాక్యా. 144

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్రపవిత్ర చరిగొండ తిమ్మ నామాత్యపుత్ర సకలవిద్యాపారీణ శతఘంట సురత్రాణ సుకవిజనవిధేయ ధర్మననామధేయప్రణీతం బయినచిత్రభారతం బనుపురాణకథయందు సర్వంబును నష్టమాశ్వాసము.

సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1934.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 4 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము | ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కని ప్రతి | | 2 | 0 |
| సర పద్యములు | ... | 0 | 2 |
| ంగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| శావతారచరిత్ర | ... | 3 | 0 |
| గోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| * ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 0 |

* ఇవి అచ్చులోనున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | | (అచ్చు) | |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | " | |
| అరణ్యపర్వము | ... | " | |
| విరాటోద్యోగపర్వములు | ... | " | |
| భీష్మద్రోణపర్వములు | ... | " | |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | " | |
| శాంతిపర్వము | ... | " | |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | | " | |
| నందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| చరిత్ర, ద్విపద | ... | 2 | 0 |
| ంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| పద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| సుందరీపరిణయము | ... | 0 | 6 |
| చతంత్రము, నారాయణకవికృతము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |

| | | ప్రతి 1-కి రూ |
|---|---|---|
| పంచతంత్రము, వేంకటనాథకవికృతము | ... | 1 |
| డిటో [illegible] | ... | 1 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు | ... | 1 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 1 |
| డిటో సురభివ్యాఖ్యాసహితము | ... | 3 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి | ... | 2 |
| భోగినీదండకము | ... | 0 |
| మానాన్నగారిముచ్చట, వే॥ ప్రభాకరశాస్త్రి | ... | 0 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 1 |
| యయాతిచరిత్ర, ఆకొండి వ్యాసమూర్తి | ... | 0 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు | ... | 3 |
| " II " | ... | 3 |
| " III " | ... | 3 |
| నీతిశతకసంపుటము I " | ... | 3 |
| రాజశేఖరవిలాసము | ... | 0 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 · |
| రసికజనమనోభిరామము | ... | 1 |
| రంగరాయచరిత్రము | ... | 0 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 3 ( |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 ( |
| రామరాజీయము | ... | 0 1: |
| రామాభ్యుదయము | ... | 1 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 1 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 |